# భారతి

మాసపత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

సంపుటము : 65 డిసెంబరు 1988 సంచిక : 12

విడిపత్రిక వెల ఐదురూపాయలు

## విషయానుక్రమణిక

డిసెంబరు - 1988

# స్వాస్
# మింట్స్




## అమృతాంజన్ లిమిటెడ్
వారి మరొక గొప్ప తయారి

**Amrutanjan Limited** 

# స్వవిషయం

ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారి పెద్ద వ్యాసం "శ్రీకృష్ణదేవరాయలు-నవరత్న కవులు అష్టదిగ్గజ కవులు" శాసన సాహితీ ప్రియులకు మనోరంజకంగా ఉండగలదు. ఈ వ్యాసం మిగతాభాగం వచ్చే సంచికలో వేయగలము.

నాటక కళకు సరికొత్త భాష్యం చెప్పిన కీ॥శే॥ తిరుపతి వేంకట కవుల పాండవ విజయాన్ని శ్రీమతి ఎం. వి. ఎస్. లక్ష్మిగారు దర్శించిన తీరు పాఠకులకు తృప్తిని కలిగించగలదు.

జాతీయ రాజకీయాలలో 1988నాటి అలహాబాద్ ఉపఎన్నిక వైశిష్ట్యాన్ని గురించి శ్రీ డి. సుందరరామ్‌గారి సమీక్షాత్మక వ్యాసం వర్తమాన రాజకీయ ధోరణుల గురించి, ఓటరుల అవగాహన గురించి కొంతయినా వెల్లడి చేయగలదు.

ఇక శ్రీ పాలడుగు వెంకటేశ్వరరావుగారి "లంక మేత గోదావరి ఈత" కథ విలక్షణమైన ఇతివృత్తాలను కోరుకునేవారిని అలరించగలదు.

దేవాలయ స్త్రీల స్థితిగతులు మధ్యాంధ్రయుగంలో ఎలా ఉండేవో డా॥ మైనేని కృష్ణకుమారిగారి పరిశోధనా వ్యాసం కళ్ళకు కట్టినట్లు చూపగలదని ఆశిస్తున్నాము.

శ్రీ అరవింద నాడకర్ణిగారి "శాస్త్రములలో వామనుని త్రిపాదములు" ఎన్నో రకాల ఆలోచనలకు దారి చూపగలదు. జ్ఞానేతిహాస, తత్వ, మనస్తత్వ శాస్త్రాలపై కొద్దిపాటి అవగాహన కైనా ఈ వ్యాసం దోహదపడగలదని నమ్ముతున్నాము.

కవితాత్మ, మోక్షం, పునరుత్థానం, ప్రజాకవి, తను వేణువు, విశ్వచేతన - ఇత్యాది రచనలు కవిత్వంలోని భిన్న దృక్పథాలకు అద్దం పట్టగలవు.

తొందరలోనే భారతిని త్వరత్వరగా విడుదల అయ్యేలా చూడగలము.

# కవితాత్మ

సి. కామేశ్వరరావు

ఈ మంజుల మనోజ్ఞ
వసంత కుసుమ పరాగ పరిరంభంలో
నేనొక సురభిళ సుప్రభాత
సువర్ణమయ భావనా వీచికను!
ఈ మందపవన
సుందర వదనారవిందంలో
నేనొక ప్రశాంతారామ
చైతన్య మేఘమాలికను!
ఈ స్నిగ్ధ సౌందర్య
పయోరుహ పత్రనేత్ర వీక్షణాలలో
నేనొక ఆనందాకర్షణ
సహృదయ స్నేహవాటికను!
ఈ చంచల కాలచక్ర
పరిభ్రమణ విభ్రమంలో
నేనొక నిగ్రహానుగ్రహ
జీవిత సుధామాధురీ మధుపాత్రను!
ఈ నూతన ప్రవర్ధమాన
ఉదాత్తవాణీ నినాదంలో
నేనొక శారద తారకాహార
అనురాగ విలాసరేఖను!!

# మానస పుత్రిక

పొన్నపల్లి మైత్రీమాధుర్య

భావ స్వర్గ శిఖరాల కదుష్ణ చుంబనలూ-
సుఖ దుఃఖానుభూతుల గాఢ సమాశ్లేషాలూ-
ఆవేశాలోచనల నడుమ సానంద బిబ్బోక విహారాలూ-
ఏకాంత మథన - మదన కేళీవిలాసాలూ-

-అనుభవించి - అనుభవించి-

పరధ్యానపు శాపనార్థాలకి గురికాకుండా
పదజాలపు బలాత్కారాలకి బలి కాకుండా
ఛందో-వ్యాకరణాల 'శస్త్రచికిత్స' అవసరం లేకనే
కొట్టివేతల 'వేదనల్ని' నిబ్బరంగా భరిస్తూ-

కాగితాల మెట్టినింట
కాకతాళీయంగా
ఒక మెరపు మెరిసింది
నా ఊహ ప్రసవించింది!
-ఎంత హాయి! ఎంత ఊరట!



ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి

# శ్రీకృష్ణదేవరాయలు నవరత్నకవులు - అష్టదిగ్గజకవులు

శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమునందు అష్టదిగ్గజకవులు కలరని ప్రసిద్ధము. ఇందుకు శాసన ప్రమాణమును కలదు.[1]

### తిప్పలూరు శాసనము

అది తిప్పలూరు శాసనము అందు "శ్రీకృష్ణదేవరాయ మహా రాయలవారు అష్టదిగ్గజ కవీశ్వరులకు ధారవోసి యిచ్చిన తిప్పలూరు అగ్రహారమందు దొమ్మర్లు ఇచ్చు పన్ను ఈ గ్రామముననున్న శివ, విష్ణువుల దేవాలయముల ఆరగింపులకు సమర్పించిరి" అని మాత్రమే కలదు[2] ఇది శ్రీకృష్ణదేవరాయల శాసనము కాదు. ఇతర శాసనము

### నంది దుర్గాలయ శాసనము

మఱొక నంది దుర్గాలయ శాసనమందును అష్టకవిదిగ్గజముల ప్రసక్తి కలదు[3] ఆ శ్లోకమిది

"యత్కీర్తి ర్భువనైకభూషణ మభూద్యస్య ప్రసాదాన్నరాః
సర్వే రాజసమానతా ముపగతా స్సంప్రాప్యవిత్తం బహు
యస్యాష్టౌ కవిదిగ్గజాః పృథుయశోభారై ర్జగచ్ఛోభనా
యద్దానోదక సామ్యమేవ సరితా మాసేతు శీతాచలమ్." 8శ్లో.

ఇందు "శ్రీకృష్ణరాజప్రభువు"నకు మహాయశస్వులు, జగదలంకారులునైన కవిదిగ్గజములు ఎనమండుగురు కలరని కలదు. ఇట్లున్న నంది దుర్గాలయ శాసనము "క్రీ.శ. 1527లో శ్రీకృష్ణదేవ రాయలచే వేయించబడినదని, "శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు లేఖద్వారా నిశ్చయించినారు." అని కె యస్. కోదండరామయ్యగారి ప్రతిపాదనము[4] ఆమోదమును శాసనమునందు కాలమును తెలుపు శ్లోకమిది

"నంది దుర్గాహ్వయగ్రామే సోమశంకర రూపిణః
కల్యాం త్ర్విభాగమగుణే ష్వబ్దేషు జగతీపతిః 11శ్లో.

ఇందు శాసనకాలము కలియుగమునందు ఋతు, ఇభ, ఆగమ, గుణ - అబ్దమని కలదు, అనగా కలియుగమునందు 3486వ సంవత్సరమని అర్థము అది శ్రీకృష్ణదేవరాయల కాలమునకు సరిపడ నందున "ఇందు పేర్కొనబడిన కృష్ణరాజు మరియొకడై యుండ వచ్చును." అని శాసనమును ప్రకటించిన టి. యల్. నరసింహా రావుగారి అభిప్రాయము[6]. కాని, నిడుదవోలు వేంకటరావుగారు ఇట్లు నిశ్చయించిరి.[7]

"ఋతు=6, ఇభ=4, ఆగమ=5, గుణ=3 అని పరిగ ణించిన ఈ కాలము కలిశకము 3546 అగును ప్రస్తుత కలి శకము 5073. కావున, 5073 – 3546 = శాసనకాలము- 1527 అగును......కాబట్టి నంది దుర్గాలయ శాసనకాలము క్రీ.శ. 1527 అని నిర్ణయమగును."

ఇది కోదండరామయ్యగారు ఆమోదించుట చిత్రము. ఇందు ఇభ=8 గాక 4 అని, ఆగమ=4 గాక 5 అని గ్రహించుట విచిత్రము ప్రస్తుత కలిశక సంవత్సరమునుండి శాసన కలిశక సంవత్సరమును తీసివేసిన వచ్చు సంఖ్య క్రీస్తుశక సంవత్సర మగుననుట మహా విచిత్రము నిడుదవోలు వేంకటరావుగారు నిశ్చయించినపుడు క్రీస్తు శకము 1971లో కలిశకము 5078 కాని, ప్రతి సంవత్సరమును కాదు 1988లో పై లెక్కను పాటించిన, 5090 – 3546 = క్రీస్తు శకము 1584 అగును. ఇట్లు శాసనకాలము ప్రతి సంవత్సరము ఒక సంవత్సరము పెరుగును ఇంతకు శాసనకాలము కలియుగము 3486వ సంవత్సరము. క్రీస్తుశకము, కలియుగము 3101వ సంవత్సరమునందు ప్రారంభమైనది. క్రీస్తుశకము 78వ సంవత్సరము నందు శాలివాహన శకమువలె. కనుక నంది దుర్గాలయ శాసనకాలము 3486 – 3101 = 385 క్రీస్తుశక సంవత్సరమగును.

అది శ్రీకృష్ణదేవరాయల కాలము కాదు అందువలన "కృష్ణరాజు మరియొకడై యుండవచ్చును" అనుటకు మఱి అవకాశము కలదు. కాని క్రీ.శ. 818లో కృష్ణరాజు మఱియొకడుమాత్ర మెవడు కలడు? అంతేకాదు శాసనమునందు గజపతి ప్రసక్తి కలదు. (8, 17 శ్లో) ఆ కాలమునందు గజపతి కూడ ఎవడు కలడు? కనుక శాసనకాలము తప్పు మాత్రమే కాదు; శాసనమే కూటసృష్టి. ఇందుకు మఱొక నిదర్శనము కలదు. నంది దుర్గాలయ శాసనమునందు ఇష్టదేవతా స్తుతి పది శ్లోకములందు కలదు. అందొక శ్లోకమిది

"విష్ణ్వాద్యానాథ హరయో యస్య వామభుజే మతాః
నాదాన్తా కళికా యస్యతం విశ్వేశ్వర మాశ్రయే." 6శ్లో.

ఇందు విష్ణువు హరుని వామభుజమునందు ఉన్నట్లు కలదు. అంతేకాదు "శ్రీకృష్ణ రాజప్రభువు" విశ్వేశ్వరుని ఆశ్రయించినట్లు కలదు శ్రీకృష్ణదేవరాయలు వేంకటేశ్వరాశ్రితుడు కాని విశ్వేశ్వరాశ్రితుడు కాడు. పరమ వైష్ణవుడు కాకపోయినను, విష్ణువును శివుని వామభుజస్థునిగ భావించు వీరశైవుడు కాడు. సామాన్య శైవుడును కాడు. కనుక నందిదుర్గాలయ శాసనము కూటశాసనము (స్పూరియస్ ఇన్స్క్రిప్షన్) కావలయును

అయినను శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమునందు అష్టదిగ్గజ కవులు కలరనుటకు తిప్పలూరు శాసనము తిరుగులేని ప్రమాణమే. అందలి "శాలివాహన శకవర్షములు 1450 అగు నేటి సర్వజిత్తు సం. శ్రావణ బ. 30 సోమవారము" సరియైన శాసనకాలము సరిగా 26-8-1527 తేదీ [8]

## నవరత్న కవులు

శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమునందు నవరత్నకవులు కలరను అభిప్రాయములును కలవు నంది తిమ్మన పారిజాతాపహరణమునందు,

"భువన విజయాఖ్య సంస
న్నవరత్న విభాప్రభాత నలినాప్త!-" 1ఆ. 5ఆ

అని శ్రీకృష్ణదేవరాయలకు ఆశ్వాసాంత సంబోధనము కలదు ఇట

"భువన విజయ = భువన విజయమనెడు, ఆఖ్య = పేరుగల సంసత్ = సభయందలి, నవరత్నవిభా = నవరత్నముల కాంతులకు, ప్రభాత నలినాప్త = బాలసూర్యుడైనవాఁడా!, (సూర్యోదయమున సూర్యకిరణ సంబంధమున మణులు దేదీప్యమానమగుట సహజము కృష్ణరాయలు బాలసూర్యుని పగిది నా కొలువు కూటమున వెలుంగ నమ్మణుల కపూర్వ శోభ కల్గెనని భావము."

అని టీక వ్రాసిన విద్వాన్ దూశి రామమూర్తి శాస్త్రిగారు తెలిపిన విశేషార్థమిది.

"కృష్ణరాయని కొలువున నష్టదిగ్గజ కవులుండిరని కింవదంతి. కాని నవరత్న శబ్దసారస్యము ననుసరించి నవరత్నములుండిరేమో యని యనుమానము పొడమెడి."

శ్రీకృష్ణదేవరాయల కాలమున అష్టదిగ్గజ కవులు కలరనుట కింవదంతి కాదు యథార్థము. సమకాలిక శాసన ప్రమాణసహితము. అయినను, నవరత్నకవులును కలరనుటకు అవకాశము కలదు. అల్లసాని పెద్దన మనుచరిత్రమునందు,

"విద్యాఖేలనభోజ!" 1ఆ. 2ఆ

అని శ్రీకృష్ణదేవరాయలకు ఆశ్వాసాది సంబోధనము కలదు "విద్య=చదువుచేత, ఖేలన=క్రీడించుటయందు, భోజ=భోజరాజైనవాఁడా - భోజరాజువలె విద్యా వినోదముచేతఁ బ్రొద్దుపుచ్చువాఁడా యనుట" అని కొమండూరు అనంతాచార్య విరచిత టీకా తాత్పర్యములు. భోజరాజాస్థానమునందు నవరత్నకవులు కలరని ఒక ప్రతీతి కలదు. కనుక అపర భోజుడైన శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమునందును నవరత్నకవులు ఉండుట సంభవమే. సంభావ్యమే.

"నైన్ పొయెట్స్, నోన్ ఏజ్ నవరత్నాస్ ఎడార్న్డ్ హిజ్ కోర్ట్,......సమ్ సే దట్ దే వర్ ఓన్లీ ఎయిట్ ఇన్ నంబర్ అండ్ వర్ నోన్ ఏజ్ అష్టదిగ్గజాస్."

అని వసుంధరా ఫిల్లి యోజాత్‌గారి అభిప్రాయము.[9] ఆధారము తెలుపలేదు పై ఆధారము కాఁజాలదు ఇవి భిన్నాభిప్రాయములైనను ఏకాభిప్రాయము కావచ్చును. పారిజాతాపహరణ, మనుచరిత్రల రచనాకాలములందలి నవరత్నకవులే అనంతరము, తిప్పలూరు శాసనమునందలి అష్టదిగ్గజ కవులు కావచ్చును. ఇది ముందు ఇంకను వివరింతును.

## అష్టదిగ్గజ కవులు

పురుషార్థప్రదాయిని అను పత్రికయందు ప్రకటితమైన కొండవీటి దండకవిల వృత్తాంతమునుబట్టి, గురజాడ శ్రీరామమూర్తిగారు ఉట్టంకించిన అష్టదిగ్గజ కవుల పట్టిక ఇది [10]

| కవీశ్వరుల పేర్లు | గ్రంథముల పేర్లు |
|---|---|
| 1) అల్లసాని పెద్దన్న. ఈయన దూపాటిసీమ లోని ద్రోణాదుల కాపురస్థుడు. ఈయనకు నాంధ్రకవితా పితామహుఁడను పేరు గలదు. | 1) మనుచరిత్రము 2) రామస్తవరాజము 3) అద్వైతము |

| | |
|---|---|
| 2) భట్టుమూర్తి. ఈయన భట్టుపల్లె కాపురస్థుఁడు | 1) నరస భూపాలీయము |
| | 2) వసుచరిత్రము |
| 3) ముక్కుతిమ్మన్న. ఈయన గన్నవరము కాపురస్థుఁడు. | పారిజాతాపహరణము |
| 4) పింగళి సూరన్న | రాఘవ పాండవీయము |
| 5) తెనాలి కాపురస్థుఁడగు తెనాలి రామలింగము ఈయన యింటి పేరు ఈశ్వరప్రెగ్గడవారు | పాండురంగ విజయము (పాండురంగ మాహాత్మ్యము) |
| 6) సిడెడ్డు డిస్ట్రిక్టు కాపురస్థుఁడు రామభద్రకవి | |
| 7) శంకరకవి | |
| 8) ధూర్జటి | |

ఇందు "శంకరకవి కృష్ణరాయల సంస్థానములోనివాఁడు కాఁడని మాత్రము చెప్పవలసి యున్నది." అని గురజాడ శ్రీరామమూర్తిగారి అభిప్రాయమే [11]

శంకరకవి గ్రంథము హరిశ్చంద్రోపాఖ్యానము. అది ఈడూరి ఎల్లనకు అంకితము అతడు "కుతుబన మలకేంద్ర కృపా సమగ్ర మహిమాన్వితుఁ"డని అవతారిక యందు కలదు "ఈ కుతుబన మల కేంద్రుఁడు సాధారణముగా నిభరామని చెప్పెడి యిబ్రహీము కుమారుఁ డయిన మహమ్మదుషా ఇతఁడు క్రీస్తుశకము 1581వ సంవత్సరము మొదలుకొని 1611వ సంవత్సరము వఱకును గోలకొండలో రాజ్యము చేసినందున కవియు నప్పుడే యుండి పదునాఱవ శతాబ్దాంతముననో పదునేడవ శతాబ్దియందో యీ పుస్తకమును జేసియుండును." అని కందుకూరి వీరేశలింగముగారి అభిప్రాయము [12] కాని, "కుతుబన మల్కు అనునది కులీకుతుబ్‌షాకు మాత్రమే యన్వయించునని నా యభిప్రాయము......అతఁడు క్రీ.శ. 1511 మొదలు 1543 వఱకును రాజ్యము చేసినవాఁడు. కావున, కృతిపతియుఁ గవియుఁ గూడ నా కాలమున నున్నవారనియు హరిశ్చంద్రోపాఖ్యాన మా కాలమున రచితమయినదనియుఁ జెప్పవచ్చును." అని చాగంటి శేషయ్యగారి ప్రత్యభిప్రాయము.[13] అంతేకాదు శంకరకవి తండ్రి దేచయామాత్యుడు అతడు "తెనాలి రామకృష్ణ కవికృత ఉద్భటారాధ్య చరిత్ర కృతిపతి దేచనామాత్యుడు" కావచ్చునని కూడ చాగంటి శేషయ్యగారి ఊహ [14] ఇది ఊహామాత్ర శరణ్యమే

శంకరకవి అష్టదిగ్గజ కవులలో ఒకడగుటకు కందుకూరి వీరేశలింగముగారి కాలనిర్ణయము వలన కాలదోషము పట్టినది చాగంటి శేషయ్యగారి కాలనిర్ణయము వలన కాలము కలిసివచ్చినది అయినను కొండవీటి దండకవిల వృత్తాంతముకంటె ప్రమాణాంతరము కానరాదు ఆసలు దండకవిల వృత్తాంతము అంత ప్రమాణము కాదు. కాఁబట్టి శంకరకవి అష్టదిగ్గజ కవులలో ఒకడనుట నిష్కృష్ట సిద్ధాంతము కాదు.

కొండవీటి దండకవిలకంటె కొంత ప్రమాణమైన విశ్వనాథ స్థానాపతి రాయవాచకమునందు ఇట్లు కలదు

"రాయల వారున్ను చాలా సంతోషబడి ముక్కు తిమ్మయ్య అల్లసాని పెద్దయ్య మాదనగారి మల్లన మొదలైన కవీశ్వరులతో కృతు లంద్దుకోవలెనని.........పారిజాతాప హరణమున్ను మనుచరిత్రాను చెప్పుమని ఆనతిచ్చినారు."

(1982 ముద్రణ. పుట 80)

ఇందు ప్రసక్తులైన నందితిమ్మన, అల్లసాని పెద్దన, మాదయగారి మల్లన అష్టదిగ్గజ కవులలోని ముగ్వురు పారిజాతాప హరణమును రచించి శ్రీకృష్ణదేవరాయలకు అంకితమిచ్చిన అరణపుకవి నందితిమ్మన, మనుచరిత్ర రచించి శ్రీకృష్ణదేవరాయలకు అంకితమిచ్చిన ఆంధ్ర కవితా పితామహుడు అల్లసాని పెద్దన, రాజశేఖర చరిత్రమును రచించి శ్రీకృష్ణదేవరాయలకు అంకిత మీయకపోయినను మాదయగారి మల్లన అష్టదిగ్గజ కవులనుట నిర్బాధకము. నిర్వివాదము.

మాదయగారి మల్లన రాజశేఖర చరిత్రము నాదిండ్ల అప్పయ మంత్రికి అంకితము అప్పయమంత్రి శ్రీకృష్ణదేవరాయల అప్పాజీ, మహామంత్రి అయిన సాళువ తిమ్మరుసునకు మేనల్లుడు రాయవాచక మును అనుసరించి కుమార ధూర్జటి రచించిన కృష్ణరాయ విజయము నందు ఇట్లు కలదు

"అటుల జయలక్ష్మిఁ గైకొని హరులఁ గరులఁ
బరుల ధనపంక్తులను దన వశముఁజేసి
వెలయు శ్రీకృష్ణరాయల విభవ గరిమఁ
గాంచి కన్నులపండువు గాఁగ నపుడు 47ప.
సరస సాహిత్య రచన విస్ఫురణ మెఱయ
సారమధురోక్తి మాదయగారి మల్ల
నార్యుఁడల యల్లసాని పెద్దార్యవరుఁడు
ముక్కుతిమ్మన మొదలైన ముఖ్యకవులు 48ప.
వినిపించిరపుడు వారికిఁ
గనకాంబర భూషణములు ఘనత నొసఁగి యా
జనవరుఁ డప్పాజిఁ గనుం
గొని యిట్లని పలికెనపుడు కుతుకంబలరన్ "49ప. 3ఆ.

ఇందు "వినిపించిరపుడు" అనునెడ "వినుతించిరపుడు" అను పాఠాంతరము కలదు అయినను విస్ఫురణ మెఱయు సరస సాహిత్య రచన, సారమధురోక్తి వినుతించుటకుకంటె వినిపించుటకు అనుగుణ

ములు. ఏనుక "హారికి కనకాంబర భూషణములు" శ్రీకృష్ణదేవ రాయలు "ఘనత నొసఁగు"ట సుసంగతమగును. రచన వినిపించుట అనగా కృతిని అంకితమిచ్చినట్లే. అది మాదయగారి మల్లన రచించిన మఱొక కృతి అగును కనుక, నంది తిమ్మన, అల్లసాని పెద్దన, మాదయగారి మల్లన అష్టదిగ్గజ కవులనుట నిష్కృష్ట సిద్ధాంతము.

కుమార ధూర్జటి పేరు వేంకటార్యుడు. ఇతని పెదతాత శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యము రచించిన అసలు ధూర్జటి ఆరవీటి చినవేంకటాపనీంద్రుడు కుమార ధూర్జటిని పిలిపించి అనిన మాటలివి·

"స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కులకెట్లు గల్గెనో
యతులిత మాధురీ మహిమ నా మును మీ పెదతాత చాల స
న్నుతిఁ గనెఁ గృష్ణరాయల మనోజ్ఞ సభన్ వినుమీవునట్లు మ
త్కృత బహుమాన వైఖరులఁ గీర్తి వహింపుము ధాత్రిలోపలన్."
29వ పీఠిక.

ఇది "స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కులకెట్లుగల్గె నీ యతులిత మాధురీ మహిమః హా! తెలిసెన్" అను ప్రసిద్ధ చాటు పద్యమునకు ప్రతికృతి "కృష్ణరాయల మనోజ్ఞసభను చాల సన్నుతి గనిన ధూర్జటి అష్టదిగ్గజ కవులలో ఒకడగుట సుకరము అంతేకాదు కుమార ధూర్జటి కుమారుడు లింగరాజు రచించిన శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్యమను మఱొక గ్రంథమునందు ఇట్లు కలదు.[15]

"శ్రీ కాళహస్తి గౌరీనాథ పదపద్మ
సద్భక్తి యుక్తి నిశ్చలతఁగాంచి
సార సుధాసార సరసోక్తి గుంభనఁ
గాళహస్తి మహత్త్వ కథనొనర్చి
కృష్ణరాయ కిరీట కీలితమణి గణా
ర్చిత పదాబ్జద్వయశ్రీ వహించి
యాసేతు కాశీతటావనీ విఖ్యాత
సత్కీర్తి విస్ఫూర్తిఁ జాలవెలసి

ధరణిఁ జెలువొందె నే కవీశ్వరవతంస
రత్న మమ్మహనీయ ధూర్జటి సుధీంద్రుఁ
దలఁతు జలనిధి వీచికా కలకలాను
కారి భూరి కవిత్వ వాక్పటిమ గులుక"

ఇందు ధూర్జటి "కృష్ణరాయ కిరీట కీలితమణి గణార్చిత పదాబ్జశ్రీ వహించి"నట్లు ఇదమిత్థముగ కలదు అనగా శ్రీకృష్ణదేవ రాయలు ఆంధ్రకవి ధూర్జటికి పాదాభివందనము చేసెనని అర్థము. ఇది" బిరుదైన కవి గండపెండేరమున కీలితగుదని" "అల్లసాని పెద్దన "పాదమునఁదొడు"గుట కంటె ఇతోధిక విశిష్టమైన అపూర్వ సత్కారము ఇట్టి అపూర్వ సత్కారము నందిన ఆంధ్రకవి ధూర్జటి అల్లసాని పెద్దనవలె అష్టదిగ్గజ కవులలో ఒకడగుట తథ్యము.

ఇంతకు నందితిమ్మన, అల్లసాని పెద్దన, మాదయగారి మల్లన, ధూర్జటి నలుగురును అష్టదిగ్గజ కవులలోనివారే అగుట నిరాఘాటము. అనుట నిష్కృష్ట సిద్ధాంతము.

## అయ్యలరాజు రామభద్రుడు

ఇక రామభద్రకవి. ఇతడు అయ్యలరాజు రామభద్రుడని, పుత్తేటి రామభద్రుడని, ఇద్దఱును ఒక్కడేఅని, ఇద్దఱును ఇద్దఱేఅని మఱి అభిప్రాయ భేదములు కలవు. "అయ్యలరాజు రామభద్రుఁడు కృష్ణదేవ రాయలకాలమునందు మిక్కిలి చిన్నవాఁడై క్రొత్తగా గవిత్వము చెప్పుట కారంభించినవాఁడు.. ఇతఁడు కొంతకాలము పింగళి సూరన్నకును, తరువాత రామరాజభూషణునకును సమకాలికుడుగానుండి కృష్ణదేవ రాయల మరణానంతరమున నించుమించుగా నలుబది యేబది సంవత్సరములు బదికి 1581వ సంవత్సర ప్రాంతమునందు మృతినొందెను" అని కందుకూరి వీరేశలింగముగారి అభిప్రాయము[16] అయ్యలరాజు రామభద్రుని రామాభ్యుదయము గొబ్బూరి నరసరాజునకు అంకితము. నరసరాజు అళియ రామరాయలకు మేనల్లుడు అళియ రామరాయలు సదాశివరాయలను సింహాసనమునందు ప్రతిష్ఠించినట్లు రామాభ్యుదయమునందు కలదు. (55వ. పీఠిక.) అది 1543నాటి సంఘటన[17] అంతేకాదు అళియ రామరాయల మూడవ కుమారుడు తిమ్మరాజు రాచూరి దుర్గాధిపతి. అది మొదలు అతడు రాచూరి తిమ్మరాజు. ఇతడు రాచూరి తిమ్మరాజు అని రామాభ్యుదయమునందు కలదు. (56, 61వ. పీఠిక) ఇది 1550నాటి సంఘటన[18] "కావున క్రీ శ. 1555 ప్రాంతమున" రామాభ్యుదయము "రచితమయ్యెనని" చాగంటి శేషయ్యగారి నిశ్చయము.[19] అంతేకాదు "రామభద్రకవి కృష్ణదేవ రాయల యాస్థాన కవిదిగ్గజులలో నొకఁడని ప్రతీతి కలదు. కాని యది యనుమానాస్పదమైనది. ఇతఁడు రామాభ్యుదయమును రచించునాఁటికి నలువది లేక నలుపదియైదేండ్లవాఁడని తలంచుట స్వాభావికము. ఏఁబది యేండ్లవాఁడని యనుకొనినను, నీతని జననము 1505-1510 ప్రాంతమగును. రాయలు స్వర్గము నలంకరించునప్పటికి, 20-25 ఏండ్ల వయసులో విద్యార్థి దశయందే యుండునుగాని కవియై కవిదిగ్గజుఁడని ప్రఖ్యాతి నార్జించినవాఁడుగా నుండుట యసంభవము. ఆస్థాన కవులలో నొకఁడుగా నుండెననుట కాధారములు గనుపడలేదు." అని కూడ చాగంటి శేషయ్యగారి అభిప్రాయము.[20]

అయ్యలరాజు రామభద్రుడు రామాభ్యుదయ రచనాకాలము నాటికి (1555) ఏబది యైదేండ్లవాడని అనుకొన్నను, శ్రీకృష్ణదేవ రాయల ప్రాభవ కాలాంతమునాటికి (1524) సుమారు పాతికేండ్ల

వాడే అగును. ఆ వయస్సున ఆస్థానకవి అగుటయే సుసంభవము కాదు. అష్టదిగ్గజకవి అగుట మఱి అసంభవమే కనుక అయ్యలరాజు రామభద్రుడు అష్టదిగ్గజ కవులలో ఒకడు కాడు.

సకల కథాసార సంగ్రహము

సకల కథాసార సంగ్రహమని ఇప్పటికిని ఒక అముద్రిత గ్రంథము మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథ భాండాగారమునందు కలదు. అది తాళపత్ర గ్రంథము కాదు. కాగితపు ప్రతి. అందు ఆశ్వాసాంత గద్యను 'రామభద్ర ప్రణీతం''బని కలదు. అంతేకాదు. అవతారికలో శ్రీకృష్ణదేవరాయలు అతనిని సకలకథా సారసంగ్రహమును రచింపుమని "ప్రార్థించి''నట్లు కలదు ఆ వచనమిది[21]

"ఇట్లు కీర్తి విస్తార ధురంధరుండగు కృష్ణరాయ నరపాలాఖండలుండు నన్నుఁ బిలిచి శ్రీమత్సీతారమణ చరణ కమల పరిచరణాయమాన మానసుండవు బహువిధ కవితా చమత్కార ధుర్యుండవు మన్మనోరథ కార్యనిర్వాహకుం డవగుటంజేసి పురాతన మహాకవి విరచిత ప్రబంధంబులన్వేషించి భగవద్భక్తి నిష్ఠాగరిష్ఠులగు రాజశ్రేష్ఠుల వృత్తంబులు ప్రసిద్ధంబు లగునట్లుగాఁ బ్రశస్త కథలు విన్యస్తంబుగా యెలకూచి సాహిత్య లక్షణ చిత్రకవిత్వ ప్రభావంబు లొక్కొక్కచోటం గనుపడ రచియింపవలయునని ప్రార్థించి."

ఇందు శ్రీకృష్ణదేవరాయలు రామభద్రుని ప్రార్థించినట్లు కలదు. అది యథార్థమని కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారి అభిప్రాయము.[22] అంతేకాదు సకల కథాసార సంగ్రహమును రచించిన రామభద్రుడే అయ్యలరాజు రామభద్రుడని వారి అభిప్రాయము [23] అతడే పుత్తేటి రామభద్రుడని వేటూరి ప్రభాకరశాస్త్రిగారి అభిప్రాయము.[24] నిడుదవోలు వేంకటరావుగారి అభిప్రాయమును అదే.[25] మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార పట్టికలోను ఇట్లే కలదు.[26]

"దీనికిఁ (సకల కథాసార సంగ్రహమునకు) గర్త ఆపస్తంబ సూత్రుఁడు కౌండిన్య గోత్రుఁడునగు రామభద్రకవి రామాభ్యుదయకర్త యీతఁడే యగును వీరి ఇంటిపేరు పుత్తేటివారని లక్షణ గ్రంథములందుఁ గలదు."

ఇందు సకల కథాసార సంగ్రహకర్త కౌండిన్య గోత్రుడని కలదు ఇంగ్లీషు వివరణలోను కౌండిన్యగోత్రుడనియే కలదు.[27] కాని, సకల కథాసార సంగ్రహము ఆశ్వాసాంత గద్యలో "కాశ్యపస గోత్రు"డని కలదు రామాభ్యుదయమును రచించిన అయ్యలరాజు రామభద్రుడు కౌండిన్యసగోత్రుడు సకలకథాసార సంగ్రహమును రచించిన రామభద్రుడు కాశ్యపసగోత్రుడు గోత్రభేదము కలదు. అంతేకాదు. రామాభ్యుదయములోని ఆశ్వాసాంత గద్యకు, సకలకథాసార సంగ్రహములోని ఆశ్వాసాంత గద్యకును భేదము కలదు. కనుక "ఈ రెండు గద్యలకును బోలిక లేదు. అయ్యలరాజు రామభద్రుఁడు కౌండిన్యసగోత్రుఁడు. సకలకథా రామభద్రుఁడు కాస్యపస గోత్రుఁడు. ఈ కాస్యపశబ్దము పొరబాటయి యుండునని శతకవుల చరిత్రకారులు వ్రాసియున్నారు. కాని పొరబాటు అని చెప్పుటకు ఆధారములు లేవు ఈ యిరువురు రామభద్రులును భిన్నవ్యక్తులని చెప్పుటకీ గద్యలే చాలియున్నవి." అని చాగంటి శేషయ్యగారి అభిప్రాయము [28]

అయినను "రామాభ్యుదయ గద్యకును సకల కథాసార సంగ్రహ గద్యకును గొంత భేదమున్న మాట వాస్తవమే కాని పరస్పర వైరుధ్యము మాత్రము లేదు......గోత్రభేదము నిజముగా ననుమానాస్పదముగనే యున్నది కాశ్యప శబ్దము వ్రాయసగాండ్ర పొరపాటయి యుండవచ్చునని శతక కవుల చరిత్రకారులు వ్రాసియున్నారు. అట్లగుట కేవల మసంభావ్యమనఁగాదు. వ్రాయసగాండ్ర పొరపాటులు లెక్కకు మిక్కుటముగానున్న తాళపత్ర గ్రంథములనేకములు గలవు......కాని మన వాదమున కడ్డుపచ్చు వానినన్నిటిని వ్రాయసగాని యనవధానతా ఫలితములుగ నిరూపింప యత్నించుటయుఁగు విమర్శనమే యగును." అని ఆచార్య కాకర్ల వేంకటరామ నరసింహముగారి ప్రత్యభిప్రాయము.[29] ఆశ్వాసాంత గద్యల భేదమును అంగీకరించి, అవిషయమైన అవైరుధ్యమును ఆపాదించి, గోత్రభేదమును గుర్తించి, "మన వాదమున కడ్డువచ్చు వానినన్నిటిని వ్రాయసగాని యనవధానతా ఫలితములుగ నిరూపింప యత్నించుటకు విమర్శనమే యగును" అని ఎఱిగి, ఇట్లు ప్రత్యభిప్రాయమును ప్రకటించుట వైతండికము అంతేకాదు. పూర్వోదాహృత సకల కథాసార సంగ్రహ వచనమునందు "ఎలకూచి సాహిత్య లక్షణ చిత్రకవిత్వ ప్రభావంబులు" అని కలదు. "ఈ 'యెలకూచి' ఎలకూచి బాలసరస్వతియేయై యుండును బాలసరస్వతి శిష్యుఁడో, అతనికిఁ దరువాతివాఁడో రామభద్రుఁడను పేరు గల యొకానొక కవి యీ గ్రంథమును రచించి, గ్రంథమునకు గౌరవము గల్గుటకై కృష్ణదేవరాయలు తనసీ గ్రంథమును రచింపుమని కోరినట్లు కృత్యాదిని వ్రాసికొనియున్నాఁడు. అంతియే గాని యీ కావ్య మయ్యలరాజు రామభద్రుఁడు రచించినది కాదు. ఎలకూచి బాలసరస్వతి కంటెను బూర్వుఁడయిన యయ్యలరాజు రామభద్రుఁడు "ఎలకూచి" నెట్లు పేర్కొనఁగలడు?" అని కూడ చాగంటి శేషయ్యగారి అభిప్రాయము[30] అయినను, "కాని శ్రీ శేషయ్యగారందున్న వ్రాయసగాని పొరపాటును గుర్తింపరైరి. అందున్నది 'కూర్చి'గాని 'కూచి' కాదు. పూర్వపు వ్రాతలలో నిట్టి యెడ వలపలగిలక నుపయోగించెడివారు. "కూచిఁ" అని యిట్టి

వ్రాసినచో 'కూచి' యని భ్రమించుట కవకాశమున్నది. మఱియు నెలకూచి బాలసరస్వతి వ్రాసిన ప్రత్యేక సాహిత్య లక్షణము లెచ్చట నున్నవి? ఆంధ్రశబ్ద చింతామణి కాతఁడు వ్యాఖ్య వ్రాసిన మాట వాస్తవమే కాని యది యాంధ్ర వ్యాకరణ గ్రంథముగాని యలంకార శాస్త్రము గాదు. కావున బాలసరస్వతి కాలముననున్న కవి యెవ్వఁడో సకలకథాసార సంగ్రహమును వ్రాసెనను మాట సత్యదూరము. ఇంతకు నందున్న పదము 'కూర్చి' గాని 'కూచి' కాదు '' అని కూడ ఆచార్య కాకర్ల వేంకట రామనరసింహముగారి ప్రత్యభిప్రాయము.[31] ఇది మఱల "మన వాదమున కడ్డువచ్చిన వానినన్నిటిని వ్రాయసగాని బదులు పాఠకుని యనవధానతా ఫలితములుగ నిరూపింప యత్నించిన కువిమర్శనమే. అంతేకాదు "అహో! మూలచ్ఛేదీ తవ పాణ్డిత్య ప్రకర్షః" అనిపించునది. ఇంతకు నందున్న పదము 'కూర్చి' గాని 'కూచి' కానిచో, "ప్రశస్త కథలు విన్యస్తంబుగా నెలకూచి" అను వాక్యమునందు "ఎల" ఏమగునో? కూర్చుటవలె ఎలకూర్చుట కూడ కలదు కాఁబోలు! "సాహిత్య లక్షణ చిత్రకవిత్వ ప్రభావంబులు" అను సమాసమునందు సాహిత్య శబ్దమునకు అలంకార శాస్త్రమనియే అర్థమా? ఎలకూచి బాలసరస్వతి సాహిత్యము లేదా? ఆంధ్రశబ్ద చింతామణి టీక లక్షణగ్రంథము కాదా? ఎలకూచి బాలసరస్వతి సాహిత్యమునకు లక్షణమైన చిత్రకవిత్వము యొక్క ప్రభావమని సమాసమునకు అర్థము రాదా? కనుక నరసింహముగారి ప్రత్యభిప్రాయముకంటె శేషయ్యగారి అభిప్రాయమే సమంజసముగ కలదు. సకల కథాసార సంగ్రహమును చదివిన సమర్థము కాఁగలదు.

"సకల కథాసార సంగ్రహ మొక స్వతంత్రగ్రంథము కాదు
పూర్వకవుల గ్రంథములలోనుండి పద్యములను గ్రహించి
రూపము నించుక మార్చి యీ గ్రంథమును జేసియున్నట్లే
గ్రంథమును జదివినచోఁ దెలియఁగలదు."

అని సకల కథాసార సంగ్రహమును చదివిన చాగంటి శేషయ్యగారి అభిప్రాయము.[32] దీనిపై ఆచార్య కాకర్ల వేంకటరామ నరసింహముగారి ప్రత్యభిప్రాయము లేదు కాని, "ఎలకూచి బాల సరస్వతి కాలముననున్న రామభద్ర నామధేయుఁడెవఁడో సకల కథా సార సంగ్రహకర్త యనువాదము పరాస్తమయినది" అని నరసింహముగారి పరమానందము కలదు.[33] సకల కథాసార సంగ్రహము సొంతముకాదు; చాగంటి శేషయ్యగారు ఉట్టంకించిన సి. పి. బ్రౌను అభిప్రాయము, ఉదాహరించిన మనుచరిత్రలోని రెండు పద్యముల అనుకరణమును పరికించినచో, పైవిధముగ ప్రత్యభిప్రాయ ప్రకటనము చేయుట, పరమానందము నందుట ప్రాప్తము కాదు

సి. పి. బ్రౌను అభిప్రాయమిది[34] :

"దిస్ ఈజ్ ఏన్ ఇల్లిటరేట్ పోయెమ్ ఆఫ్ నో మెరిట్, వాటెవర్ పార్ట్స్ ఆర్ సుపీరియర్ ఆర్ స్టోలెన్ ఫ్రమ్ బెటర్ ఆథర్స్ '' జూలై 1843 సం॥ సి. పి. బ్రౌన్.

సకల కథాసార సంగ్రహమునందలి చాగంటి శేషయ్యగారు ఉదాహరించిన మనుచరిత్రలోని రెండు పద్యముల అనుకరణము, రామాభ్యుదయములోని ఒక పద్యము అనుకరణమును[35] మాత్రమే గాక, శేషము వేంకటపతి శశాంక విజయములోని పద్యమునకును అనుకరణము కలదు శశాంక విజయములోని పద్యమిది

"లోకములోనఁ గొందఱబలల్ సతులం దనియింప లేక య
స్తోకమనీషు లన్యపురుషుల్ తమ కాంతల నంటకుండఁదా
టాకులలోన వ్రాసిరి పరాంగనఁ గూడినఁ బాపమంచు న
య్యాకుల పాటు సూచి యటు లాకుల పాటెనయంగ నేటికిన్."

సకల కథాసార సంగ్రహములోని పద్యమిది:

"కలిమిం గొందఱు శ్రోత్రియుల్ సతుల కాంక్షల్ దీర్పఁగా లేక యా
కలకంఠుల్ తముఁ బాసి చక్కఁదనముం గాంభీర్యమున్ మన్మథో
త్కల నారంభము వాగ్విజృంభణము సత్కారుణ్యముం గల్గు వా
రలతోఁ బొంది తముంగణింప రనుచుం గ్రంథంబు లందట్లు వ్యా
కులులై వ్రాసిన మార్గముల్ తలఁతురే కుంభిన్ భుజంగాగ్రణుల్ ''

ఇది మానవల్లి రామకృష్ణకవిగారు సకల కథాసార సంగ్రహ పద్యమును శేషము వేంకటపతి అనుకరించినట్లు ఉదాహరించినది.[36] "ఇందుఁ బంచపాదియై శుద్ధతాళానుగామి గాక పొల్లు పదములతో నిండిన పుత్తేటి రామభద్రుని కవిత సంస్కరించి యర్థ మెట్లిమిడింప వచ్చునో యా శిల్పము నుపదేశింపఁ గాఁబోలు శేషము వేంకటపతి యర్థవంతమైన యమకముతో గ్రంథచౌర్య మొనర్చె"నని కవిగారి అభిప్రాయము [37] కాని సందర్భోచితమైన, సహజ సుందరమైన శశాంక విజయ పద్యమును అసమర్థుడైన సకల కథాసార సంగ్రహ కర్త అనుకరించినట్లు కరతలామలకము

సకల కథాసార సంగ్రహములోని మఱొక పద్యమును కనపర్తి అబ్బయామాత్యుఁడు కవిజన మనోరంజనమునందు అనుక రించినట్లు ఆ రెండు పద్యములను గూడ మానవల్లి రామకృష్ణకవిగారు ఉదాహరించినారు.[38] కాని, కనపర్తి అబ్బయామాత్యుని కవిజన మనోరంజనములోని పద్యమును సకల కథాసార సంగ్రహకర్త అనుకరించినట్లు కరబదరకము.

కనుక సకల కథాసార సంగ్రహమును రచించిన రామభద్రుడు ఎలకూచి బాలసరస్వతి సమకాలికుడో, అనంతర కాలికుడో మాత్రమే

గాక, శేషము వేంకటపతి సమకాలికుడో, అనంతర కాలికుడో అగును.

సకల కథాసార సంగ్రహమును సాంతము సావధానముగా చదివి కర్తృత్వ విచారము కావించిన మా విద్యార్థి డాక్టర్ కొత్తపల్లి విశ్వేశ్వరశాస్త్రి అభిప్రాయము కూడ "రామభద్రు లిర్వురనుట సిద్ధాంతము. సకల కథాసార సంగ్రహమును అయ్యలరాజు రామభద్రుడు రచింపలేదు." అనియే.[39]

ఎలకూచి బాలసరస్వతి కాలము పదునేడవ శతాబ్దము. శేషము వేంకటపతి కాలము పదునెన్మిదవ శతాబ్ది కనుక సకల కథాసార సంగ్రహకర్త రామభద్రుని కాలము కనీసము పదునెన్మిదవ శతాబ్ది తుది కావలయును పదునెన్మిదవ శతాబ్ది తుది రామభద్రుని, పదునారవ శతాబ్ది తొలి శ్రీకృష్ణదేవరాయలు ప్రార్థించుట అబద్ధము. అసలు శ్రీకృష్ణదేవరాయలు కవిని ప్రార్థించుట విరుద్ధము. కనుక సకల కథాసార సంగ్రహకర్త రామభద్రుని కథనమెల్ల అసంబద్ధము. సకల కథాసార సంగ్రహము కూటసృష్టి. కూటసృష్టికర్త రామభద్రుడు అష్టదిగ్గజ కవులలో ఒకడగుట అత్యంతాసంభవము. అటు అయ్యలరాజు రామభద్రుడు కాని, (అతడే పుత్తేటి రామభద్రుడు. అట్లు గణపవరపు వేంకటకవి ఆంధ్ర ప్రయోగ రత్నాకరమునందు కలదు.) ఇటు సకల కథాసార సంగ్రహకర్త రామభద్రుడు కాని, అష్టదిగ్గజ కవులలో ఒకడు కాడు.

## తెనాలి రామ (లింగ) కృష్ణుడు

మఱి తెనాలి రామ(లింగ)కృష్ణుడు. తెనాలి రామలింగని ఉద్భటారాధ్య చరిత్రము ఊరదేచమంత్రికి అంకితము. అతడు కొండవీటి దుర్గాధిపతి నాదిండ్ల గోపమంత్రికి మంత్రి. (20ప. 1అ) గోపమంత్రి నాదిండ్ల అప్పయమంత్రికి అనుజుడు. తిమ్మరుసునకు మేనల్లుడు. ఇతడు కొండవీటి దుర్గాధిపతి అయిన కాలము 1515-25 కావున, ఉద్భటారాధ్య చరిత్రము రచనా "కాలము 1535 అని తలఁపవచ్చును" అని వేటూరి ప్రభాకరశాస్త్రిగారి అభిప్రాయము[40] అట్లు "నిశ్చయింపవచ్చును" అని చాగంటి శేషయ్యగారి అభిప్రాయము[41] "ప్రాయశః 1520వ సం॥ ప్రాంతమున దేచయ యంకితము గొనెనని యోచవచ్చును" అని డాక్టర్ నేలటూరి వేంకటరమణయ్యగారి అభిప్రాయము[42] "ఉద్భటారాధ్య చరిత్ర రచన క్రీ.శ. 1516 ప్రాంతము కాదగును" అని నిడుదవోలు వేంకటరావుగారి అభిప్రాయము.[43] కనుక ఉద్భటారాధ్య చరిత్రము రచనా కాలమునకు పూర్వావధి 1516వ సంవత్సరము. నాదిండ్ల గోపమంత్రి "క్రీ.శ. 1533 వఱకుఁ గొండవీటి దుర్గ పరిపాలకుడుగా నున్నట్లు చెప్పుచున్నారు." అని చాగంటి శేషయ్యగారు అందిచ్చిన సమాచారము.[44] కనుక ఉద్భటారాధ్య చరిత్ర రచనాకాలమునకు పరమావధి 1533వ సంవత్సరము. తన్మధ్య రచనాకాలము తర్వాత సమన్వయింతును.

తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యము విరూరి వేదాద్రి మంత్రికి అంకితము. అతడు విరూరికి కరణము పెదసంగ భూపాలునికి వ్రాయసగాడు (20, 30, 31,ప. 1అ) పెదసంగ భూపాలుడు మంగయరాజు మనుమడు గురవరాజు కొడుకు. "మంగయరాజు పుత్రులైన గురవయ దేవచోడ మహారాజు" సదాశివరాయల కాలమునందు 1543వ సంవత్సరమున "తొమ్మండ్రు కుమారులు సమీపస్థులయి వుండగాను గ్రామాలు "దానము చేసినట్లు శాసనము కలదు[45] అందు గురవరాజు పెద్దకొడుకు పెద్దసింగరాజు, రెండవ కొడుకు పిన్న సింగరాజు, అయిదవ కొడుకు బసవరాజు అని కలదు ఇందు పిన్నసింగరాజు సిద్ధవటసీమను పరిపాలించినట్లు మఱొక శాసనము కలదు.[46] అందు శకవర్షసంఖ్య లేదు. "ప్రమాది సంవత్సర ఆషాఢ శుద్ధ11లు" అని మాత్రమే కలదు. ఈ ప్రమాది నామ సంవత్సరమునకు సరియైన శకవత్సరము 1441 అనగా క్రీ.శ. 1519వ సం॥" అని డాక్టర్ నేలటూరి వేంకటరమణయ్యగారి అభిప్రాయము[47] తండ్రి శాసనము 1543వ సంవత్సరమునందు, తనయుని శాసనము 1519వ సంవత్సరమునందును కలదనుట విపరీతము కనుక తనయునికి సంబంధించిన ప్రమాదినామ సంవత్సరమునకు సరియైన శకవత్సరము 1501 అనగా క్రీ.శ. 1579 అగును. తండ్రి శాసనము 1543వ సంవత్సరమునందు, తనయుని శాసనము 1579వ సంవత్సరము నందును ఉండుట సహజము. పిన్న సింగరాజు మూడవ తమ్ముడు బసవరాజు కుమారుడు గంగాధరరాజు శాసనము 1592వ సంవత్సరమునందు కలదు[48] సింగరాజు సోదరుల మేనమామ కొండ్రాజు వెంకటరాజు శాసనములు 1584, 1585 సంవత్సరములందు కలవు అంతేకాదు. ఈ కొండ్రాజు వెంకటరాజు వేంకట రామకృష్ణ కవుల కామందకమును కృతినందిన కాలము 1584వ సంవత్సరమని అందే కలదు.[50] ఇది యెల్ల సుసంగతము. ఇంతకు విరూరి వేదాద్రి మంత్రికి ప్రభువైన "మంగయగురువభూవిభుని పెద్ద సంగభూపాలమణి" 1543వ సంవత్సరమునందు కుమారునిగ కలడు అతని పెద్ద తమ్ముడు పిన్న సింగరాజు 1579వ సంవత్సరమునందు సిద్ధవట సీమ పాలకుడుగ కలడు. కనుక పెద్దసింగ భూపాలుడు విరూరి వేదాద్రిమంత్రికి ప్రభువగు కాలము 1575వ సంవత్సరము కావలయును.

విరూరి వేదాద్రి మంత్రి గురువు కందాళయప్పగారు (77, 78ప. 1అ) ఈతని శాసనములు 1540-45 ప్రాంతమునఁ గన్పట్టు

చున్నవి." అని చాగంటి శేషయ్యగారు అందిచ్చిన సమాచారము.[51] కనుక విరూరి వేదాద్రిమంత్రి 1545 ప్రాంతమునందు కందాళయప్ప గారి శిష్యుడు, 1575 ప్రాంతమునందు పెద్ద సింగభూపాలుని వ్రాయసగాడు కావచ్చును.

తెనాలి రామకృష్ణుని గురువు భట్టరు చిక్కాచార్యులు (17ప. 1ఆ.) ఈయన తెనాలి రామకృష్ణుని అల్లుడైన లింగమగుంట రామ కవికి; ఇతనికి తమ్ముడైన లింగమగుంట తిమ్మకవికి; వేంకట రామ కృష్ణ కవుల కామందకమును, అయ్యల భాస్కరకవుల రెట్టమత శాస్త్రమును కృతినందిన కొండ్రాజు వెంకటరాజునకు గూడ గురువే. "చిక్కయాచార్యుడు 1520-90 నడుమ నున్నవాఁడని" చాగంటి శేషయ్యగారి అభిప్రాయము.[52]

కనుక తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యము రచనాకాలము 1575వ సంవత్సరము కావచ్చును. కావచ్చును కాదు. అగుననుటకు పాండురంగ మాహాత్మ్యమునందే అంతస్సాక్ష్యము కలదు. అది బులుసు వేంకటరమణయ్యగారు అందిచ్చిన విషయమే. కాని జారవిడిచిన విషయము కూడ.[53]

పాండురంగాలయమునకు పాము వచ్చుట, ఎలుకపిల్ల పాండు రంగనిలో ఏకమగుట పాండురంగ మాహాత్మ్యమునందు ఇట్లు వర్ణింపఁ బడినది.

క. "గిరి కానుషక్తబుద్ధి ను
పరిచరునిం బోలు నొక్క పన్నగ మొక నాఁ
డురవడి నెచ్చటి నుండియొ
మురమర్దను దివ్యభవనమున కేతెంచెన్. 242ప

వ. ఆ సమయంబున

క. యమ దండ చండమగు భుజ
గమునకు వెఱచఱచి యాఖుకన్యక కమలా
రమణాంఘ్రిఁ జేరె గురు ధీ
తమతికి నాముక్తమాల్యదకు నెనయగుచున్ "

244 ప. 4 ఆ

ఇందు మొదటి పద్యము వసుచరిత్రకు దీపిక. రెండవపద్యము ఆముక్తమాల్యదకు జ్ఞాపిక రెండు పద్యములకును సాన్నిహిత్యము కలదు రెండవ పద్యమునకు గురుపరంపరా ప్రభావములోని గోదా దేవి వృత్తాంతము ప్రేరకము కానట్లే, మొదటి పద్యమునకు మహా భారతములోని ఉపరిచర వసువృత్తాంతము కారకము కాదు. గురు పరంపరా ప్రభావమునకు మహాభారతమునకు సంబంధములేదు. వసు చరిత్రకు ఆముక్తమాల్యదకు అనుబంధము కలదు. రెండును స్వతంత్ర కావ్యములు. ప్రౌఢ ప్రబంధములు. సమీప కాలికములు. పై రెండు పద్యములందలి ప్రకృతా ప్రకృతశ్లేష వసుచరిత్ర వైఖరి. కనుక తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యము, శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యదకంటె మాత్రమేగాక, భట్టుమూర్తి వసుచరిత్ర కంటెను అనంతర గ్రంథము కావలయును.

భట్టుమూర్తి వసుచరిత్ర తిరుమల రాయలకు అంకితము. అతడు అళియ రామరాయలకు అనుజుడు (48ప 1ఆ) అళియ రామ రాయల అనంతరము పాలకుడు. (54ప. 1ఆ) "జీర్ణ కర్ణాట లక్ష్మీ పునస్సృష్టి" (13ప. 1ఆ.) చేసిన తిరుమల రాయల రాజ్యకాలము 1570 నుండి 1572 వఱకు మూడు సంవత్సరములు మాత్రమే[54] కనుక వసుచరిత్ర రచనాకాలము తన్మధ్యకాలమే. స్థూలముగ 1571వ సంవత్సరము కావచ్చును 1570-72 మధ్య రచితమైన వసుచరిత్ర ప్రతిఫలించిన తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహా త్మ్యము రచనాకాలము 1572వ సంవత్సరము తర్వాత కావలయును. అది స్థూలముగ 1575వ సంవత్సరమగును

బహిరంతస్సాక్ష్యముల పరస్పరోపబలకతను తెనాలి రామ కృష్ణుని పాండురంగ మాహాత్మ్యము రచనాకాలము స్థూలముగ 1575వ సంవత్సరము కావున, తెనాలి రామలింగని ఉద్భటారాధ్య చరిత్రము రచనాకాలము 1516, 1520, 1525 సంవత్సరములు కాఁజాలవు. స్థూలముగ 1580వ సంవత్సరమగును

తెనాలి రామలింగయ కందర్పకేతు(తు)విలాసము, హరిలీలా విలాసము అను కావ్యములనుండి అనేక పద్యములు పెదపాటి జగన్నాథకవి ప్రబంధ రత్నాకరమునందు సంకలనము చేయఁబడినవి. అవియెల్ల వర్ణన పద్యములు అయినను, హరిలీలా విలాసము వైష్ణవపరమైన గ్రంథమని పేరునుబట్టియే అవగాహనమగును. కనుక ప్రబంధ రత్నాకరములోని తెనాలి రామలింగయ, ధీరజన మనో విరాజితము రచించిన తెనాలి రామలింగము కాక, ఉద్భటారాధ్య చరిత్రము, పాండురంగ మాహాత్మ్యము రచించిన తెనాలి రామ(లింగ) కృష్ణుడే అగును. ఇతడు వైష్ణవుడు కాఁగానే హరిలీలా విలాసమును

రచించియుండును. అంతకుముందే కందర్పకేళీ (తు) విలాసమును రచించియుండును. పాండురంగ మాహాత్మ్యము తర్వాత ఘటికాచల మాహాత్మ్యము రచించెను. అందు రామకృష్ణుని అవతారిక లేదు. అంతిమ గ్రంథమగుటయే తన్నిమిత్తమగును. పాండురంగవిజయము ప్రత్యేక గ్రంథము కాదు. కనుక ఉద్భటారాధ్య చరిత్రము, కందర్ప కేళీ(తు)విలాసము, హరిలీలా విలాసము, పాండురంగ మాహాత్మ్యము, ఘటికాచల మాహాత్మ్యము తెనాలి రామ(లింగ)కృష్ణుని కృతుల పౌర్వాపర్యము కావలయును. పాండురంగ మాహాత్మ్యము రచనాకాలము స్థూలముగ 1575 ప్రాంతము కావున, ఘటికాచల మాహాత్మ్యము రచనాకాలము స్థూలముగ 1580 ప్రాంతమగును. అది తెనాలి రామ(లింగ)కృష్ణుని చరమకాలము. జనన కాలము 1500 ప్రాంత మగును. కనుక శ్రీకృష్ణదేవరాయల ప్రాభవ కాలాంతమునాటికి (1524) తెనాలి రామ(లింగ)కృష్ణుడు సుమారు పాతికేండ్లవాడే అగును. ఆ వయస్సున ఆస్థానకవి అగుటయే సుసంభవము కాదు. అష్టదిగ్గజకవి అగుట మఱీ అసంభవము. కనుక తెనాలి రామ(లింగ) కృష్ణుడు కూడ అష్టదిగ్గజ కవులలో ఒకడు కాడు.

తెనాలి రామలింగని ఉద్భటారాధ్య చరిత్ర అవతారికయందు ఒక విశేషము కలదు. కృతిపతి ఊరదేచమంత్రి వర్ణన ఒక సీసపద్యమునందు మఱొక చిన్న గద్యమునందు మాత్రమే కలదు. (21ప. 22వచ. 1ఆ.) కొండవీటి దుర్గాధిపతి నాదిండ్ల గోపమంత్రి వర్ణన రెండు ఉత్పలమాల పద్యములందు, నాలుగు సీసపద్యము లందును కలదు. (15-20ప. 1ఆ.) ఇది నిర్నిమిత్తము కాఁజాలదు. అంత వర్ణనమునందును గోపమంత్రికి సంబంధించిన చరిత్రాంశములు లేవు సామాన్యగుణ సంకీర్తనమే కలదు. ఇది కూడ నిర్నిమిత్తము కాఁజాలదు పరిచయము లేని గోపమంత్రితో, పరిచయము కల ఊరదేచమంత్రి ద్వారా పరిచయము కలిగించుకొని, గోపమంత్రితోడి పరిచయముద్వారా విజయనగరాస్థాన ప్రవేశము చేయదలచిన తెనాలి రామలింగని ప్రారంభావస్థయే తన్నిమిత్తమగును. అనగా తెనాలి వాస్తవ్యుడైన తెనాలి రామలింగడు ఉద్భటారాధ్య చరిత్రము రచనా కాలమునాటికి కొండవీడు ప్రవేశమేగాని, విజయనగర ప్రవేశము చేయలేదని అవగాహన మగును.

ఉద్భటారాధ్య చరిత్రము రచనాకాలము 1530 ప్రాంతమని పూర్వోక్తము. అది అచ్యుతదేవరాయల రాజ్యారంభకాలము అచ్యుత దేవరాయల కాలమునందు కుమార తాతాచార్యులు కలడు [55] అతడు శ్రీకృష్ణదేవరాయల కాలమునందును ఉండియుండుననుట[56] ఊహా మాత్ర శరణ్యము. అచ్యుతదేవరాయలు కూడ కవిపండిత పోషకుడు. కనుక తెనాలి రామలింగడు అచ్యుత దేవరాయల ఆస్థానకవి కావచ్చును. కాలక్రమమునందు అచ్యుత దేవరాయలను శ్రీకృష్ణదేవ రాయలుగ లోకము అపోహ పడవచ్చును.

తెనాలి రామలింగడు జన్మతః శైవుడైనను, శ్రీకృష్ణదేవ రాయల మెప్పుకొఱకు వైష్ణవుడై తెనాలి రామకృష్ణునిగ మాఱెనని పుక్కిటి పురాణము కలదు. శ్రీకృష్ణదేవరాయల అరణపు కవి, అష్ట దిగ్గజ కవి అయిన నందితిమ్మన "శివపరాధీనమతి. అఘోర శివ గురు శిష్యుఁడు" అని పారిజాతాపహరణమునందే కలదు. (100ప. 5ఆ.) మఱొక అష్టదిగ్గజకవి మాదయగారి మల్లన కూడ "శంకర పాదసేవ నవశంవద మానస పంకజాతుఁడు" (13ప. 1ఆ.) అఘోర శివాచార్య శిష్యుడు (ఆశ్వాసాంత గద్య) అని రాజశేఖర చరిత్రమునందు కలదు. ధూర్జటి మూర్తీభవించిన శివభక్తియే కదా! ఇతనికిని గురువు కలడు. (9ప. 1ఆ) అతడు శైవగురువే అగును. అఘోర శివాచార్యుల శిష్యులు, శైవులు అయిన నందితిమ్మన, మాదయగారి మల్లనలకు; శైవగురుశిష్యుడు మహాశైవుడు అయిన ధూర్జటికి అవశ్యకము కాని, వైష్ణవ మతస్వీకారము శ్రీకృష్ణదేవరాయల మెప్పుకొఱకు, పాలగుమ్మె లేశ్వరుని శిష్యుడు (24ప. 1ఆ.) శైవుడు అయిన తెనాలి రామలింగనికి ఆవశ్యకమైనదనుట అవిచారమూలకము.

మఱి శ్రీకృష్ణదేవరాయలకు, నందితిమ్మనకు, అల్లసాని పెద్దనకు, ధూర్జటికి, భట్టుమూర్తికి సంబంధించినతెనాలి రామలింగని (కృష్ణుని) కథలు కలవు కదా!- అవి కథలే. జనశ్రుతులే. చరిత్రాంశ ములు కావు. అంతేకాదు భట్టుమూర్తి వసుచరిత్రమును పాండురంగ మాహాత్మ్యమునందు ఆదరించిన తెనాలి రామకృష్ణుడు భట్టుమూర్తిని అధిక్షేపించెననుట అసంగతము. ధూర్జటి, అల్లసాని పెద్దన, నంది తిమ్మన, శ్రీకృష్ణదేవరాయల కాలమునందు తెనాలి రామలింగడు ఆస్థానకవి అగుటయే సుసంభవము కాదు. అధిక్షేపించుట అసంభవము. అవి శ్రీకృష్ణదేవరాయల ఏ విదూషకుని కృత్యములో అగును. విదూషకులు విద్యావిహీనులు కారు. యత్కించిత్ విద్వాంసులే. అంతేకాదు. "ప్రత్యుత్పన్న ప్రతిభులు" కూడ. తెనాలి రామ(లింగ)కృష్ణుడు శ్రీకృష్ణదేవరాయల విదూషకుడు కాడు. ఆస్థానకవి కాడు. అష్టదిగ్గజకవి కాడు.

(ఇంకా ఉంది)

# బాష్పజల ధారల మీద...

## శ్రీ మోహతుకారి అశోక్‌కుమార్

ఈ మృగత రాత్రిలో సైతం నాకు నిద్రపట్టట్లేదంటే....
ఎక్కడో నా కనుగుడ్ల కావల ఏదో సంపీడ్యత జరిగినట్టు;
చిగుళ్ళు తొడిగే ఊహలు నిలువునా చీల్చుకుపోయినట్టు;
భ్రూమధ్యంలో ఒక సంఘర్షణ ఎదురవుతోంది—
నిశ్శబ్ద నిశీథిలో అందవికార ముఖంమీద
ఏవో ఊహాకందని చిత్రాలు పునస్సంధాన మవుతుంటే....
కలలు వీడని భయానికి అంశీభూతాలుగా మిగిలిపోతున్నాయి—
వెన్నులో ఒక చలికాలం పుట్టుకొస్తుంది—
చెరగని ముద్రలుగా రెండు క్షణాలమధ్య
విసిరేసిన బాష్పజల ధారలమీద నరమేధం
అతి సహజంగా....సాక్షీగా—
రెక్కల్ని కత్తిరించుకున్నట్లు గింజుకుంటున్న
ముసుగు ప్రతిమల్ని చూస్తూ....
సానుభూతి శవాసనాన్ని దాటి.... ఈ పూట
మనల్ని మనం మననం చేసుకోవాల్సి ఉంది;
మరుపుని ఆవలిగట్టుకి నెట్టేసి,
ఉద్విగ్నతావరణాన్ని దాటేందుకు మనం సిద్ధం కావాలి—
ఒక విభ్రమలోంచి.... ఒక సంక్షోభంలోంచి....
సంకుచితత్వంలోంచి.... సంకుల సమరానికి
రెండు కళ్ళని పక్రతితం చేయాలి—
వైరుధ్యాల చావిడిలో వస్తుగతక్లేచా శీలసంపదలు
భూస్థాపితం కావాలి— అప్పుడు
నిర్మోహామాటంగా చీకటి.... నిద్ర ..
వికృత విలయ కల్లోలిత కలల రాతిరిలోంచి,
అశాంతి అవధుల అంతర్వాహినిలో
ఒక వ్యాకోచం ఎదురవుతుంది
అది అనివార్యం కూడా—



శ్రీమతి ఎం. వి. ఎస్. లక్ష్మి

# నాటక కళకు సరికొత్తభాష్యం: తిరుపతి వేంకటకవుల పాండవవిజయం

తిరుపతి వేంకటకవులు ఆంధ్రదేశమున ప్రఖ్యాతి వహించిన జంటకవులు. వీరి నామము వినని ఆంధ్రుడు లేడన్న నతిశయోక్తి కాదు. వీరు దివాకర్ల తిరుపతిశాస్త్రి, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారలు. దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు పశ్చిమ గోదావరి జిల్లా భీమవరము తాలూకా 'యెండగండి' గ్రామమున క్రీ.శ. 1872 ప్రజోత్పత్తి నామ సం॥ ఫాల్గుణ శుద్ధ దశమీ బుధవారమునాడు శేషమ్మ వేంకటావధాని యను పుణ్యదంపతులకు జన్మించిరి. క్రీ.శ. 1920 డిశంబరు 7న స్వర్గగతి నొందినారు. వీరు వెలనాటి బ్రాహ్మణులు. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు తూర్పుగోదావరి జిల్లాలోని ధవళేశ్వరము నొద్దనున్న కడియము గ్రామమున క్రీ. శ. 1870 ప్రమోదూత నామ సం॥ శ్రావణ శుద్ధ ద్వాదశీ సోమవారమునాడు చంద్రమ్మ కామయ్య యను పుణ్యదంపతులకు జన్మించినారు. క్రీ. శ. 1950వ సం॥న శివరాత్రినాడు శివసాయుజ్యము నొందినారు. వీరు ఆరామ ద్రావిడులు వీరిరువురు కారణజన్ములు

19వ శతాబ్ది యుత్తరార్థమున జీర్ణావస్థలోనున్న యాంధ్ర భాషను, కవిత్వమును ఉద్ధరించి యర్ధ శతాబ్దమునకు పైగా నాంధ్ర కవితా సామ్రాజ్యము నేలినారు. వీరు కాశీలో విద్యాభ్యాసము గావించి పిదప తాడేపల్లి గూడెము నకు సమీపముననున్న 'కడెద్ద' గ్రామమున చర్ల బ్రహ్మయ్యశాస్త్రిగారి వద్ద శిష్యరికము జేసినారు. వీరు అవధాన ప్రక్రియను జనానురంజక మొనరించిన 'కంకవీంద్ర ఘంటాపంచానన విద్వత్కవి బాలకథానిధి బాలసరస్వతి శతావధాని' బిరుదాంకితులు. వేంకటశాస్త్రిగారు 1949లో నుమ్మడి మద్రాసు రాష్ట్రమున ఆంధ్రాస్థానకవిగా నభిషేకింపబడినారు. ఈ జంటకవులు వెంకటగిరి, విజయనగరము, ఆత్మకూరు, పోలవరం జమీందారులవద్ద సన్మాన సత్కారములను బొందిరి.

వీరి రచనలు - 1) శ్రీనివాస విలాసము 2) శ్రవణా నందము 3) పాణిగృహీత 4) దేవీ భాగవతము 5) బుద్ధ చరిత్రము 6) లక్షణా పరిణయము 7) భారత నాటకములు. ఇందు భారత నాటకములు ప్రఖ్యాతములు. అవి - 1) పాండవ జననము 2) పాండవోద్యోగము 3) పాండవ విజయము 4) పాండవాజ్ఞాత వాసము 5) పాండవాశ్వమేథము. అందు పాండవోద్యోగ విజయములు బహుళ ప్రచారము నందినవి. మొదట ఈ రెండు నాటకములను కలిపియే ప్రదర్శించెడివారు. తరువాతి కాలమున పాండవ విజయము నకు ప్రాశస్త్యము తగ్గి పాండవోద్యోగమే హెచ్చుగా ప్రదర్శింప బడినది.

వీరి పాండవోద్యోగ విజయములు తెలుగు నేల నాలుగు చెరగుల బహుళ ప్రచారమునొంది పౌరాణిక నాటకములందు తలమానికములై నిలచినవి. తెలుగు పౌరాణిక నాటకముల కొక ప్రత్యేకత కలదు. అదియే పద్యపఠనము. ఇవి కేవలము పఠనమాత్రములు గాక శ్రావ్య గానములుగా విలసిల్లిన కాలమది. వీరి పద్యమును తమ నాటకము లందు కదను త్రొక్కించినారు. ఈ నాటకము లందలి పద్యము లొకటి రెండైనను కంఠస్థము కాని యాంధ్రుడులేడన్న నతిశయోక్తి కాదు ఇందలి పద్యములు సంగీత సాహిత్యముల మేలు కలయికతో సుస్వర సమన్వితములై వినువారి కింపుగూర్చుచూ నాంధ్రుల రసనాగ్రములపై నాట్యమాడుచున్నవి.

పాండవోద్యోగములోని కథ ఉద్యోగ పర్వాంతర్గతము. ఇక ప్రస్తుతాంశమైన 'పాండవ విజయము' నందలి కథ నైదు పర్వము లలో జరిగిన కథ యుద్ధమూలకమై నైదు పర్వములలో విస్తరించిన కథను యెనిమిదంకముల నాటకముగా రూపొందించుట యనన్య

సామాన్యమైన విషయము. ఇందు తిరుపతి వేంకటకవులు జూపిన నేర్పు నిరుపమానమైనది

ఇందలి కథ భీష్మపర్వముతో మొదలగుచున్నది. ప్రథమాంకమున భీష్మ విజృంభణ. శౌరి చక్రధారియై భీష్ము వధింప నుంకించుట. కృష్ణుడు భీష్మ వధోపాయము నుపయోజించుట.

ద్వితీయాంకమున భీష్మ వధను గంగా యమునా సరస్వతుల ద్వారా కడు నేర్పుతో వెల్లడించి, కృశానుడు విశ్వావసుడు నను నిద్దరు గంధర్వపతులచే ద్రోణ విజృంభణ ధర్మజుని పట్టితెత్తునని ప్రతిజ్ఞ చేయుట అభిమన్యు కుమారుని వీర విక్రమ విహారము సంభాషణ రూపమున చెప్పించినారు.

తృతీయాంకమున అభిమన్యు వధ. సైంధవుని జంపెదనని కిరీటి ప్రతిన బూనుట.

చతుర్థాంకమున సైంధవవధ ద్రోణుని దుర్యోధనుడు పరుషోక్తులాడి రెచ్చగొట్టుట.

పంచమాంకమున ఘటోత్కచ వధ ద్రోణవధ (ఇందు ధర్మజు డసత్యమాడ నిరాకరింపగా హిడింబ రాక్షసమాయచే నట్లు భ్రాంతి కలిగించినట్లు సూచన ప్రాయముగ నుడివినారు) నారాయణాస్త్ర ప్రయోగము. ప్రథమాంకమునుండి ద్వితీయాంక మధ్యము వరకు గల కథ భీష్మపర్వాంతర్గతము. ద్వితీయాంక మధ్యమునుండి పంచమాంకాంతము వరకు గల కథ ద్రోణ పర్వాతర్గతము.

షష్ఠాంకమున శల్యసారథ్యము దుశ్శాసన వధ కర్ణ వధ ఇది కర్ణ పర్వము ఇందప్రస్తుతములైన యుపాఖ్యానములను వదలి మూలకథనే పేర్కొనిరి.

సప్తమాంకము నందలి కథ నంతను యలతి వాక్యములలో సంజయ ముఖతః ద్వైపాయన హ్రదము కడకేతెంచిన సుయోధనునకు చెప్పించినారు. పాండవులు మడుగువద్ద కేతెంచి దుర్యోధనుని పరుషోక్తులతో వెలికి రప్పించి రణోన్ముఖుని చేయుట

అష్టమాంకమున దుర్యోధను నధర్మయుద్ధమున గెల్చుట. బలరామ క్రోధాగ్ని యిది శల్యపర్వము. సౌప్తిక పర్వములోనిదైన సర్వపాంచాలురను బ్రతివింధ్యాది ద్రౌపదేయులను బాండవామాత్యులను సుఖసుప్తులైన వారిని అశ్వత్థామ మనుమటను యతని ముఖతః దుర్యోధనునకు జెప్పించినారు.

ఈ పాండవ విజయము దశరూపక భేదములలోనిదైన 'డిమ' మనవచ్చును. డిమమనగా పౌరాణిక గాథతో పెక్కుమంది వీరుల యుద్ధముతో రౌద్ర భయానక రసమయమైయుండు నాటకము. ఇందు అంకములు నాలుగు తక్కిన లక్షణములన్నియు సరిపోయినను పాండవ విజయమున యంకములు యెనిమిది, కొన్నియెడల కరుణరసముగూడ బరిపోషింపబడినది.

నాటకమునందు నాంది ప్రస్తావనలు ప్రథమాంకాంతర్గతములై యుండును నాటకమున పూర్వరంగమున పూజాదికము ముగిసిన పిదప శ్లోకరూపమైన భాగము నాంది. నాందీశ్లోక మాశీర్నమస్క్రియా వస్తు నిర్దేశాత్మకమై యుండవలెను పాండవ విజయము నందలి నాందీపద్యమున హరిహరనాధుని యైదు లోచనములు ధ్వనిగర్భితముగా నుండి యిది పంచపాండవుల కథయను సూచన నిడుచున్నవి. ప్రస్తావన :- నాంది పఠించిన తరువాత సూత్రధారుడు రంగమున బ్రవేశించిన నటి నటుడు విదూషకుడు పారిపార్శ్వకులలో నెవరితోడనైన సంభాషణ ప్రారంభించును దీనికి బ్రస్తావన యని పేరు. దీనియందు కవి తన కులగోత్ర నామాది కథనము ప్రరోచనము, ఉన్ముఖీకరణము, ఋతువర్ణనము, కావ్యార్థ సూచనము, పాత్ర ప్రవేశ సూచనము నను నైదంగము లుండును. ఇందు నటి శిరోజములను గూర్చి సూత్రధారు డొనరించిన వర్ణనాత్మక పద్యమున భావి కథయంతయు దృగ్గోచరమగుచున్నది

గీ॥ కృష్ణుని మతంబు ద్రోణగాంగేయ భూషి
తంబు ద్రుపదశిఖండి మృదబహుళంబు
కర్ణ సంరోధియై కల్మిఁగాంచు గాని
కాలగతిఁ గ్రుంగల బాండవా క్రాంతమగుచు.

పై పద్యమున శిరోజము లెంత యందముగా నలంకారపూరితముగానున్నను చివరకు పాండు వర్ణమును బొంది శోభ కోల్పోయినట్లే కౌరవనివహంబు పాండవాక్రాంతమై నశింపకతప్పదని శ్లేషపూరితముగ మనోజ్ఞముగా వర్ణింపబడినది ఇక ఋతువర్ణనమునందు యత్యుత్కృష్టమైన కథోద్ఘాతము ప్రయోగింపబడినది. ప్రస్తావనలోని యొక వాక్యములోని యర్థము యొక్కగాని శబ్దము యొక్కగాని సామ్యమునుబట్టి యా వాక్యార్థము నాత్మ సంబంధిగా తలచి పాత్ర ప్రవేశము చేయుట కథోద్ఘాతము.

గీ॥ ధార్తరాష్ట్ర సమూహంబు దక్షిణాశ
కభి ముఖంబుగఁ జను సమయంబు చూవె
ప్రబల పాండవ హంసలు పట్టువదలి
యచ్చ మానస వైకల్య మనుభవింప.

యిందలి ధార్తరాష్ట్ర పదముచే సూత్రధారుడు తననే యధిక్షేపించుచున్నాడను భావముతో భీష్ముడు "నేటికి రెండునాళ్ళు చనె" యను బద్యము బఠించుచు రంగప్రవేశము గావించును.

ఈ నాటకమున అర్థోపక్షేపకములు హెచ్చు. ప్రదర్శన కలవిగాని యుద్ధ సన్నివేశములను పాత్రల సంభాషణల ద్వారా యతి మనోజ్ఞముగా వెల్లడించినారు.

ధర్మజుడు భీష్ముని తన్నిర్యాణోపాయము జెప్పుమని వేడి కృతకృత్యుడైన భావి కథాభాగము నంతయు కృష్ణుని స్వగతముగా 3 పద్యలు 2 గద్యలలో బలికించినారు. ఇట్లే భీష్మవధను గంగా యమునా సరస్వతుల ద్వారా, అభిమన్యు పరాక్రమము గంధర్వుల ముఖతః, సౌప్తికపర్వ గాథను అశ్వత్థామ ముఖతః, శల్యపర్వము లోని కొంత గాథను సంజయ ముఖతః మనోజ్ఞముగా బలికించినారు.

అర్థోపక్షేపకమునందు చూళిక యొకటి. చూళిక యనగా ఆకాశ భాషణము. అశరీరవాణిగాని యొక దేవతామూర్తిగాని కథకు సంబంధించిన వ్యక్తిగాని ప్రవేశింపబోవు నొక పాత్రగాని యవని కాంతరమునుండి కథాసూచన చేయుట. పాండవ విజయమున భీమ దుర్యోధనుల గదా యుద్ధమునకు బూర్వము దుర్యోధనుడు హ్రదమున దాగుటకై యేకాకియై పరువెత్తి పోవుచుండగా తెరలోనుండి యొక చూళిక పలికింపబడినది.

ఉ॥ ఆరని లోతు నీటికొల సక్కట పూచిన తమ్మికిన్ విధి
ప్రేరణ రాలిపోయినవి రేకులు తొంబది తొమ్మిదిప్పుడా
నీరజమందు దామిగులునే యొక రేకటులుండె బోయలం
కారము లౌనె యా కొలనుగాని సరోజముగాని భూమికిన్

పై పద్యమున రస ప్రదీపములైన యెన్నియో కావ్యగుణములు గలవు. ఇందు దుర్యోధనుని మరణము సూచితమగుచున్నది.

నాటక రచనలో ప్రధానమైన నాలుగంగములున్నవి: 1) ఇతి వృత్తము - తత్సంధానము 2) పాత్రలు - తద్వర్తనము 3) కవిత్వము - భాష 4) ధర్మధ్వని. పాండవ విజయమున నీ నాలుగంశములు జక్కగా బరిపోషింపబడినవి.

నాటకమునందు పద్యము పున్నంతనే యర్థావబోధము పాత్రల సంఘాతములోని చమత్కారము చక్కగా నవగతము కావలెను. కావున నాటకమున బ్రయోగించు భాష ప్రసన్నమై లలిత సులభ శైలిలో నుండవలెను. అతిప్రౌఢమును నతి పేలవమును గాక సంగీతము నందలి మధ్యమస్థాయివలె మధ్యమ ఫణితిలో నడచిన శైలి నాటకమునకు సర్వదా సముచితము. తెలుగున యిట్టి శైలి గల నాటకములకు పాండవోద్యోగ విజయము లుత్తమోత్తమమైన దృష్టాంతములు. ఇందు నెడనెడ సామాజికుల కెల్లరకు విస్పష్టార్థముగాని సంస్కృత పదములున్నను యవి యఖండ వాక్యార్థమ బోధపడుట కెంతమాత్రము ప్రతిబంధకములు కావు.

పాండవ విజయము 'కథా బీజాత్మకము'. ఇందు పాత్రలకు గాని ధర్మసందేశములకుగాని ప్రాధాన్యముండదు. ఇందు పాండవులు శత్రు సంహారముజేసి భారత యుద్ధము గెల్చుట యితివృత్తము. ఇతివృత్తమునకు గల ప్రాధాన్యము పాత్రలకు లేదు.

ఈ పాండవ విజయము నొక విషాదాంత నాటకముగా కూడ చిత్రీకరింపవచ్చు. ఇందు నాయకుడే మరణింప నవసరములేదు. విషాదరూపక నాయకుడు సత్పురుషుడే యయినను తనదైన యొక దోషముచేత పతనము చెందును. ఇందు ధర్మజు డట్టివాడు. తాత డొనర్చిన దోషము బంధుమిత్ర పుత్రాదులను యుద్ధభూమికి బలి యిచ్చుటయేగాక జయాభిలాషియై తన కండ్లయెదుట జరుగుచున్న యనేక యధర్మములను జూచుచు మిన్నకున్నాడు. ఘటోత్కచ వధా సందర్భమున కృష్ణు నుద్దేశించి "త్వదేక శరణ్యుల మాజిలోన మా యేవుర ప్రాణముల్నిలుపు మేదెలులైన నంతచింతలే"దంటాడు. ఇది యాతని స్వార్థానికి పరాకాష్ఠ. వీటి ఫలితముగానే యతనికి జయము లభించినప్పటికి శ్మశాన సదృశమైన నేలనే యేలగలిగినాడు. దుర్యోధనుడు తొడలు విరిగి పడిన తరువాత కృష్ణునుద్దేశించి

గీ॥ బంధుగులు లేక సైన్య సంపదలు లేక
సంతసము లేక తగిన వంశంబులేక
బహుళ దుఃఖాకరంబగు పాడునేల
యీ యుధిష్ఠిరుచేత మోయింపుమయ్య

అంటాడు. ఇక దుర్యోధనుని ప్రవర్తనము పాండవులపట్ల నెట్లున్నను యాతడు జనానురంజకుడేగాని ప్రజాకంటకుడు గాడు. ఈతనిపై దేవతలు పుష్పవర్షము గురిపించి పొగడుచుండగా ధర్మజుడే స్వయముగా నీ విషయమును తెలియజేయును.

ఇక ప్రదర్శన విషయమున కొచ్చినచో నందుగూడ నీ నాటకముల కొక ప్రత్యేకత గలదు. ఈ నాటకములందు పాత్రధారణ చేయుట చేతనే విఖ్యాతిగాంచిన నటులెందరో గలరు. ఎన్నియో నాటక సమాజము లీ నాటకములను మనోజ్ఞముగా ప్రదర్శించి యీ నాటకములకు తమ నాటక సమాజములకు గూడ పేరు ప్రఖ్యాతులు నార్జించి పెట్టినారు.

తిరుపతి వేంకట కవుల నాటకములను ప్రసిద్ధిలోనికి దెచ్చిన ప్రథమ సమాజము బందరు 'రాయల్ థియేటర్' (1904). ఇందు శ్రీయుతులు మంజులూరి కృష్ణారావు, పింగళి నర్సయ్య, పింగళి లక్ష్మీకాంతం(ధర్మరాజు) బుర్రా రాఘవాచారి, వేమూరి రామారావు, శ్రీపతి పట్టాభిరామయ్య, మంత్రాల పరదేశి(స్త్రీ పాత్రలు) మొ॥వారు పాత్రధారులు. ఇంకను ఏలూరు 'ది గ్రేట్ ఇండియన్ థియేటర్', గుంటూరు 'సెకండు కంపెనీ' (1895-1920), కాకినాడ 'హిందూ నాటక సమాజము', బందరు 'హిందూ థియేటర్', నర్సరావుపేట 'విక్టోరియా మెమోరియల్ థియేటర్' (1900) గుంటూరు 'బాల మిత్ర నాటక సమాజము' (1925-30), అబ్బూరి కృష్ణారావు 'నాటకోద్యమము' (1940), పి. సూరిబాబు 'రాజరాజేశ్వరి నాట్య మండలి' (1944), తెనాలి 'ఆంధ్ర ఆర్టిస్ట్స్ అసోసియేషన్'(1950) మొ॥గు నాటక కంపెనీలు యీ నాటకములను ప్రతిభావంతముగా ప్రదర్శించి ఖ్యాతి గాంచినవి. శ్రీకృష్ణ పాత్రధారణలో శ్రీయుతులు బెల్లంకొండ సుబ్బారావు (నర్సరావుపేట), మల్లాది గోవిందశాస్త్రి (గుంటూరు), వల్లా లక్ష్మీకాంతం (గుడివాడ, వీరు భీమ పాత్ర ధారణ కూడ చేసెడివారు), దుర్గి గోపాలకృష్ణారావు (రాజమండ్రి), బందా కనకలింగేశ్వరరావు (ఏలూరు), పీసపాటి నరసింహమూర్తి (తెనాలి), పి. సూరిబాబు, శె. రఘురామయ్య, అబ్బూరి వర ప్రసాదరావు ప్రభృతులు విశేష కీర్తి నార్జించినారు. శ్రీయుతులు పి. సూరిబాబు, శె రఘురామయ్య పద్యమును పాడుటలో తమదైన ప్రత్యేక బాణిని కూర్చి ప్రత్యేకతను సంతరించుకొనినవారు. అర్జున పాత్రలో శ్రీయుతులు కొచ్చర్లకోట సత్యనారాయణ (ఏలూరు), గండికోట నరసింగరావు(బందరు), దేశిరాజు కృష్ణారావు(పాలకొండ), లంక సత్యనారాయణ (రాజమండ్రి), కోట ఆంజనేయులు ప్రభృతులు కీర్తి గాంచినారు ధర్మజ పాత్రలో శ్రీయుతులు వడ్డాది సుబ్బారాయడు (రాజమండ్రి), అద్దంకి శ్రీరామమూర్తి, (బెజవాడ) పింగళి లక్ష్మీకాంతం (బందరు), పెనుమర్తి వెంకటకృష్ణయ్య ప్రభృతులును, దుర్యోధన పాత్రధారణలో శ్రీయుతులు బెల్లంకొండ నరసింహం (గుంటూరు), మాధవపెద్ది వెంకట్రామయ్య (తెనాలి), ఆలమూరు పట్టాభిరామయ్య (కాకినాడ), సుసర్ల అనంతరావు (రాజమండ్రి) ప్రభృతులును, విశేషాదరణను బొందినారు. కోటంరాజు లక్ష్మీకాంతం (గుంటూరు), ముప్పిడి జగ్గరాజు (కాకినాడ), సుసర్ల శ్రీనివాసరావు (రాజమండ్రి), మంత్రాల పరదేశి (బందరు), ప్రభృతులు స్త్రీపాత్రలు ధరించెడివారు.

ఈ విధముగా యీ నాటకములు సాహిత్యపరముగాను, కళాపరముగాను ప్రత్యేకతను సంతరించుకొని పౌరాణిక నాటకములకు పద్యములకు విశేష జనాదరణను సంపాదించి పెట్టినవి. ఇట్టి విశిష్ట రచన గావించిన తిరుపతి వేంకటకవులు అజరామరులు చిరస్మరణీయులు.

## ఉపయుక్త గ్రంథములు


1. పాండవ విజయము (తిరుపతి వేంకట కవులు)
2. పాండవోద్యోగము ( ,, ,, )
3. తిరుపతి వేంకటీయము (గుండవరపు లక్ష్మీనారాయణ)
4 తెలుగు నాటక వికాసము (డా॥ పి. యస్. ఆర్ అప్పారావు)
5. సాహిత్య శిల్పసమీక్ష (పింగళి లక్ష్మీకాంతం))
6. ఆంధ్ర మహాభారతము (తిక్కన సోమయాజి)




## పునరుత్థానం

మృత్యువును మునివేళ్ళతో పట్టుకొని వచ్చాను
అంతమయ్యే కాలమేఘం అంచు తాకి
అనంతమైన తటిల్లతను తీసుకొచ్చాను
చావు డప్పుమీద బతుకు పాట పాడుతూ వచ్చాను
రహదారం పుటుక్కున తెగిపోయి
జీవితం
తెలియని తీరాలకు కొట్టుకుపోయే గాలిపటమయ్యేచోట
గాలిలో స్నేహ పరిమళంమీద కదిలివచ్చాను
బతుకు ఒక అవాంఛనీయ అతిథి అయిన వేళ
కళ్ళముందు హఠాత్తుగా తెరచుకున్నది ఆత్మీయ పర్ణశాల
నీలినీలి ఆకాశమే నా సంరక్షకుల ఇంటికప్పు
ఒక గ్రీష్మాంత రాత్రి నెత్తుటిమడుగులో పడిఉన్న నన్ను
భూమి భూమంతా వసంతపు చిగుళ్ళ చేతులెత్తి పిలిచింది
క్షితిజందాకా ప్రయాణం పెట్టుకున్న వాణ్ణి
మధ్య దారిలో ఆగిపోతానేమోనని
అడుగులముందర మంచిమనసుల పాట పరచుకుంది
మృత్యువుమీద మనిషి విజయాన్ని ప్రకటిస్తూ
సమాధినుంచి మేల్కొన్న నా చుట్టూ
లక్షోపలక్షల జనం అనేకుల్లో ఒకడినయి నేను
బాధాగ్నిని మరపించే స్నేహహస్తాల పందిరిలో

**శ్రీ ఎన్. వేణుగోపాల్**

## ఓ ప్రజాకవి! ఓ మహాకవి!

ఓ ప్రజాకవి! ఓ మహాకవి!
ఉత్తమోత్తమ కథకశేఖర!
అమర నాటకకర్త! నీకివె
అంజలులు, మా అంజలుల్.

ఎవరికందక, ఎక్కడో, గగ
నాన తిరుగిడు గానవాహిని
నిలకు దించిన, ప్రజకు పంచిన,
కవి భగీరథ! అంజలుల్.

జాను తెనుగున ఆణిముత్తెపు
సరులలో సరసార్థబోధక
కవిత నించిన, నవత పెంచిన,
కవిబ్రహ్మ! అంజలుల్.

నల్గురేమనుకొన్న నీ మది
నమ్మినది సాధించుటకునై
నడుము కట్టిన, ప్రతిన పట్టిన,
దృఢమతీ! నీ కంజలుల్,

భావమందున, భాషయందున,
సంఘమందున, సకలమందున,
మార్పు కోరిన, మహిమ మీరిన,
మానవోత్తమ! అంజలుల్.

**శ్రీ శంకరగంటి రంగాచార్యులు**

శ్రీ డి. సుందరరావు

# అలహాబాద్ ఉపఎన్నిక, 1988- జాతీయ రాజకీయాలలో దాని విశిష్టత

అలహాబాద్ నగరానికి భారతదేశంలో మహోన్నతమైన రాజకీయ చరిత్ర ఉంది. ఎందుకంటే, భారత స్వాతంత్ర్య ఉద్యమంలో చరిత్రాత్మకమైన పాత్రను నిర్వహించడమే కాకుండా, ఆధునిక భారతదేశ నిర్మాతలుగా పేరుగాంచిన పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి, శ్రీమతి ఇందిరాగాంధీలతోసహా, పలువురి ప్రముఖ రాజకీయ నాయకుల మహోన్నత చరిత్రలకు ఊతం ఇచ్చిన గంగా, యమునా, సరస్వతీ నదుల సంగమ స్థలం ఈ అలహాబాద్ నగరం. అంతేకాకుండా, అలహాబాద్ నియోజకవర్గంనుంచి గెలుపొందిన పండిట్ జవహర్‌లాల్, శ్రీ లాల్ బహదూర్ శాస్త్రిలు భారతదేశ ప్రధాన మంత్రులుగాను, శ్రీ హెచ్ ఎన్. బహుగుణ, శ్రీ విశ్వనాథ ప్రతాప్‌సింగ్‌లు ఉత్తరప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రులుగాను, ఆ తర్వాత కేంద్రమంత్రులుగాను, శ్రీ జ్ఞానేశ్వర్ మిశ్రా కేంద్రమంత్రిగాను అత్యున్నత పదవులను నిర్వహించడం వలన దేశంలోని ఇతర లోక్‌సభ నియోజకవర్గాలకన్నా అత్యంత ప్రాముఖ్యం కల్గిన నియోజకవర్గంగా అలహాబాద్ పేరు గాంచింది. ఆదినుంచి అత్యంత రాజకీయ చైతన్యవంతమైన నియోజకవర్గంగా గుర్తింపు పొందిన అలహాబాద్‌కు జూన్ 16, 1988న జరిగిన ఉప-ఎన్నిక దేశ రాజకీయాలలో అనేక సరిక్రొత్త రాజకీయపరిణామాలకు కారణభూతం కావడంతో జాతీయ రాజకీయాలలో అధికతర ప్రాధాన్యతను పొందింది. భారతదేశ రాజకీయాలలో సరికొత్త పరిణామాలకు సూచిక అయిన అలహాబాద్ నియోజకవర్గానికి జూన్ 16, 1988న జరిగిన ప్రతిష్ఠాకరమైన ఉప - ఎన్నికను తులనాత్మకంగా విశ్లేషించుదాం

**అలహాబాద్‌నుంచి గెలుపొందిన ప్రముఖులు: దేశ రాజకీయాలలో వారి పాత్ర:**

1988 జూన్ 16న అలహాబాద్ లోక్‌సభ స్థానానికి ఉప-ఎన్నిక జరగడంతో, అలహాబాద్ లోక్‌సభ నియోజకవర్గానికి మొత్తం 11 పర్యాయాలు ఎన్నికలు జరిగినట్లయింది. వీటిలో 1974, 1981, 1988లలో జరిగిన మూడు ఉప-ఎన్నికలు కూడా చేరిఉన్నాయి. 1952నుంచి 1984 వరకు జరిగిన సాధారణ ఎన్నికలతోపాటు, 1974, 1981, 1988లలో జరిగిన లోక్‌సభ ఉప-ఎన్నికలలో గెలుపొందిన ప్రముఖుల వివరాలతోపాటు, వారు దేశ రాజకీయాలలో నిర్వహించిన పాత్రనుగూర్చి తెలుసుకొందాం.

1952లో జరిగిన ప్రప్రథమ సార్వత్రిక ఎన్నికలలో పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ అలహాబాద్ నియోజకవర్గం నుంచి కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీచేయగా, ఆయనకు ప్రత్యర్థిగా ఇండిపెండెంటు అభ్యర్థి పోటీ చేశారు. పండిట్ నెహ్రూ తన సమీప ప్రత్యర్థిపై దాదాపు 31,871 ఓట్ల మెజారిటీతో గెలుపొందారు. అయితే, 1957లో జరిగిన రెండవ సాధారణ లోక్‌సభ ఎన్నికల్లో పండిట్ నెహ్రూ అలహాబాద్ నియోజకవర్గంనుంచి కాకుండా, దాని పొరుగున ఉన్న పుల్‌పూర్ నియోజకవర్గంనుంచి పోటీ చేయాలని నిశ్చయించుకోవడంతో, అలహాబాద్ నియోజకవర్గంనుంచి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేయవలసి వచ్చింది. శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి, తన సమీప ప్రత్యర్థి, ప్రజా సోషలిస్టు పార్టీ అభ్యర్థి అయిన శ్రీ ఆర్. ఎన్. పథక్ మీద 56,000 పైచిలుకు ఓట్లతో ఘనవిజయం సాధించారు అలాగే, 1962లో జరిగిన మూడవ సాధారణ ఎన్నికల్లో ఇదే నియోజకవర్గంనుంచి పోటీచేసిన శ్రీ శాస్త్రి, తన సమీప ప్రత్యర్థి అయిన భారతీయ జన సంఘం అభ్యర్థిపైన విజయం సాధించాడు.

1952, 1957, 1962 ఎన్నికల్లో అలహాబాద్ నియోజకవర్గంనుంచి గెలుపొంది దేశ ప్రధానమంత్రులుగా ఉన్నత పదవులను నిర్వహించిన పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ, శ్రీ లాల్ బహదూర్ శాస్త్రిలు మరణించడంతో అలహాబాద్ నియోజకవర్గంనుంచి మొదటి

తరం నాయకులు పోటీచేసే అవకాశం కోల్పోయింది. 1967 నుంచి జరిగిన వివిధ ఎన్నికలలో రెండవతరం నాయకులే పోటీ చేయడం ప్రారంభమైంది అలహాబాద్ నగరంతో అత్యంత సాన్నిహిత్యం కల్గిఉండిన పండిట్ నెహ్రూ, శ్రీ శాస్త్రిలు భారతదేశ నిర్మాతలుగా గణుతికెక్కడంతో, భారతదేశ రాజకీయాలలో అలహాబాద్ నియోజక వర్గానికి అత్యంత ప్రాధాన్యం లభించింది.

అత్యంత సమర్థవంతుడైన పరిపాలనాదక్షుడిగా పేరుగాంచిన శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి జనవరి 11, 1966లో మరణించడంతో, 1967లో జరిగిన నాల్గవ సాధారణ ఎన్నికల్లో శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి పెద్ద కుమారుడు శ్రీ హరికిషన్ శాస్త్రి కాంగ్రెస్ అభ్యర్థిగా అలహాబాద్ నియోజకవర్గం నుంచి పోటీచేసి, తన సమీప ప్రత్యర్థి శ్రీ సాలిగ్రామ్ జైశ్వాల్‌పై దాదాపు 15,000 ఓట్ల మెజారిటీతో గెలుపొందారు. అలహాబాద్ నియోజకవర్గం నుండి 1952, 1957, 1962, 1967 ఎన్నికల్లో శ్రీ నెహ్రూ, శ్రీ శాస్త్రి, శ్రీ హరికిషన్ శాస్త్రిలు పోటీచేసి గెల్చినా, 1971లో జరిగిన మధ్యంతర లోక్‌సభ ఎన్నికల్లో శ్రీ హెచ్ ఎన్. బహుగుణ కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేయడంతో, శ్రీ నెహ్రూ, శ్రీ శాస్త్రిల కుటుంబాలకు అలహాబాద్ నియోజకవర్గంతో సాన్నిహిత్యం తెగిపోయింది

1969 నవంబరులో భారత జాతీయ కాంగ్రెస్ రెండుగా చీలి పోవడంతో శ్రీమతి ఇందిరాగాంధీ 1971లో లోక్‌సభకు మధ్యంతర ఎన్నికలను జరిపించినది ఈ ఎన్నికల్లో అలహాబాద్ నియోజక వర్గానికి సరితూగగల అభ్యర్థి కొరకు అన్వేషణ ప్రారంభమైంది. చివరకు శ్రీ హెచ్ ఎన్. బహుగుణ అధికార కాంగ్రెస్ అభ్యర్థిగా అలహాబాద్ నియోజకవర్గం నుంచి పోటీచేసి, తన ప్రత్యర్థులైన భారతీయ జనసంఘం, భారతీయ క్రాంతిదళ్ అభ్యర్థులపై విజయం సాధించాడు. అయితే, శ్రీ హెచ్. ఎన్. బహుగుణ ఉత్తరప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రిగా నియమితులు కావడంతో అలహాబాద్ లోక్‌సభ సభ్యత్వానికి రాజీనామా చేయడంవల్ల, ఉపఎన్నిక అనివార్యమైంది

అలహాబాద్ నియోజకవర్గానికి 1974లో జరిగిన ఉపఎన్నిక మొదటి ఉపఎన్నిక. 1974లో జరిగిన అలహాబాద్ ఉపఎన్నికలో అధికార కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీచేసిన శ్రీ సతీష్ చంద్రఖేర్‌పై ప్రతిపక్షాల ఉమ్మడి అభ్యర్థిగా పోటీచేసిన భారతీయ క్రాంతిదళ్ అభ్యర్థి శ్రీ జ్ఞానేశ్వర్ మిశ్రా విజయం సాధించారు. ఆ తర్వాత 1977లో జరిగిన ఆరవ లోక్‌సభ ఎన్నికలలో ఇదే నియోజకవర్గం నుంచి జనతాపార్టీ అభ్యర్థిగా పోటీచేసిన శ్రీ జ్ఞానేశ్వర్ మిశ్రా, అధికార కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీచేసిన శ్రీ విశ్వనాథ ప్రతాప్‌సింగ్‌పై ఘనవిజయం సాధించి, కేంద్రంలో 1977 మార్చి 24న ఏర్పడిన తొలి నాన్‌కాంగ్రెస్ ప్రభుత్వంలో ఆగస్టు 11న విస్తరించబడిన మంత్రివర్గంలో పెట్రోలియం, రసాయనాలు, ఎరువుల మంత్రిగా పదవీ బాధ్యతలను నిర్వహించారు.

అయితే, 1980లో జరిగిన ఏడవ లోక్‌సభ ఎన్నికల్లో ఇందిరా కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేసిన శ్రీవిశ్వనాథ ప్రతాప్‌సింగ్, తన సమీప ప్రత్యర్థి అయిన శ్రీ జ్ఞానేశ్వర్ మిశ్రాపై దాదాపు 70,000 ఓట్ల ఆధిక్యతతో విజయం సాధించారు కాని, 1980 జూన్‌లో ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రిగా శ్రీ సింగ్ నియమితులు కావడంతో ఆయన తన అలహాబాద్ లోక్‌సభ సభ్యత్వానికి రాజీనామా చేయడంతో అలహాబాద్ నియోజకవర్గానికి 1981లో 2వ ఉప-ఎన్నిక జరిగింది. ఈ ఉప-ఎన్నికలో ఇందిరా కాంగ్రెస్ అభ్యర్థిగా అప్పటి శ్రీ వి. పి. సింగ్ మంత్రివర్గంలో విద్యుచ్ఛక్తి శాఖ సహాయమంత్రి అయిన శ్రీ కృష్ణప్రకాష్ తివారీ తన సమీప ప్రత్యర్థి, లోక్‌దళ్ అభ్యర్థి అయిన శ్రీ మెహబూబ్ అహ్మద్‌పై కేవలం 6,685 ఓట్ల ఆధిక్యతతో విజయం సాధించారు

1984 అక్టోబరులో శ్రీమతి ఇందిరాగాంధీ హత్య గావింప బడటంతో దేశ రాజకీయాలలో సరికొత్త పరిణామాలు చోటు చేసు కున్నాయి శ్రీమతి ఇందిరాగాంధీ మరణానంతరం ఆమె కుమారుడు శ్రీ రాజీవ్‌గాంధీ ప్రధానమంత్రి పదవిని చేపట్టి వెంటనే లోక్‌సభకు ఎన్నికలు జరిపించి, కాంగ్రెస్‌కు అదివరకెన్నడూ రానంతటి మెజారిటీని సంపాదించి పెట్టాడు. అయితే, ఆదినుంచి ప్రముఖ వ్యక్తులు పోటీచేస్తూ ఉండిన అలహాబాద్ లోక్‌సభ నియోజకవర్గం నుంచి, 1984లో జరిగిన ఎనిమిదవ సాధారణ ఎన్నికల్లో ఇందిరా కాంగ్రెస్ అభ్యర్థిగా సినిమానటుడు శ్రీ అమితాబ్‌బచ్చన్ పోటీచేశారు. శ్రీ అమితాబ్ బచ్చన్, తన సమీప ప్రత్యర్థి, ఉత్తరప్రదేశ్ రాష్ట్ర మాజీ ముఖ్యమంత్రి అయిన శ్రీ హెచ్. ఎన్ బహుగుణపై దాదాపు 1,97,000 ఓట్ల ఆధిక్యతతో ఘనవిజయం సాధించాడు.

1971, 1980 లోక్‌సభ ఎన్నికల్లో అలహాబాద్ లోక్‌సభ నియోజకవర్గంనుంచి గెలుపొందిన శ్రీ హెచ్ ఎన్. బహుగుణ, శ్రీ విశ్వనాథ ప్రతాప్‌సింగ్‌లు ఆ తర్వాత ఉత్తరప్రదేశ్ ముఖ్య మంత్రులుగా నియమితులు కావడం వలన, అలహాబాద్ లోక్‌సభ స్థానానికి 1974, 1981లో ఉప-ఎన్నికలు జరిగితే, 1984 లోక్ సభ ఎన్నికల్లో అలహాబాద్‌నుంచి గెలుపొందిన శ్రీ అమితాబ్ బచ్చన్, రక్షణ లావాదేవీల విషయంలో తనపై అవినీతి ఆరోపణలు రావడంతో, అలహాబాద్ లోక్‌సభ సభ్యత్వానికి రాజీనామా చేయగా, ఈ స్థానానికి 1988 జూన్ 16న మూడవ ఉప-ఎన్నిక జరిగింది దేశంలోని మరే ఇతర లోక్‌సభ స్థానానికి లేని ప్రాధాన్యత,

అలహాబాద్ లోక్‌సభ స్థానానికి ఉంది. అలహాబాద్ లోక్‌సభ స్థానానికి ఇప్పటివరకు జరిగిన 11 ఎన్నికలలో, అధికార కాంగ్రెస్ 8 పర్యాయాలు, ప్రతిపక్షాలు 3 పర్యాయాలు విజయాన్ని చవిచూశాయి. 1952 నుంచి, 1988 జూన్ 16 వరకు అలహాబాద్ లోక్‌సభకు జరిగిన వివిధ ఎన్నికల్లో పోటీచేసి గెల్చిన, ఓడిన అభ్యర్థుల వివరాలను ఈ క్రింది పట్టిక-1లో చూడవచ్చు.

పట్టిక - 1

| వరుస నెం | గెల్చిన అభ్యర్థి పేరు | గెలుపొందిన రాజకీయ పార్టీ పేరు | ఓడిపోయిన అభ్యర్థి/ రాజకీయ పార్టీ పేరు | ఎన్నిక జరిగిన సంవత్సరం |
|---|---|---|---|---|
| 1 | పండిట్ నెహ్రూ | కాంగ్రెస్ | ఇండిపెండెంట్ | 1952 |
| 2 | లాల్‌బహదూర్ శాస్త్రి | కాంగ్రెస్ | ఆర్ ఎస్ పథక్ (ప్రజా సోషలిస్టు పార్టీ) | 1957 |
| 3 | లాల్‌బహదూర్ శాస్త్రి | కాంగ్రెస్ | భారతీయ జనసంఘం | 1962 |
| 4 | హరిక్రిషన్ శాస్త్రి | కాంగ్రెస్ | సారిగ్రామ్ జైశ్వాల్ | 1967 |
| 5 | హెచ్ ఎన్. బహుగుణ | కాంగ్రెస్ (ఆర్) | జనసంఘం మరియు బి కె డి | 1971 |
| 6 | జ్ఞానేశ్వర్ మిశ్రా | బి కె డి | సతీష్ చంద్రశేఖర్ కాంగ్రెస్ (ఆర్) | 1974 |
| 7 | జ్ఞానేశ్వర్ మిశ్రా | జనత | విశ్వనాథ ప్రతాప్‌సింగ్ కాంగ్రెస్ (ఆర్) | 1977 |
| 8 | విశ్వనాథ ప్రతాప్‌సింగ్ | ఇందిరా కాంగ్రెస్ | జ్ఞానేశ్వర్ మిశ్రా (లోక్‌దళ్) | 1980 |
| 9 | కృష్ణప్రకాష్ తివారీ | ఇందిరా కాంగ్రెస్ | మెహబూబ్ అహ్మద్ (లోక్‌దళ్) | 1981 |
| 10 | అమితాబ్ బచ్చన్ | ఇందిరా కాంగ్రెస్ | హెచ్ ఎన్ బహుగుణ (లోక్‌దళ్) | 1984 |
| 11 | విశ్వనాథ ప్రతాప్‌సింగ్ | జనమోర్చా | సునీల్ శాస్త్రి కాంగ్రెస్(ఐ) | 1988 |

మూలం   ది ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా, ఏప్రిల్ 10-16, 1988, పేజీ-16.

## ప్రజాస్వామ్యంలో ఉప-ఎన్నికల ప్రాధాన్యం:

ప్రజాస్వామ్య వ్యవస్థలో నిర్ణీతకాలంలో జరిగే ఎన్నికలు ప్రముఖమైన పాత్రను వహిస్తాయి ముఖ్యంగా అధికార పక్షానికి ప్రతిబింబంగా జరిగే ఉప-ఎన్నికలు, ప్రభుత్వ మనుగడకు సూచికగా పనిచేస్తాయి. గతంలో మన దేశంలో జరిగిన కొన్ని ప్రతిష్ఠాకరమైన ఉప-ఎన్నికల సరళిని పరిశీలిస్తే, ప్రజాస్వామ్యంలో ఉప-ఎన్నికలు ఎంతటి ప్రాధాన్యంను కల్గిఉన్నాయో అవగతమవుతుంది ముఖ్యంగా 1963 మే 19న జరిగిన అమ్రోహా, ఫరూకాబాద్, రాజ్‌కోట్ ఉప ఎన్నికలు, 1973 ఏప్రిల్ 18న జరిగిన బంకా ఉపఎన్నిక, 1973 డిసెంబరు 11న జరిగిన సబర్‌కాంత లోక్‌సభ ఉప-ఎన్నిక, 1978 మే 9న జరిగిన అజాంగర్ లోక్‌సభ ఉప-ఎన్నిక, 1978 నవంబరు 8న జరిగిన చిక్‌మగుళూరు ఉప-ఎన్నిక, 1982 మే 19న జరిగిన జబల్‌పూర్, గర్వాల్, రాణి లోక్‌సభ ఉప-ఎన్నికలు అత్యంత ప్రతిష్ఠాకరమైన ఎన్నికలుగా పేరు పొందాయి

1963 మే 19న జరిగిన అమ్రోహా, ఫరూకాబాద్, రాజ్‌కోట్ లోక్‌సభ ఉప-ఎన్నికలు ఆనాడు పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ ప్రభుత్వానికి పెద్ద సవాల్‌గా పరిణమించాయి. ప్రతిపక్షాల అభ్యర్థులుగా పోటీచేసిన ఆచార్య జె బి కృపలానీ, డాక్టర్ రామ్ మనోహర్ లోహియా, శ్రీ మినూ మసానీలు ఆనాటి పండిట్ నెహ్రూ హయాంలో ధరల పెరుగుదల, కరువు కాటకాలు, అవినీతి, దేశ రక్షణపంటి ప్రభుత్వ వైఫల్యాలను ప్రధాన అంశంగా చేసుకొని, అధికార కాంగ్రెస్ అభ్యర్థులపై ఘనవిజయం సాధించారు. ఇండిపెండెంట్ అభ్యర్థిగా పోటీచేసిన ఆచార్య కృపలానీ, ఆనాటి కేంద్రమంత్రి మరియు రాజ్యసభ సభ్యుడైన శ్రీ హఫీజ్ మహమ్మద్ ఇబ్రహీంపై 60,454 ఓట్ల మెజారిటీతో అమ్రోహానుంచి గెలు

పొందగా, సోషలిస్టు పార్టీ అభ్యర్థిగా పోటీచేసిన డాక్టర్ రామ్ మనోహర్ లోహియా, కాంగ్రెస్ అభ్యర్థి, మాజీ కేంద్ర ప్రసారాల, రేడియో శాఖల మంత్రి అయిన డాక్టర్ బి వి. కేశ్కర్‌పై 57,588ఓట్ల మెజారిటీతో ఫరూకాబాద్‌నుంచి ఘనవిజయం సాధించగా, స్వతంత్ర పార్టీ అభ్యర్థిగా పోటీచేసిన శ్రీ ఎం. ఆర్. మసాని, ఆనాటి రాజ్యసభ సభ్యుడు, కాంగ్రెస్ అభ్యర్థి అయిన శ్రీ జెతాలాల్ జోషిపై 14,151 ఓట్ల మెజారిటీ సంపాదించి రాజ్‌కోట్‌నుంచి గెలుపొందారు.

అలాగే, 1973 ఏప్రిల్ 18న జరిగిన బంకా, 1973 డిసెంబరు 11న జరిగిన సబర్‌కాంత లోక్‌సభ నియోజకవర్గాల ఉప-ఎన్నికలు, శ్రీమతి ఇందిరాగాంధీ ప్రభుత్వ ప్రతిష్ఠకు సవాల్‌గా పరిణమించాయి బీహారులోని బంకా లోక్‌సభ నియోజకవర్గంనుంచి సోషలిస్టు పార్టీ అభ్యర్థిగా పోటీచేసిన శ్రీ మధు లిమాయే, అధికార కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీచేసిన శ్రీమతి శకుంతలాదేవి పై విజయం సాధించగా, గుజరాత్‌లోని సబర్‌కాంత లోక్‌సభ నియోజకవర్గంనుంచి సర్దార్ వల్లభాయ్ పటేల్ కుమార్తె మరియు సంస్థా కాంగ్రెస్ అభ్యర్థినిగా పోటీచేసిన కుమారి మణిబెన్ పటేల్, అధికార కాంగ్రెస్ అభ్యర్థి అయిన శ్రీ శాంతాభాయ్ పటేల్‌పై ఘనవిజయం సాధించింది

ఇక, 1978 మే 9న జరిగిన అజాంఘర్, 1978 నవంబరు 8న జరిగిన చిక్‌మగుళూరు లోక్‌సభ ఉప-ఎన్నికలు ఆనాటి జనతా పార్టీ రాజకీయ ప్రతిష్ఠకు, జనతా ప్రభుత్వానికి అగ్నిపరీక్షగా నిలిచాయి. ఉత్తరప్రదేశ్‌లోని అజాంఘర్ లోక్‌సభ ఉప-ఎన్నికలో ఇందిరా కాంగ్రెస్ భ్యర్థినిగా పోటీచేసిన ప్రస్తుత కేంద్రమంత్రిణి శ్రీమతి మొహిసినా కిద్వాయ్, ఆనాటి అధికార జనతాపార్టీ అభ్యర్థి అయిన శ్రీ రామ్‌బచన్ యాదవ్‌పై గెలుపొంది, ఇందిరా కాంగ్రెస్‌కు భవిష్యత్తులో విజయ సోపానానికి పునాదులు వేసింది. కర్ణాటకలోని చిక్‌మగళూర్ లోక్‌సభ ఉప-ఎన్నిక ఆనాడు దేశవ్యాప్తంగా ప్రతిష్ఠాకరమైన ఉప-ఎన్నికగా పేరుగాంచింది. ఇందిరా కాంగ్రెస్ పార్టీ వ్యవస్థాపకురాలు, మాజీ ప్రధానమంత్రి అయిన శ్రీమతి ఇందిరా గాంధీ, ఆనాటి అధికార జనతాపార్టీ అభ్యర్థి అయిన శ్రీ వీరేంద్ర పాటిల్‌పై ఘనవిజయం సాధించి, 1980 మధ్యంతర లోక్‌సభ ఎన్నికల్లో ఇందిరా కాంగ్రెస్ ఘనవిజయం సాధించడానికి మార్గాన్ని సుగమం చేసింది

1980 లో తిరిగి కేంద్రంలో అధికారాన్ని చేజిక్కించుకొన్న శ్రీమతి ఇందిరాగాంధీ ప్రభుత్వానికి, 1982 మె 19 న జరిగిన జబల్‌పూర్, గర్వాల్, రాణే లోక్‌సభ ఉప - ఎన్నికలు ప్రజాభిప్రాయానికి సూచికలుగా నిలిచాయి. మధ్యప్రదేశ్‌లోని జబల్‌పూర్ లోక్‌సభ స్థానంనుంచి భారతీయ జనతాపార్టీ అభ్యర్థిగా పోటీచేసిన శ్రీ బాబూరావ్ పరంజపే, ఇందిరా కాంగ్రెస్ అభ్యర్థినిగా పోటీచేసిన శ్రీమతి రతన్ కుమారీపై విజయం సాధించగా, ఉత్తర ప్రదేశ్‌లోని గర్వాల్ లోక్‌సభ స్థానం నుంచి డెమొక్రటిక్ సోషలిస్టుపార్టీ అభ్యర్థిగా పోటీచేసిన శ్రీ హేమావతి నందన్ బహుగుణ, ఇందిరా కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీచేసిన శ్రీ చంద్రమోహన్ సింగ్ నేగీపై ఘనవిజయం సాధించి, శ్రీమతి ఇందిరా గాంధీపై రాజకీయంగా విజయం సాధించాడు. ఇక, ప్రతిష్ఠాకరమైన లోక్‌సభ ఉప-ఎన్నికగా పేరుగాంచిన రాణే (మహారాష్ట్ర)లో భారతీయ జనతాపార్టీ అభ్యర్థిగా పోటీచేసిన శ్రీ జె ఎస్ పటేల్, ఇందిరాకాంగ్రెస్ అభ్యర్థిగా పోటీచేసిన శ్రీ పి. ఎం. హెగ్డే, ట్రేడ్ యూనియన్ నాయకుడు, ఇండిపెండెంట్ అభ్యర్థిగా పోటీచేసిన శ్రీ దత్తా సామంత్‌లపై విజయం సాధించాడు.

ఈ విధంగా ప్రజాస్వామ్య వ్యవస్థలో ఎంతో ప్రాముఖ్యతను కల్గిన ఉప-ఎన్నికలు, భవిష్యత్తులో అధికార పార్టీల విజయావకాశాలపై ఎంతో ప్రభావాన్ని కల్గి ఉంటాయి. అధికార ఇందిరా కాంగ్రెస్‌పార్టీ అనేక కోణాలనుంచి తీవ్ర సమస్యలను ఎదుర్కొంటున్న సమయంలో, అలహాబాద్ లోక్‌సభ నియోజక వర్గానికి ఉప-ఎన్నిక జరగడంతో, జాతీయ రాజకీయాలలో దాని విశిష్టత పెరిగింది. 1988 జూన్ 16 న జరిగిన అలహాబాద్ ఉప-ఎన్నికలో పోటీచేసిన వివిధ అభ్యర్థుల వివరాలను, ఉప-ఎన్నికకు జరిగిన ఏర్పాట్లను, ప్రతిపక్ష రాజకీయాలపై అలహాబాద్ ఉప - ఎన్నిక చూపిన ప్రభావంను గూర్చి విశ్లేషించుదాం.

### అలహాబాద్ ఉప - ఎన్నిక - అధ్యయనం :

1984 లోక్‌సభ ఎన్నికల్లో అలహాబాద్ నుంచి గెలుపొందిన శ్రీ అమితాబ్ బచ్చన్, రక్షణ లావాదేవీల విషయంలో అవినీతి ఆరోపణలు రావడంతో రాజీనామాచేయగా, 1988 జూన్ 16 న జరిగిన ఉప - ఎన్నిక, ముచ్చటగా జరిగిన మూడవ ఉప - ఎన్నిక. నామినేషన్ల అనంతరం అలహాబాద్ లోక్‌సభ నియోజక వర్గంలో పోటీకి నిలబడ్డ అభ్యర్థుల మొత్తం సంఖ్య-68. అలహాబాద్ నియోజక వర్గంలో మొత్తం ఓటర్ల సంఖ్య-8,36,837 వీరిలో పురుషులు 58 శాతం, మహిళలు 42 శాతం ఉన్నారు. అలహాబాద్ ఉప-ఎన్నికకు గాను ఏర్పాటు చేసిన పోలింగ్ కేంద్రాల మొత్తం సంఖ్య 46?. వీటిలో 183 పోలింగ్ కేంద్రాలను ఉద్రిక్తంగా ఉండే కేంద్రాలు గాను, 198 కేంద్రాలను ఒక మోస్తరు ఉద్రిక్తంగానూ వుండే పోలింగ్ కేంద్రాలుగా గుర్తించబడ్డాయి

ఈ ఎన్నికల్లో 68 మంది అభ్యర్థులు రంగంలో ఉండినా, ప్రధానమైన పోటీ ఇందిరాకాంగ్రెస్ అభ్యర్థి, మాజీ ప్రధాని శ్రీలాల్ బహదూర్ శాస్త్రి కుమారుడు శ్రీ సునీల్ శాస్త్రి, ప్రతి పక్షాల ఉమ్మడి అభ్యర్థి, జనమోర్చా నిర్మాత అయిన శ్రీ విశ్వనాథ ప్రతాప్

సింగ్‌ల మధ్యనే జరిగింది. ఇక, మూడవ స్థానం లభించిన శ్రీ కన్షీ రామ్ బలహీనవర్గాల ఓట్లను గణనీయంగా సంపాదించడంతో, అయన కూడా బలీయమైన అభ్యర్థిగా రూపొందాడు. ప్రధాని రాజీవ్ గాంధీకి, అన్ని ప్రతిపక్ష పార్టీలకు అత్యంత ప్రతిష్ఠాకరంగా పరిణమించిన అలహాబాద్ లోక్‌సభ ఉపఎన్నికలో ఇరుపక్షాల తరపున అతిరథ మహారథులనదగిన నాయకులు ఎన్నికల ప్రచారాన్ని నిర్వహించారు. అలహాబాద్ ఉప - ఎన్నిక అత్యంత ప్రతిష్ఠాకరమైన ఎన్నికగా రూపొందడానికి ముఖ్యంగా రెండు కారణాలను పేర్కొనవచ్చును. ఒకటి, అలహాబాద్ నియోజకవర్గం చారిత్రకంగా మహోన్నత చరిత్రను కల్గి ఉండటమేగాకుండా, పండిట్ నెహ్రూ వంశానికి రాజకీయ కేంద్రం కావడం వలనను, రెండు, 1987 ఏప్రిల్ 12 న కాంగ్రెస్ (ఐ) పార్టీకి రాజీనామాచేసి, జనమోర్చాను ఏర్పాటు చేసిన శ్రీ విశ్వనాథ ప్రతాప్‌సింగ్, అన్ని ప్రతిపక్షాల ఉమ్మడి అభ్యర్థిగా పోటీచేయడం వలన, ఈ ఉప - ఎన్నిక ఇటు శ్రీ రాజీవ్ గాంధీ వ్యక్తిగత ప్రతిష్ఠకు, అటు ప్రతిపక్షాల రాజకీయ భవిష్యత్తుకు సవాల్‌గా నిలిచింది. ఇంతటి ప్రాముఖ్యాన్ని దృష్టిలో వుంచుకునే భారతీయ జనతాపార్టీ నాయకుడు శ్రీ అటల్ బిహారీ వాజ్‌పేయి అలహాబాద్ ఉప - ఎన్నికను గూర్చి మాట్లాడుతూ "పార్టీనుంచి నిష్క్రమించిన తరువాత కూడా ప్రాబల్యం కోల్పోని కాంగ్రెస్ నాయకుడు శ్రీ విశ్వనాథ ప్రతాప్‌సింగ్. అలహాబాద్ ఎన్నికల పోరాటం అశ్వమేధయాగం" అని పేర్కొన్నారు.

8 4 లక్షల ఓటర్లున్న అలహాబాద్ నియోజకవర్గంలో అత్యధిక సంఖ్యాబలం ఉన్న ఓటర్లు హరిజనులు, వెనుకబడిన వర్గాలవారు, బ్రాహ్మణులు ఈ నియోజకవర్గంలో హరిజనులు 1.98 లక్షలమంది, వెనుకబడిన వర్గాలవారు 1.90 లక్షలమంది (ముఖ్యంగా కూర్మీస్ మరియు యాదవులు), బ్రాహ్మణులు 1.2 లక్షల మంది. ఇక, 84,000 ఓటర్లు ఉన్న ముస్లింలు, 74,000 ఓటర్లువున్న ఠాకూర్‌లు, 60,000 ఓటర్లు ఉన్న కాయస్థులు, 35,000 ఓటర్లున్న బెంగాలీలు కూడా ఈ ఎన్నిక విజయావకాశాలలో కీలకపాత్ర వహించారు.

అయిదు అసెంబ్లీ నియోజకవర్గాలను కల్గి ఉన్న అలహాబాద్ నియోజకవర్గంలో ప్రస్తుతం అలహాబాద్ నగర ఉత్తర నియోజక వర్గానికి లోక్‌దళ్ (ఎ) కు చెందిన శ్రీ అనుగ్రహ్ నారాయణ్‌సింగ్, కర్చనా అసెంబ్లీ స్థానానికి జనతాపార్టీకి చెందిన శ్రీ రియోటి రామన్ సింగ్‌లు ప్రాతినిధ్యం వహిస్తుండగా, గత ఉత్తరప్రదేశ్ రాష్ట్ర శాసనసభ ఎన్నికల్లో మేజా నియోజకవర్గం నుంచి కాంగ్రెస్ (ఐ) అభ్యర్థిగా పోటీచేసి గెల్చిన శ్రీ విక్రమ్‌దాస్ ఆ తర్వాత జనమోర్చాలో చేరిపోవడంతో, ప్రస్తుతం మేజాకి జనమోర్చా సభ్యుడు ప్రాతినిధ్యం వహిస్తున్నాడు మిగిలిన అలహాబాద్ నగర దక్షిణ, బారా అసెంబ్లీ నియోజక వర్గాలకు ఇందిరాకాంగ్రెస్‌పార్టీ ప్రాతినిధ్యం వహిస్తున్నది. 1952 నుంచి 1988 వరకు జరిగిన అలహాబాద్ లోక్‌సభ ఎన్నికల్లో శ్రీ విశ్వనాథ ప్రతాప్‌సింగ్‌కు వచ్చినంత మెజారిటీ, ఇదివరకెన్నడూ ఎవరికీ రాలేదు. ప్రతిపక్షాల ఉమ్మడి అభ్యర్థిగా పోటీచేసి గెల్చిన శ్రీ వి పి సింగ్‌కు, ఇందిరా కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీచేసిన శ్రీ సునీల్‌శాస్త్రికి, బహుజన సమాజ్‌పార్టీ అభ్యర్థిగా పోటీచేసిన శ్రీ కన్షీరామ్‌లకు 1988 జూన్ 16 న పోలైన ఓట్ల వివరాలను ఈ క్రింది పట్టిక-2 లో గమనించవచ్చు.

పట్టిక - 2

| రౌండ్‌ల వరుస | శ్రీ విశ్వనాథ ప్రతాప్‌సింగ్ | శ్రీ సునీల్ శాస్త్రి | శ్రీ కన్షీరామ్ |
|---|---|---|---|
| 1 | 16,300 | 7,044 | 4,006 |
| 2 | 16,486 | 7,248 | 4,259 |
| 3 | 15,190 | 7,481 | 4,797 |
| 4 | 17,200 | 7,253 | 4,571 |
| 5 | 17,333 | 7,727 | 4,074 |
| 6 | 17,185 | 8,249 | 4,538 |
| 7 | 15,981 | 5,871 | 6,158 |
| 8 | 17,053 | 7,333 | 7,224 |
| 9 | 14,784 | 6,613 | 7,797 |
| 10 | 15,934 | 6,613 | 6,968 |
| 11 | 14,343 | 8,222 | 6,560 |
| 12 | 15,872 | 6,303 | 5,209 |
| 13 | 4,506 | 3,500 | 1,675 |
| 14 | 5,000 | 3,546 | 1,000 |
| మొత్తం ఓట్లు | 2,03,167 | 92,221 | 68,836 |

మూలము. ఉదయం, జూన్ 20, 1988, పేజీ-8.

ప్రతిపక్షాల రాజకీయాలపై అలహాబాద్ ఉప - ఎన్నిక ప్రభావం :—

అలహాబాద్ ఉప-ఎన్నికలో ప్రతిపక్షాల ఉమ్మడి అభ్యర్థిగా పోటీచేసిన శ్రీ విశ్వనాథ ప్రతాప్‌సింగ్ ఘనవిజయం సాధించడంతో, అంతకుమునుపు వరకు ప్రతిపక్షాల ఐక్యతకొరకు మందకొడిగా సాగుతూ ఉండిన ప్రయత్నాలు, అలహాబాద్ విజయస్ఫూర్తితో వేగాన్ని పుంజుకున్నాయి అధికార ఇందిరా కాంగ్రెస్‌కు ఉమ్మడి అభ్యర్థిని పోటీకి నిలబెట్టితే అత్యధిక స్థానాలను గెల్చుకోవచ్చునన్న ప్రయోగాన్ని 1988 జూన్ 16 న జరిగిన 7 లోక్‌సభ, 11 శాసన సభ ఉప-ఎన్నికల్లో ప్రతిపక్షాలు నిరూపించాయి. ఇందులో భాగంగా, అధికార ఇందిరా కాంగ్రెస్‌కు బలీయమైన ప్రత్యామ్నాయాన్ని ఏర్పాటు చేయాలన్న నిశ్చయంతో జనమోర్చా, జనతా, లోక్‌దళ్ (బి), కాంగ్రెస్ (ఎస్) పార్టీలు ఒకటిగా విలీనమై జూలై 26, 1988 న "జనతాసమాజ్ వాదిదళ్" అనే పేరుతో సరిక్రొత్త రాజకీయ పార్టీ ఆవిర్భవించడానికి ఈ అలహాబాద్ ఉపఎన్నిక దోహదం చేసింది అంతేకాకుండా ఆగస్టు 6, 7 తేదీలలో "జనతా సమాజ్ వాదిదళ్"తో పాటు తెలుగుదేశం, అస్సాం గణపరిషత్, డిఎంకె పార్టీల నాయకులు ఇందిరా కాంగ్రెస్ పార్టీకి బలీయమైన ప్రత్యామ్నాయాన్ని ఏర్పాటు చేయాలన్న కృతనిశ్చయంతో న్యూఢిల్లీలో సమావేశమై చర్చలు జరిపారు. ఒక రకంగా చెప్పాలంటే జాతీయ రాజకీయలతోపాటు, ప్రతిపక్షాల రాజకీయాలపై కూడా అలహాబాద్ ఉప-ఎన్నిక తీవ్రప్రభావాన్ని చూపించ గల్గింది. దేశంలో అనేక సరిక్రొత్త పరిణామాలకు కారణ భూతమైన అలహాబాద్ ఉప-ఎన్నిక, భవిష్యత్తులో ఇంకెలాంటి పరిణామాలకు కారణభూతం కాగలదో భవిష్యత్తు కాలమే నిర్ణయించాలి.

## అధోజ్ఞాపికలు


1) అనురాధ దత్ మరియు దిబంగ్, 'ది బేటిల్ ఓవర్ అలహాబాద్', ది ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా, సంపుటి · 109, సంచిక · 15, ఏప్రిల్ 10-16, 1988, పేజీలు · 8-17,

2) అశ్వినీ భట్నాగర్, క్లాష్ ఆఫ్ ది టిటాన్స్' ది ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా, సంపుటి : 109, సంచిక : 24, జూన్ 12-18, 1988, పేజీలు, 20-21.

3) దిలీప్ అవస్థి మరియు ప్రభుచావ్లా, 'అలహాబాద్ బై ఎలక్షన్-అమితాబ్స్ ఆంటీ క్లైమాక్స్', ఇండియా టు డే, సంపుటి : 13, సంచిక . 11, జూన్ 1-15, 1988, పేజీలు. 22-24.

4) శేఖర్ గుప్తా మరియు దిలీప్ అవస్థి, 'అలహాబాద్ - వి. పి. సింగ్స్ క్రూసియల్ టెస్ట్', ఇండియా టు డే, సంపుటి : 13, సంచిక : 12, జూన్ 16-30, 1988, పేజీలు. 30-38

5) జె. పి శుక్లా, 'టర్నింగ్ ఆన్ అలహాబాద్', ఫ్రంట్ లైన్, సంపుటి 5, సంచిక · 12, జూన్ 11-24, 1988, పేజీలు. 15-16.

6) మనోజ్ జోషి, ' ఎ మెసేజ్ పార్ రాజీవ్ గాంధీ', ఫ్రంట్ లైన్, సంపుటి : 5, సంచిక 13, జూన్ 25-జూలై 8, 1988, పేజీలు. 4-10

7) వి. పి సింగ్స్ విక్టరీ' సంపాదకీయం, ఫ్రంటు లైన్, సంపుటి 5, సంచిక 13, జూన్ 25-జూలై 8 1988, పేజీలు 16.

8) సురేంద్రమోహన్, 'బై-ఎలక్షన్స్-ది సీడ్ పాడ్ ఎలక్టొరల్ రిఫార్మ్స్', జనత, సంపుటి 43, సంచిక 12, జూన్ 19, 1988, పేజీలు. 5-6.

9) 'ది మెసేజ్ ఆఫ్ అలహాబాద్', సంపాదకీయం, జనతా, సంపుటి 43, సంచిక జూన్ 26, 1988, పేజీలు. 3-4.

10) 'పాల్ - అవుట్ ఆఫ్ బై-ఎలక్షన్స్, నోట్‌బుక్, జనతా, సంపుటి 43, సంచిక · 14, జూలై 10, 1988, పేజీలు. 13-14.

11) లెఫ్టినెంట్ జనరల్ ఎస్. కె. సిన్హా. పి వి ఎస్ ఎం (రిటైర్డ్), 'ది మెసేజ్ ఫ్రం అలహాబాద్', ఇండియన్ ఎక్స్‌ప్రెస్, సంపుటి 56, సంచిక . 248, జూలై 4, 1988, పేజీలు. 8.

12) పి. కె. రాయ్, 'వై కాంగ్రెస్ (ఐ) లాస్ట్ అలహాబాద్' ది హిందూ, జూన్ 21, 1988, పేజీ, 8

# లంక మేత - గోదావరి ఈత

## శ్రీ పాలడుగు వెంకటేశ్వరరావు

జీవితంలో దుర్భరమైన దుఃఖాన్ని చూసిన సుబ్బారావు ఒక అతి సామాన్యమైన మనిషి. ఒకరోజు సుబ్బారావుకి బ్రతుకుమీద విరక్తి పుట్టింది. ఈ జీవితం ఒక భయంకరమయిన ముళ్ళపొద, అన్పించింది. పెళ్ళాం, పిల్లలూ, బంధువర్గమూ - అతని మెతకతనాన్ని ఆసరా చేసుకుని అకారణంగానే, అతనిమీద దౌష్ట్యం, దౌర్జన్యం చెలాయించేరు. సర్వప్రపంచంమీదా, అతనికి గొప్ప అసహ్యం కలిగింది. అతనిలో నానాటికీ పెరుగుతూ వున్న జడత్వం మీద, చుట్టూరా వుండివున్నవారి హింసాకాండ పెచ్చుమీరింది, కారణా కారణాలు కానక అది వెర్రితలలూ శిలలూ వేసి అతనికి బాధాకరంగా తయారయింది. అతను తట్టుకోలేకపోయాడు. ఆ బాధని ఇక భరించలేక ఒకరోజు తెల్లవారుఝామున కట్టుబట్టలతో, వున్నపాటున, సుబ్బారావు, ఇల్లూ వాకిలీ వదిలిపెట్టి, విశాల ప్రపంచంలోకి, కట్లు త్రెంచుకున్న దున్నపోతులాగా, పారిపోయాడు, తిరిగి వెనక్కి చూడకుండా పారిపోయి-నర సంచారానికి దూరంగా వెళ్ళిపోయాడు. 'అమ్మయ్య' - అని ఊపిరి పీల్చుకున్నాడు.

వంకలు, చెట్లు, చేమలు, అడవులు, కొండలు, గుట్టలు, రాళ్ళు, రప్పలవెంట చాలా రోజులు పిచ్చి పిచ్చిగా తిరిగాడు. ఆకలి వేస్తే, అందిన కాయా కసురూ కోసుకుని తిన్నాడు. అదీ దొరకనప్పుడు ఆకూ అలమూ తెంపుకుని తిన్నాడు. దాహం అనిపిస్తే వాగుల్లో, వంకల్లో దోసిళ్ళతో నీళ్ళు అందుకుని తాగాడు. చెట్టుక్రిందో, మీదో, పుట్టమీదో, కొండ బిలంలోనో నిద్రపోయాడు. రెండు కాళ్ళ జంతువులాగా బ్రతికాడు. అతని కట్టుబట్టలు నల్లగా అయి, చిరిగి పీలికలయిపోయాయి. చివరికి కౌపీనమే ఆ వంటిపైన మిగిలింది. జుట్టు నిరంకుశంగా పెరిగి దుమ్ము గొట్టుకుని జడలు గట్టింది. మకిలీ మడ్డి పట్టిన గడ్డమూ, మీసాలూ దుబ్బుగా మారాయి. అడవి మనిషి లాగా గమ్యమూ దారీ లేని తిరగుడు - ఒకటే తిరుగుడు. పిచ్చి పట్టినట్లు తిరుగుడు. ఏమిటి ఈ తిరుగుడు? ఎందుకు? దేనిగురించి? అతనికే తెలియదు. ఎన్నాళ్ళో-అలాగ నిరంకుశుడై తిరగ్గా, తిరగ్గా—

ఒక దుర్ముహూర్తాన సుబ్బారావులో అకస్మాత్తుగా భయంకరమయిన స్తబ్ధత చోటు చేసుకుంది. ఆ స్తబ్ధత నిరాసక్తికీ, అది విరక్తికీ చోటు ఇచ్చింది. భూమీ, నీరూ, ఆకాశమూ, సమస్తమయిన ప్రకృతీ - వెగటుగా అన్పించింది. ప్రపంచమే రోతగా అన్పించింది. తక్షణం ఒక నిర్ణయానికి వచ్చాడు, సుబ్బారావు.

వెంటనే, ఆత్మహత్యకి తలపడి నదిలోకి దూకాడు...సుళ్ళు తిరుగుతూ ఉరకలు వేస్తున్న నదీ ప్రవాహంలో మునిగి కొట్టుకుని పోతూ ఇక తన పని అయిపోయిందనుకున్నాడు. చివరిసారిగా భగవంతుని స్మరించాడు. అంతే!

సుబ్బారావు శరీరాన్ని నెత్తిమీది జుట్టు పట్టుకుని లాక్కుని వచ్చి, ఒడ్డుమీద పెట్టి, ఉబ్బిన డొక్కల్ని నొక్కి, కడుపులోని నీరు, బయటికి తెప్పించాడు, ఆ వ్యక్తి. నోట్లో తన నోరుపెట్టి గాలి ఊది ఆగిపోబోతున్న సుబ్బారావు శ్వాసని, తిరిగి తెప్పించాడు.

చాలా సేపయినాక- ఎన్నో క్షణాలు గడిచినాక-

సుబ్బారావు కళ్ళు తెరిచి నీరసంగా చూశాడు, చివరికి! ఎదుట నిల్చివున్న ఆ వ్యక్తి అజానుబాహువు స్ఫురద్రూపం, బంగారు ఛాయ గల మేను కళ్ళల్లో చిరునవ్వులు, కాషాయాంబరాలు, జటావల్కలధారి! మధుర మందహాసం చేసి - "ఇంత పని ఎందుకు చేసావు నాయనా?' అని ఆ వ్యక్తి ప్రశ్నించాడు.

'చచ్చిపోదామని' అన్నాడు సుబ్బారావు, విరక్తిగా, నీరసంగా.

'నీవు చచ్చి ఏం సాధిస్తావు? ఆత్మహత్య మహాపాపం, నాయనా?'

'స్వామీ! పాపం అంటే ఏమిటి? నన్ను నేను చంపుకోవటం పాపమెలా అవుతుంది?' అన్నాడు, సుబ్బారావు అమాయకంగా, సూటిగా.

'బాబూ! నీకు అన్నీ వివరంగా చెపుతాను. నా వెంటరా" అని సుబ్బారావుని తనవెంట తీసుకువెళ్ళాడు ఆ వ్యక్తి, ఆసరా ఇచ్చి నడిపించి. ఆ కొండల్లో కోనల్లో అక్కడికి దగ్గరలోనే చిన్న కుటీరం వుంది. అదే అతని ఆవాసం. అక్కడ అతను ముక్కు మూసుకుని తపస్సు చేసుకుంటాడు. అక్కడికి 'అంత'దూరంలో ఒక దేవాలయం

వుంది దేవుడ్ని దర్శించటానికి వచ్చిన భక్తులు ఈ స్వామిని కూడా దర్శించి, పండో ఫలమో సమర్పించి, దండం పెట్టుకుని తృప్తిపడి వెళ్ళిపోతుంటారు. అదే అతని ఆహారం లేనినాడు, నిరాహారం. స్వామి పేరు రమానంద. పూర్వాశ్రమంలో రమానంద అక్కడికి దగ్గరలో వున్న ఒక పట్టణంలో పెద్ద వ్యాపారి కోట్లు గడించి, భార్యా పిల్లలకి అప్పగించాడు. ఒకరోజు హఠాత్తుగా 'జ్ఞానోదయం' అయింది అన్నిట్నీ వదిలి సన్యాసిగా విరాగిగా మారిపోయి, ఇక్కడికి వచ్చివుంటున్నాడు. అది జరిగి అయిదేళ్ళయింది - తన గురించి చెప్పి - "నేను సన్యాసిని అన్నిటినీ విసర్జించాను ముక్కు మూసుకుని తపస్సు చేసుకుంటూ భగవదారాధనలో ప్రశాంతంగా కాలం గడుపుతున్నాను'- అన్నాడు రమానంద సుబ్బారావుతో.

"స్వామీ! మీ ధ్యేయం ఏమిటి? అడిగాడు సుబ్బారావు

'నా ధ్యేయం భగవంతుణ్ణి తెలుసుకోవటమే" అన్నాడు రమానంద నవ్వి.

'స్వామీ! అందుకు దారి ఏది? భగవంతుడ్ని చూసి తరించే దారి ఉందా?"

'దారి ఉందిలే! ముందు, నన్ను నేను తెలుసుకోవాలి - అది తెలుసుకొనటానికి అరిషడ్వర్గాలనీ జయించటం ముఖ్యం నేను వాట్ని జయించాను.' అన్నాడు రమానంద గర్వంగా.

'అరిషడ్వర్గాలంటే ఏమిటి?'- అడిగాడు సుబ్బారావు భక్తితో.

'ఈ మనిషిలో వున్న కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలే అరిషడ్వర్గాలు. ఇవి మనిషికి పరమ శత్రువులు. ఇవి నిరంతరం జీవుడిమీద దాడి జరుపుతూ అతని పతనానికి కారణభూతాలవుతున్నాయి. వీటిని జయించిననాడు, మానవుడు తననితాను తెలుసుకుంటాడు; మనిషికి అవసరమయిన ఆ ఉత్తమోత్తమమయిన మార్గాన్ని గుర్తించగల్గుతాడు. అటువంటి ఆ మార్గాన పయనించి చిదానందాన్ని అందుకుని, ఆ భగవంతునిలో, చివరకు, ఐక్యమయిపోతాడు. అదే మోక్షం.' - ప్రశాంతంగా చిరునవ్వులు వెదజల్లుతూ, వివరించాడు రమానంద. బుర్ర విదిలించాడు సుబ్బారావు. సుబ్బారావుని ఆ మాటలు ఆకర్షించాయ్. ఆ మాటలమీద ఆతనికి విశ్వాసం ఏర్పడింది. గురి కుదిరింది. నమ్మాడు

'స్వామీ! నన్నూ మీతో ఆ మార్గాన తీసుకుని వెళ్ళగలరా?' అని ప్రాధేయపూర్వకంగా అడిగాడు, సుబ్బారావు

'నాయనా! తప్పకుండా. కానీ, దానికి కఠోర సాధన కావాలి. దీక్ష వుండాలి' అనగా - 'నేను సిద్ధం! మీరు నన్ను మీ శిష్యునిగా స్వీకరించగలరా? స్వామీ!" అని అర్థించాడు సుబ్బారావు. 'అలాగే' అని ఆశీర్వదించాడు రమానంద, సాదరంగా.

సుబ్బారావు పరమానందం చెందాడు అప్పట్నుంచీ రమానందకి శిష్యునిగా మారిపోయాడు.

గురుర్బ్రహ్మ, గురుర్విష్ణుః
గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరబ్రహ్మ
తస్మైశ్రీ గురవేనమః- అని రమానందకి నమస్కరించాడు. ఆ క్షణంనుండి సుబ్బారావు ఏకాగ్రతతో, భక్తి, శ్రద్ధలతో రమానందను సేవించటం ప్రారంభించాడు రాత్రింబవళ్ళు గురుసేవలో మునిగిపోయాడు ఆదే అతని జీవితధ్యేయమయింది. గురువుగారి ఆజ్ఞలను శిరసావహించాడు. గురువు నోటివెంట వచ్చే ప్రతి మాటనూ వేదవాక్కుగా పరిగణించాడు తనను ముక్తిమార్గంవెంట చేయి పట్టుకుని నడిపించి తీసుకునివెళ్ళే అవతారమూర్తిగా అతన్ని ఆరాధించాడు. ఆ లక్ష్యాన్నే ధ్యేయంగా పెట్టుకుని సకల పరిచర్యలనూ గురువుకి అందించటంలో మునిగిపోయాడు. ఇతరమయిన అన్ని విషయాలనూ విస్మరించాడు, సుబ్బారావు గురువే సర్వస్వం అనుకున్నాడు

కాలం నడిచింది. నెలలు గడిచేయ్. సంవత్సరాలు గిర్రున తిరిగాయ్. లెక్క ప్రకారం వర్షాకాలం వచ్చింది. చల్లని గాలులు, పరుగెడుతూ వచ్చినయ్. 'భయంకరమయిన కారు మొయిళ్ళు ఆకాశాన్ని ఆక్రమించి, కడవలతో ద్రిమ్మరించినట్లు ప్రపంచాన్ని కుంభవర్షాలతో ముంచెత్తాయ్. వాగులు వంకలు పొంగి పరవళ్ళెత్తేయ్. ఆ కారణంగా. దేవాలయానికీ, స్వామి దర్శనానికీ వచ్చే భక్తుల రాకపోకలు ఆగిపోయాయ్ తద్వారా అందే పండూ, ఫలమూ అందకుండా పోయింది. అలా-

ఒకరోజు అయింది - కడుపులో పేగులు గుడగుడమన్నయ్.

రెండవరోజు గడిచింది - నీరసం, నిస్సత్తువా ఆవహించాయ్.

వారం రోజులు నడిచి వెళ్ళిపోయేయ్. పరిస్థితిలో మార్పు లేదు. ఆకలి! ఘోర కలి! అరిషడ్వర్గాలనూ జయించానన్న రమానంద తపస్సు భంగపడింది. చిడిముడిపాటు, స్వామిని ఆవహించింది. కోపతాపాలు వచ్చి పడినయ్.

'ఈ రీతిన' తమ 'తపస్సు భంగపడటానికి కారణం ఏమిటి స్వామీ!' - సుబ్బారావు వినయంగా అడిగాడు రమానందని ఒక రోజున.

'నరాలలో నీరసం నాయనా! ఆకలి మండిపోతూ వుంది' అన్నాడు రమానంద, దీనంగా, జాలి గొలిపేలాగా.

'అయితే - నావలే, తమరూ ఆకూ అలమూ స్వీకరించండి స్వామీ!'

'నాయనా! నీవు జడుడవు అందువలన నీవల్లన అవవచ్చు నేమోగానీ ఆ పని మావలన కాదు నాయనా!' అన్నాడు రమానంద చప్పరిస్తూ, లాలాజలం మింగుతూ

'ప్చ్! అందుకు కారణం ఏమిటి స్వామీ!' జిజ్ఞాసతో అడిగాడు సుబ్బారావు.

'ఆ రుచీ పచీ లేని ఆకులలములు మా వంటికి పడవు, బాబూ'

'అసలు ఒక సన్యాసికి రుచులతో పని ఏమిటి, మహాత్మా?!'

'అది నీకు తెలియదు, మూర్ఖుడవు గదా!'

'చిత్తం! అందుకే నాకు తెలిసేటట్టుగ చెప్పమని మనవి చేసు కుంటున్నాను, మహర్షీ'

'అది తర్వాత చెపుతాను. నీవు తక్షణం నోరు మూసుకుని నేను చెప్పినట్లు చెయ్యి చుట్టుప్రక్కలనున్న ఏ ఊరికో పోయి, ఇంత ఆహారం సంపాదించుకునిరా, త్వరగా '

'నాల్గువయిపులా అన్ని వాగులూ వంకలూ పొంగిపొరలు తున్నాయ్, దారి లేదు స్వామీ'

'ఎలాగో దారి చేసుకుని వెళ్ళిరా. ప్రయత్నించు. అది ముఖ్యం.'

'మహాత్మా! నేను అలా చేస్తే చచ్చిపోతాను! అంత భయంకరంగా వున్నాయ్ వరదలు!!'

'ఐతే అలాగే కానీ. నీవు చస్తే చచ్చావు గురు సేవలో తరించిన పుణ్యం నీకు తక్షణం లభిస్తుంది. పుణ్యలోకాలకు పోతావు. వెంటనే వెళ్ళిరా తినటానికి ఇంత అన్నం సంపాదించుకునివచ్చి, నా ఆకల్ని చల్లార్చి పుణ్యం కట్టుకో. అది నీ తక్షణ కర్తవ్యం '

'నేను వెళ్ళను స్వామీ! ప్రాణభయం పట్టుకుంది'.

విపరీతమయిన అసహనంతో - 'మూర్ఖుడా!' అని అరిచి, సుబ్బారావు చెంపని ఛళ్ళుమనిపించాడు, రమానంద, గూబ గుయ్యి మంది, కళ్ళవెంట నీరు తిరిగింది సుబ్బారావుకి

'ఫో!' - అరిచాడు రమానంద, అసహనంతో కోపంగా.

'అలాగే పోతున్నాను స్వామీ' అన్నాడు సుబ్బారావు దీనంగా.

'మరి త్వరగా వెళ్ళిరా.' వేగిరపెట్టాడు రమానంద.

'స్వామీ! వెళ్తానుగానీ, మళ్ళీ రాను నీవు సన్యాసివి కావు. ఇన్నాళ్ళూ ఇలా నీ దగ్గర నేను వుండటం వృథా! సర్వం వ్యర్థం!! నీవు ఆకలికి ఆగలేవు ఆ కోపాన్ని అసలే అరికట్టలేవు. మరి ఇంక నీవు సాధించిందేమిటి?! నీ బొంద! నీవు దొంగ సన్యాసివి అటువంటి నిన్ను నమ్ముకుంటే, కుక్క తోకని పట్టుకుని గోదావరిని ఈదినట్టే. ఈ క్షణంనుండి అసలు మనిద్దరికీ ఏం సంబంధం లేదు. నా దార్ని నేను పోతున్నాను. శలవు.' అని - ఆ కుంభవర్షంలో బయటికి వెళ్ళిపోతున్న, సుబ్బారావువంక నిశ్చేష్టుడై పిచ్చిగా చూస్తుండి పోయాడు రమానంద — నోరు పడిపోయినట్టు — మాట పెగిలి రాలేదు.

# దేవుడా...

## శ్రీ పి. వెంకటేశ్వర్

ఎక్కడ జారులను
జనులంతా పూజిస్తారో,
ఎక్కడ ధనం కోసం - పిల్లలు
తల్లితండ్రుల్నే త్యజిస్తారో,
ఎక్కడ నిర్దోషుల్ని
నిర్దయగా వురి తీసేస్తారో,
ఎక్కడ వ్యభిచారాన్ని
ఆచారంగా చేసేస్తారో,
ఎక్కడ నీతీ, న్యాయం
సమాధి చెయ్యబడ్డాయో,
ఎక్కడ ధర్మం, సత్యం
కాళ్ళిరిగి కూలబడ్డాయో,
అక్కడ....
అక్కడ....ఆ మనుషులమధ్య
నన్నెందుకు పుట్టించావ్?
అమ్మ కడుపులో వున్నప్పుడు
ఆత్మహత్య చేసుకోకపోవడమే
నేను చేసిన నేరమా తండ్రీ?

డా॥ మైనేని కృష్ణకుమారి

# మధ్యాంధ్రయుగములో సానులు (దేవాలయ స్త్రీలు)

మధ్యాంధ్ర యుగమున దేవాలయ నిర్మాణ, నిర్వహణములు చురుకుగా సాగినవి. ముఖ్యముగా. ఆంధ్రదేశములో ద్రాక్షారామము, చాళుక్య భీమవరము (సామర్లకోట), పాలకొల్లు, భీమవరము, అమరావతిలలోని ఐదు శైవాలయములు ప్రసిద్ధిచెంది, పంచారామ క్షేత్రములుగా ప్రాముఖ్యతను సంతరించుకొన్నవి. ఈ శివాలయముల పరిమాణములు[1] విస్తరించుటయేగాక, అందు నిర్వర్తించబడు పూజాది కార్యక్రమములు[2] కూడ ఎక్కువగుటచేత ఆనాటి సమాజములో దేవాలయములు ముఖ్యమైన సామాజిక, ఆర్థిక వ్యవస్థలుగా రూపుదిద్దు కొన్నవి. దేవాలయ శాసనములలో భగవంతుని సేవలోనున్న దేవాలయ స్త్రీలను సానులుగా ప్రస్తావించబడినారు. పంచారామ దేవాలయములలో నెక్కువ శాసనములు లభ్యమగుటచేతను, అందున్న దాన శాసనములలో కొన్నింటిని సానులు, మరియు ఆలయముల కంకిత మీయబడిన స్త్రీలు యిచ్చుటచేత ఈ శాసనములు మరియు ద్రాక్షారామ మందలి భీమేశ్వరాలయము యొక్క స్థల పురాణమై శ్రీనాథునిచే రచింపబడిన భీమేశ్వర పురాణములను ప్రామాణికము లైన ఆధారములుగా తీసికొని, ఆంధ్రదేశములో క్రీస్తుశకము 11 నుండి 13వ శతాబ్దుల వరకు సామాజికముగా, ఆర్థికముగా, మరియు మతసంబంధమై దేవాలయ సానులు నిర్వహించిన పాత్రను అధ్యయనము చేయుటయే ఈ వ్యాసములోని ముఖ్యోద్దేశము.

దేవాలయములలో నిత్యము జరుగు దైనందిన కార్యక్రమములతోపాటు పండుగ సమయములలో జరుపబడు ప్రత్యేక పూజల నిమిత్తమై దేవాలయములు స్త్రీలను, పురుషులను తగు సంఖ్యలో ఆయా పనుల కొరకై నియమించెడివారు. ముఖ్యముగా, ఆలయములలో నిర్వహించబడు అంగ రంగ భోగ సేవలు మరియు దేవునికి చేయు నితర సేవలను సానులుగా పిలువబడు స్త్రీ సేవకులకే అప్పగించెడివారు. తెలుగులో వ్రాయబడిన భీమేశ్వర పురాణమందు దేవుని సేవలో వున్న స్త్రీలను "వేశ్యలు"గా, "సాని కూతుళ్ళు"గా ప్రస్తావించడమైనది. ఈ సందర్భములో "సాని" అను పదము దేవాలయ స్త్రీల పేర్లకేగాక, కుల స్త్రీల వ్యక్తిగత నామములతో జతచేసి వాడబడినట్లు గుర్తుంచుకొనుట ఎంతైనా అవసరము. భారత దేశ మత సంప్రదాయములలో దేవాలయ సేవలో వున్న స్త్రీలను ఆయా దేవుళ్ళయొక్క భోగ స్త్రీలుగా గుర్తించడమైనది. కొన్ని పూర్వ రచనలలో స్త్రీలను దేవాలయములకు అంకిత మిచ్చినట్లుగా వ్రాయబడింది. భవిష్య పురాణములో ఏ వ్యక్తియైనా స్త్రీలను సూర్య దేవాలయమునకు అంకిత మిచ్చినచో నతడు మరణానంతరము సూర్య లోకము పొందునట్లుగా చెప్పబడింది.[3] అంతేగాక, మత్స్య పురాణములో దేవాలయమున కంకిత మీయబడిన స్త్రీలు (వేశ్యలు) దేవాలయములలో వారు చేసిన సేవల ఫలితముగా విష్ణులోకములో స్థానము పొందగలరని వ్రాయబడింది.[4] మరియును ఈ విషయమై విదేశీ యాత్రికులైన యువన్ చ్వాంగ్ (క్రీ.శ. 7వ), ఆల్బెరుని (క్రీ.శ. 11వ), మరియు మార్కోపోలో (క్రీ.శ. 13వ) మున్నగు వారు వ్రాసిన వ్రాతల వలన నీఆచారము వాడుకలో నున్నట్లుగా తెలియుచున్నది. కర్నాటక ప్రాంతములోని శాసనములలో[5] వలె మధ్యాంధ్రయుగమునాటి శాసనములలో నెచ్చటను దేవాలయములకు స్త్రీల నంకితమిచ్చుట, లేదా దానము చేయుట అనునవి ప్రస్తావించబడ లేదు. ఐనప్పటికి, శాసనములలో దేవాలయములలోని సానుల సంస్థ మరియు సానులిచ్చిన దానముల గూర్చి చెప్పబడినది. కాని, భీమేశ్వర పురాణములో ఎక్కువ సంఖ్యలో స్త్రీలు, అనగా, 600మంది స్త్రీలను ఇంద్రుడు ద్రాక్షారామములోని భీమేశ్వరునికి మార్గశిర మాసము, చతుర్దశినాడు దానమిచ్చినట్లుగా కలదు.[6] ఈ ఒక్క ఆధారము తప్ప ఆంధ్ర ప్రాంతములో దేవాలయములకు స్త్రీలను బహుమతిగా గాని,

దానముగా గాని యిచ్చినట్లు ఏ యితర ఆధారములు లభ్యము కావుట లేదు. ఐతే, క్రీ.శ. 1250 సంవత్సరమున శ్రీకూర్మమున నియబడిన ఒక శాసనములో శ్రీకూర్మము ఆలయములోని ముప్పయిమంది సానులను గూర్చిన ప్రస్తావన వున్నది[7]. ఈ శాసనాధారమునే కొందరు చరిత్రకారులు విశ్లేషించుచూ, నీ ముప్పయిమందిని కళింగ మండలపు నాయకుని కూతుర్లుగా, ఆలయమున కంకిత మీయబడినవారిగా భావించిరి[8]. కాని, శాసన విషయమును సరిగా చూచినచో వీరిని "వీరశ్రీ వరసింహ దేవర సంప్రదాయము సాన్షులు ముప్పంగ్రడు"గాను, "కళింగ మండల నాయపు కూతుళ్ళు ముప్పదిమందిగాను", "సానులు ముప్పది"మందిగాను పేర్కొనబడినది. దీనినిబట్టి శ్రీకూర్మనాథ స్వామి ఆలయము నందుండు సానుల సంఖ్యాబలము ముప్పదిమంది గాను, వీరందరు కళింగ మండలమునకు చెందిన వారగుటచేతనే, ఆ విధముగా సానికూతుర్లను భావముతోనే, కళింగ మండలపు నాయపు కూతుర్లుగా శాసనములో ప్రస్తావించబడినట్లు భావించుటకు వీలు కల్గుచున్నది. ఈ శాసనమందునే ఆలయమున కీయబడిన దానమునుండి ఆలయ సేవకులైన కళింగ మండలము సానులు ముప్పదిమందికి, ప్రతి ఒక్కరికి సంవత్సరమునకు 42 పుట్ల ధాన్యము, ప్రతిదినము రెండు విడ్యలు. నెలకు మూడు అప్పములు ఇచ్చునట్లుగా శాసనములో చెప్పబడినది. దేవాలయ శాసనములలో సానుల పేర్లు, వారి విధులను గూర్చి చెప్పినది చాల తక్కువగా కన్పించుచున్నది. శాసనములలో సానుల గూర్చి ప్రస్తావించిన సందర్భములలో నవి సానులచేత నీయబడిన దాన శాసనములు గాని, లేదా, దేవాలయమున కీయబడిన దానములను సానుల ఆధీనములో నుంచినట్లుగాగాని జరిగినది. దాన శాసనములలో నెక్కువగా, అఖండ దీపములను ఆలయములలో నేర్పరుచుటకుగాను పశువుల నిచ్చిన దానములే ఎక్కువగా నున్నవి. ఐనప్పటికిని, కొన్ని సందర్భములలో గ్రామములుగాని, ధనముగాని దేవాలయ కార్యక్రమములు నిర్వహించుటకు సానులచే నీయబడినవి.

దేవాలయములలో నియమింపబడిన యితర వృత్తులవారి వలెనే దేవాలయ స్త్రీలు కూడ కొన్ని ఆర్థిక సంబంధమైన పనులను ఆలయములలో నిర్వర్తించెడివారు. ద్రాక్షారామ శిలాశాసనములలో సానుల సంస్థలు - పెద్దమున్నూరు, కొండ్డిక మున్నూరులుగా చెప్పబడినవి మున్నూరు అనునది ఆ సంస్థయొక్క సంఖ్యాపరమైన బలమును, అనగా, 300ను తెలియపరుచుతూంది. ఇంద్రునిచే 600 మంది స్త్రీలు భీమేశ్వరునికి అంకిత మిచ్చినట్లుగా భీమేశ్వర పురాణములో పొందుపరచబడిన స్థానిక సంప్రదాయము ననుసరించి కాబోలు, సానుల సంఖ్యాపరముగా పిల్చుటకు గల కారణము. ఒక్క ద్రాక్షారామము శివాలయమందు మాత్రమే సానులు-300 సమాజములు రెండు వున్నట్లుగా శాసనముల వలన తెలియుచున్నది మధ్యాంధ్ర దేశములోని శివాలయములలో సానులు-300, లేదా సాని మున్నూర్వురు సమాజము ఒక్కటి మాత్రమే యున్నది.[9] శాసనములలో చెప్పబడిన ఈ సానుల సంస్థలు (లేదా సమాజము) ఆయా దేవాలయములు నెలకొల్పబడిన స్థలముల పేర్ల మీదుగా పిలువబడుచున్నవి. ఉదాహరణకు, జుత్తిగ శివాలయములోని సానుల సంస్థను "దుత్తిగ మున్నూర్వురని", అట్లే కొమ్మూరులోని సానుల సంస్థను "కొమ్మూరి సాని మున్నూర్వు"రని చెప్పబడినది. స్థల నామముల మీదుగా ఆయా సంస్థలకు పేర్లిడుట అనునది, బహుశ, మధ్యయుగ కాలమునాటి సంప్రదాయము కాబోలు. శిలాశాసనములలో ద్రాక్షారామము కొన్నిసార్లు "పెద్దడాకిరేమి" అని పిలుపబడినది. బహుశ నీపేరు మీదనే కాబోలు, ద్రాక్షారామములోని ఒక సంస్థను "పెద్ద మున్నూటి సానుల" సంస్థగా చెప్పబడినది. కాని అదే ప్రదేశములోని కొండ్డిక మున్నూరు సానుల సంస్థ పేరు ఏవిధముగా వచ్చినది, దాని ప్రాముఖ్యతను గురించి ఏ వివరములం తెలియుటలేదు.

దేవాలయముల ద్వారా దేవాలయ స్త్రీలు మధ్యయుగమునాటి సాంఘిక, ఆర్థిక స్థితిగతులలో సంభవించిన మార్పులకు, అభివృద్ధికి ఎంతో తోడ్పడినారు. క్రీ.శ. 10వ శతాబ్ది మొదలు, వర్తక వ్యాపారములు అభివృద్ధి చెందుట, ఆర్థిక రంగములో ధనము ప్రధానపాత్ర వహించుట వలన పట్టణ ప్రాంతములు ముఖ్య స్థావరములుగా అభివృద్ధి చెందినవి.[11] సారవంతమైన నదీవాహక ప్రాంతములందు, నదీ సంగమములందును సాధారణముగా దేవాలయములు నిర్మింపబడినవి. అట్టి దేవాలయములు ఎక్కువ ప్రజాదరణము పొంది తద్వారా

ఆర్థికముగా మంచి స్థితినందుండి ఎక్కువమంది స్త్రీలను వివిధ సేవలకు నియమించెడివారు. అందువలననే జుత్తిగ, కొమ్మూరు, చేబ్రోలు, పాలకొల్లు మరియు ద్రాక్షారామములోని దేవాలయములలో సాని 300 సంస్థలు భగవంతుని సేవలో నుండెడివి. తక్కువ సారవంతమైన ప్రదేశములలోనున్న దేవాలయములు ఆర్థికముగా బలపడలేదు. బహుశ, అందువలననే కాబోలు, అట్టిచోట్ల తక్కువ సంఖ్యలో స్త్రీలు దేవాలయ సేవలో నియమితులైనారు. యిట్టి పరిస్థితిని సమీక్షిస్తూ ఆర్. ఎన్. నంది అను చరిత్రకారుడు ఈ విధముగా అన్నారు. "సారవంతమైన ప్రదేశములలో నెలకొల్పబడిన దేవాలయములు రాజులచేత, రాజ్యపాలనా యంత్రాంగముచేత వర్తకులు, వ్యాపారులు, మున్నగువారిచేత ఎక్కువగా ఆదరించబడుచుండెడివి."[12] మధ్యయుగములో ఎక్కువగా ప్రాంతీయ రాజ్యములు మండలిక నాయకులు, వారి క్రిందనుండు యితర అధికారులతోను పాలింపబడుచుండెడివి. సార్వభౌముల వద్దనుండి మరియు ప్రాంతీయ ప్రజానీకము నుండి సహాయ సహకారములు పొందుటకుగాను ఈ మండలేశ్వరులు తరుచుగా దేవాలయములను సందర్శించుచుండెడివారు. ఆ కాలమున పంచారామ క్షేత్రములు మిక్కిలి ప్రసిద్ధికెక్కిన పుణ్య క్షేత్రములుగా భావించబడుటవలన, ఆంధ్ర ప్రాంతములోని మండలేశ్వరులు వానిని దర్శించి, విరివిగా దానములను ఆలయముల కిచ్చెడివారు. ఈ విధముగా మాండలిక అధికారులలో పెంపొందిన నూతన దృక్పథము వలన దేవాలయములలో జరుపబడు అనేక కార్యక్రమములలో కూడ నూతన మార్పులు ఏర్పడుటచే, ఆయా కార్యక్రమములు నిర్వర్తించుటకు ఎక్కువమంది స్త్రీలు దేవాలయ సేవలకు అవసరమయినారు.

మతపరముగా చూచినచో, దేవాలయములు ముఖ్య కేంద్రములుగా నెలకొల్పబడిన బ్రాహ్మణ స్థావరములలో పౌరాణిక మత తత్వము బలముగా పాదుకొనుట వలన పురాణ గాథలను చదువుట, వాటికి సరియైన భాష్యములు ప్రజలకు అర్థమగురీతిలో సులభతరముచేసి చెప్పుట అనునవి పూజారులు యితర బ్రాహ్మణ పండితులు తమ పవిత్రమైన బాధ్యతగా స్వీకరించిరి.[13] హిందూ మతమునుండి ఆవిర్భవించిన పౌరాణిక మతతత్వములైన శైవము, వైష్ణవము, శాక్తము సామాన్య ప్రజానీకములో బహుళవ్యాప్తి చెందుటకు దేవాలయములలో వల్లెవేయబడు పురాణ పురుషుల గాథలు, ఆలయ శిఖరములపై, కుడ్యములపై చెక్కబడిన శిల్ప, విగ్రహ ప్రతిమలే ముఖ్య కారణములుగా చెప్పవచ్చును.[14] యివేగాక, మతసంబంధమై, దేవాలయ స్త్రీలు చేయు గానము, నాట్యము కూడ ప్రజల మనస్సులలోకి హత్తుకొని ప్రజలలో భక్తి భావములు పెంపొందుటకు మూల కారణము లై యుండవచ్చును.[15] ఈ కారణములచేతనే దేవాలయములు స్త్రీలను ఆలయ సేవలకు నియమించి తద్వారా నవి కళలకు, భక్తిమార్గములకు మూలకేంద్రములుగా నిలిచినవి. ఈ విధమైన పద్ధతులద్వారా ప్రజలలో భక్తిభావమును పెంపొందించుటకు, ప్రజలలో మతపరమైన ఆసక్తి కలిగించుటకు క్రీ.శ. 8వ శతాబ్ది మొదలునుండి దేవాలయ నిర్మాణములు చురుకుగా సాగి, ఆలయ సేవలలో స్త్రీలను వినియోగించుట, లేదా నియమించుటనునది మధ్యయుగ కాలమునందు ఎక్కువయినది.

భగవంతుని ఆరాధనే మోక్ష సాధనకు మార్గమను భావము ప్రజలలో పెల్లుబుకుటచే, దేవాలయములు, ముఖ్యముగా పంచారామ తీర్థక్షేత్రములు ఆ భక్తిభావమును పెంపొందింపజేసినవి. భగవంతుని సేవకు పూర్తిగా అంకితము కావలెనన్న భక్తులలో భగవంతునికి సేవ చేయవలెనన్న దృక్పథము కలుగుట అవసరము.[16] భగవదారాధన చేసిన భక్తులకు కల్గు పుణ్యములు ప్రస్తుతించినప్పుడు ఆయా దేవాలయముల స్థల పురాణములు, ప్రాంతీయ కథలు దేవాలయములలో జరుగు పూజా కార్యక్రమములకు ఎక్కువ ప్రాధాన్యత నిచ్చుట గమనించదగ్గ విషయము. పుష్పములు మరియు నితర ఆహార పదార్థములను దేవునికి సమర్పించుటకంటె నృత్యమో, గానమో, లేదా ఒక సంగీత వాయిద్యమో దేవునికి సమర్పించుకుంటే ఎక్కువ పుణ్యమిచ్చునదిగా నాడు భావింపబడినది. అట్టి పద్ధతిని అనుసరించినచో నది సకల అభీష్టములు తీర్చునదిగాను మరియు నొక యాగము చేసిన లభించు పుణ్యముతో సమానమైనదిగాను కొనియాడబడినది.[17] సామాజిక పరముగా ఆలోచించి చూసినచో, మధ్యయుగములో ప్రజలు ఆచరించిన భక్తిమార్గము, ఎక్కువమంది ప్రజలకు అనుసరణీయమైన మార్గముగా నిలిచినదని చెప్పవచ్చును. ఈ భక్తిమార్గము ఆచరణకు సులభము కావునను, సామాన్య ప్రజానీకమునకు సులువుగా అర్థమగురీతిలో నుండుటచేతను, ముఖ్యముగా నిది సమాజములోని తక్కువ కులములవారిచే ఆచరించబడి, భక్తి మార్గములో ప్రజలమధ్య ఎక్కువ, తక్కువ అను తేడాలు లేవను సమసమాజ భావనకు నాంది అయినది.[18]

దేవాలయములలోని స్త్రీలు మతసంబంధమైన కార్యక్రమములు నిర్వర్తించుటేగాక, తమ నాట్యముతో, గానముతో మతపరమైన సిద్ధాంతములను వ్యక్తము చేయుట వారి మరియొక గురుతరమైన బాధ్యత. నాటి శాసనములలో, వాఙ్మయములలో దేవాలయ సానులు యితర ఆలయ సేవకులతో కలిసి నిర్వర్తించవలసిన కొన్ని పనులను గూర్చి చెప్పబడినది.[19] భగవంతునికి ప్రతిదినము పవిత్ర జలములతో నభిషేకము చేయించుట, వింజామరలతో దేవునికి వీచుట, దీప కరండములు చేతబూని రథయాత్రల సమయములందు దేవుని పూరేగించుట, కొన్ని సమయములలో పాడుట, నాట్యము చేయుట—

వీనిలో కొన్ని పనులు. ముఖ్యముగా, ఆలయములలో (శైవ, వైష్ణవ) జరుపబడు పూజా కార్యక్రమములలో అంగభోగము, రంగ భోగము అనునవి ముఖ్యమైనవి.[20] దేవుని ప్రస్తుతించుచూ, నాతని సమక్షములో స్త్రీలు చేయు గానము, నాట్యములే ఈ అంగ, రంగ భోగముల ముఖ్యాంశములు. ఆలయములలోని దేవుడు రాజ ప్రాసాదములోని రాజు సాధారణముగా స్త్రీలచే సేవలు పొందు తుండుటచేతను, వారు ఆ దేవునియొక్క, లేదా, రాజుయొక్క భోగ స్త్రీలుగా పరిగణించబడుటచేతను వారిరువురి మధ్య విశేషమైన పోలిక వున్నట్లుగా చెప్పవచ్చును.[21] రాజుని సంతోషపరుచుటకై రాజా స్థానములోని నర్తకీమణులు చేయు నాట్యములవలెనె, ఆలయములందు జరుగు అంగ రంగ భోగములలో స్త్రీలు ప్రముఖపాత్రను నిర్వర్తించి దేవుని సంతోషపెట్టుదురు ఆలయములలో జరుగు దైనందిన కార్యక్రమమంతయు చూచినచో నది ఒక రాజుయొక్క దినచర్యను ప్రతిబింబించునట్లుగా నున్నది. రాజులు, రాణులవలె దేవుళ్ళు, దేవతలకు కూడ సాయం సమయములందు నాట్యము, గానములతో కూడిన వినోద కార్యక్రమములు అవసరమయినవి.[22] దేవలోకములో అప్సరస స్త్రీలైన రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమల నృత్య, గానములలో సంతోషము చెందు భగవంతునికి ఈ లోకమందు అట్టి సుఖభోగముల నేర్పరిచి, వారిని సంతోష పెట్టవలెనన్నదే దీనియందు ముఖ్యోద్దేశము.[23] భీమేశ్వరాలయములోని సానుల అందము నృత్యగీతములు చేయుటలో వారి నేర్పును చెప్పుచూ, శ్రీనాథుడు వారిని అప్సరస స్త్రీలతో పోల్చి నాడు.[24] ఆలయములలో నృత్యము చేయు స్త్రీల విధులను గూర్చి వెనీషియన్ యాత్రికుడైన మార్కోపోలో గమనించి వ్రాసిన పత్రము ముఖ్యమైన ఆధారముగా చెప్పవచ్చును. క్రి.శ, 13వ శతాబ్దిలో ఆంధ్ర ప్రాంతములో పర్యటించి వ్రాసిన నీపత్రము నాటి ప్రజా జీవనము గురించి వారి ఆచారములు, సంప్రదాయములు మున్నగు ఎన్నో అంశములతో నిండియున్నది. ఆచార వ్యవహారముల గూర్చి చెప్పునపుడు ఆలయ స్త్రీల గురించి కొంత వివరములు వ్రాసెను. అందునతడు ఈ విధముగా వ్రాసెను: "ప్రతిదినము రాజుగారి ముందుంచు భోజనమువలెనె, దేవునిముందు కూడా నైవేద్యములనుంచి, ఆలయస్త్రీలు ఆరగింపు సమయమునందు గానము, నృత్యము చేసెదరు. కొంత సమయము గడిచిన పిమ్మట ఆ నైవేద్యములను అచ్చటినుండి తీసివేసి, పూజారులు, యితర ఆలయ సేవకులతోపాటు స్త్రీలు ఆరగించెదరు. కొన్ని సమయములందు దేవుడు ఒక దేవేరితో ఆలయము నుండి బయటకు వెడలెనని పూజారులు ప్రకటన చేయుదురు. అట్టి సమయములందు భక్తులకు దీవెన లిచ్చుటకు భగవంతుడు ఆలయము లందుండడు గావున, వెనువెంటనే, ఆలయ స్త్రీలు భగవంతుని అనేక విధముల స్వాంతనపరిచి, దేవునికి, ఆలయ దేవేరికి మధ్య సఖ్యత కుదిర్చి, ఆనందముగా నుంచుటకు వివిధ హావ, భావ, ప్రకటనలు చేయుదురు. కొందరు స్త్రీలు భగవంతుని ప్రసన్నము చేసికొని నవ్వించుటకొరకై ఎగురుచూ, గెంతుతూ, అనేక రకములైన నాట్య భంగిమలను చేయుదురు. మరికొందరు భగవంతుని సంతుష్టని చేయుటకు, మెప్పించుటకు అనేక ప్రసంగములు చేయుదురు. కొందరు మెడ మీదుగా కాలినెత్తి, తమచుట్టు గిర,గిరా తిరుగుచూ నాట్యము[25] చేయుదురు." మార్కోపోలో ఆలయములలో జరుగు వివిధ పద్ధతులను గూర్చి చేసిన వివరణలనుబట్టి ఆలయ స్త్రీలు గానము, నాట్యము, సంగీత వాయిద్యములపై గానము చేయుట, మున్నగు తమ విధులను నిర్వర్తించి దేవుళ్ళను సంతోషపెట్టెదరని తెలియుచున్నది.

గాయకీమణులుగా, వాద్యకారులుగా, నాట్యకత్తెలుగా ఆలయ స్త్రీలు తమ విధులను నెరవేర్చవలెనన్నవారు విధిగా గానము, నాట్యము మున్నగు కళలందు తగిన శిక్షణ పొందియుండవలెను. వీరికి ఈ కళలలో శిక్షణ నిచ్చుట అనునది పిన్నప్రాయము నుండియే జరుగుచుండెడిదని శాసనములద్వారా తెలియుచున్నది. క్రి.శ.1213లో నీయబడిన జాయప నాయకుని చేబ్రోలు శిలాశాసనమునందు కొంత మంది నాట్యస్త్రీలు, తమ ఎనిమిదవ సంవత్సరము నందుండియే నాగేశ్వరస్వామి సేవలో నుండిరని చెప్పబడినది.[26] చిన్న వయస్సు నుండి ఆలయ సేవలలో నుండుటచే కాబోలు, వీరిని సాధారణముగా సానికూతురు అని పిలువబడిరి.[27] కొన్ని శాసనములందు ఈ సానులు "సానివాడ" అను ప్రత్యేక వీధిలో నివసించుచుండినట్లును, ఆలయములే వీరికి కావలసిన సదుపాయములన్ని ఏర్పాటు చేసినట్లును తెలియుచున్నది.[28] పాలకొల్లునందు క్రి.శ. 1169లో వీయబడిన ఒక శాసనమందు నాట్యముచేయు నిమిత్తము పొందునటువంటి 'నట్టువవృత్తి', సంగీత వాయిద్యమును ప్రయోగించుటకు పొందు 'ఆవజవ వృత్తు'లను క్షీరా రామేశ్వర ఆలయములోని సాని-300 సంస్థ అధిపతికి దానముగా నిచ్చినట్లు కలదు.[29] ఆలయములో జరుగు నాట్యము, గానము మున్నగు కళలను సక్రమముగా జరిపించ వలసిన బాధ్యత సాని-300 సమాజముదేనని ఈ శాసనము వలన తెలియుచున్నది. ఈ గుడిసానుల యొక్క వ్యక్తిగత జీవిత విధానము గురించి శాసనములలో కొంత సమాచార మీయబడినది. వీనివలన కొందరు సానులు వివాహములు చేసికొని సంసార జీవితము సాగించినట్లు స్పష్టమగుచున్నది. ద్రాక్షారామములోని సానులచే నీయబడిన దాన శాసనములలో వారి పూర్వీకుల గురించి కొంత ప్రస్తావన గలదు. సూరసాని అను ఆలయ స్త్రీ పెద్దమున్నూటి సంద్దరాపాని కూతురుగాను,[30] సాని సంక్కరమ కొండిక మున్నూటి సాని సంక్కరమ కూతురుగాను చెప్పబడినది[31]. దీనివలన సానులు వైవాహిక జీవితమును నెరపినట్లును మరియు వంశ పారంపర్యముగా స్త్రీలు, ఆలయ సేవలకు అంకితమయినట్లును తెలియుచున్నది. తమిళనాడులోని కొన్ని తమిళ శాసనములలో ఆలయములలో చేయు

నాట్యములతో తగు శిక్షణ పొంది ఆలయ సానులుగా నుండుటకు స్త్రీలను తగు వెలకు ఆలయములకు అమ్మినట్లుగా కలదు.[32] కాని, ఆంధ్ర ప్రాంతములోని శాసనములందెచ్చటను ఈ పద్ధతి ప్రస్తావింపబడలేదు. అజయమిత్ర శాస్త్రి అను చరిత్రకారుడు వైవాహిక జీవితము గడుపుచున్న స్త్రీలు కొందరు తమ ప్రతిజ్ఞలను, మొక్కులను తీర్చుకొనుటకై తమంతట తాము స్వచ్ఛందముగా ఆలయములలో నాట్యము చేయుచూ ఆలయ సేవకే అంకితమయ్యేదని వ్రాసినారు.[33] ఎ. ఎస్. ఆల్టేకరు గారి అభిప్రాయము ననుసరించి చూచినచో, సంతతి లేనివారికి ఎట్టకేలకు కల్గిన మొదటి సంతానము బాలిక అయినచో, నామెను ఆలయముల కంకితము చేయుట మధ్యయుగము నాటి ఆచారముగా తెలియుచున్నది.[34]

శాసనాధారములను బట్టి చూచినచో మధ్యయుగమునందు ఆలయములకు నాట్యస్త్రీలను అంకిత మొనర్చుట అనునది ప్రజా బాహుళ్యము మెచ్చిన ఆచారముగా కన్పడుచున్నది. అందువలననే ప్రజలు తాము ఆలయమునకు ఒక అఖండ దీపము, గ్రామము, భూమి, లేదా తమ వృత్తులను దాన మిచ్చునప్పుడు అవి ఆలయముల లోని సానుల సంస్థ ఆధీనములో నుంచిరి. క్రీ.శ. 1137లో వెలనాటి దేశమునకు అధిపతి అయిన గొంకరాజు శ్రీరా రామేశ్వర దేవాలయము నకు అఖండ దీపము నుంచునప్పుడు ఆ దానమును ఆలయములోని సాని మున్నూర్వురు సంస్థ పరిరక్షణలో నుంచెను.[35] దానముగా నీయబడిన భూమి, పశుసంపద, ధనము మున్నగువానిని పరిరక్షించుటే గాక, తమ విధులను నెరవేర్చుటకు అవసరమయినప్పుడు భూములను కూడా కొనుగోలువంటి వ్యవహారములలో కూడ వారు తమ పాత్రను చురుకుగా నిర్వహించినారు. లక్కిసెట్టి అనునతడు పాలకొల్లులోని శివాలయములో దీపము నుంచుటకు కావలసిన భూమిని ఆలయ సానులద్వారా క్రీ.శ. 1808లో కొని ఆలయమున కిచ్చినాడు.[36]

ఆలయములలోని యితర మగసేవకులతోపాటు వీరికి కూడా ఆలయముల కిచ్చిన దానములలో కొంతభాగము దాతలచేతనే కేటాయించబడెడిది.[37] దీనివలన సానుల ఆర్థిక పరిస్థితి కొంత మెరుగుగానే యుండెడిదని చెప్పవచ్చును. అంతేగాక, సానులచే ఆలయమున కీయబడిన దానములు కూడా తెలియుచున్నవి. భీమేశ్వరునికి అంగ, రంగ భోగములు, నైవేద్యములు పెట్టుటకు పెద్దమున్నూర్వురు సంస్థకు చెందిన వాసాసాని ఒక గ్రామమును క్రీ.శ. 1268లో ద్రాక్షారామ ఆలయమునకు యిచ్చినది.[38] అదే స్థలములో కొండ్డికి మున్నూటి సాని అయిన సంక్కరమ అను స్త్రీ 25 వెల గద్యలను బంగారముతో చేయబడిన వింజామర కొరకై క్రీ.శ. 1228లో పెట్టినది.[39] ద్రాక్షారామములోని భీమేశ్వరాలయములో అచ్చటి దేవాలయ సానులు ఇచ్చిన దానములేగాక యితర ఆలయములలో (శైవ, వైష్ణవ) నుండిన సానులు యిచ్చిన దానశాసనములు కూడ కలవు. క్రీ.శ. 1157వ సంవత్సరమందు చందోలులోని పండీస్వర స్వామి ఆలయము లోని గుడి సాని అయిన బానమమ్మ ద్రాక్షారామ భీమేశ్వరునికి దాన మిచ్చినట్లుగా కలదు.[40] అదేవిధముగా, క్రీ.శ. 1179నాటి మరియొక శాసనములో విష్ణువు గుడిలోని గుడి సాని 50 గొఱ్ఱెలను దీప దాన నిమిత్తముగా నిచ్చినట్లున్నది.[41]

ఈ విధముగా నీ అధ్యయనము వలన మధ్యయుగమునందు ఆలయములలో అంగ రంగ భోగములు మరియు నితర ఆలయ సేవలను నిర్వర్తించుటకుగాను స్త్రీలను ఎక్కువ సంఖ్యలలో నియమించినట్లు తెలియుచున్నది. ప్రస్తుతము జరిపిన ఈ పరిశోధన వలన ఆలయములలోని స్త్రీలు నాటి వర్తక వ్యాపార సంస్థలవలెనే సాని మున్నూర్వురు, సానులుమూనులు, పెద్ద మున్నూటి సానులు, కొండ్డిక మున్నూటి సానులు అను విధముగా వేర్వేరు పేర్లతో సంస్థలుగా నేర్పడినట్లు తెలియుచున్నది. ఈ సానుల సంస్థలు తమ ఆధిపత్యములో నుంచబడిన దానములను పరిరక్షించుటతో తమ బాధ్యతలను నెరవేర్చుచూ, ఆలయములలో నిచ్చు నృత్య ప్రదర్శనల ద్వారా, సామాన్య ప్రజానీకములో భక్తి భావమును ప్రబోధించుచూ, నాటి సమాజములో నతి కీలకమైన పాత్రను నిర్వహించినవి. మరియు మధ్యయుగ కాలమున ఆంధ్రదేశములోని శాసనములను పరిగణన లోనికి తీసికొని చూచినచో, కర్ణాటక ప్రాంతములోవలెనే నిచ్చట గూడా వైష్ణవాలయముల కంటెను శివాలయములలోనే సానుల సంఖ్య అధికముగా నున్నట్లు వెల్లడి యగుచున్నది.

## అధోజ్ఞాపికలు

1. ఆర్. చంపకలక్ష్మి, "ది ద్రవిడియన్ స్టైల్ ఆఫ్ ఆర్కిటెక్చరు: ఎ హిస్టారికల్ పర్స్పెక్టివ్" ఇండియన్ హొరైజన్స్, వాల్యూం. 31, నం. 12. (1982) పే. 7.
2. ఆర్ ఎన్. నంది, రెలిజియస్ ఇన్స్టిట్యూషన్స్ అండ్ కల్ట్స్ ఇన్ ది డెక్కన్, 600-1000ఎ.డి. (ఢిల్లీ, 1973), పే.1
3. ఎ. ఎస్. ఆల్టేకర్, ది పొజిషన్ ఆఫ్ ది విమెన్ ఇన్ హిందూ సివిలైజేషన్, (2వ ప్రచురణ) పూనా, 1969, పే. 183.
4. మత్స్యపురాణము, 70, పే. 209-13.
5. ఆలోక పరాశర్ అండ్ ఉషా నాయిక్, "టెంపుల్ గర్ల్స్ ఆఫ్ మిడీవల్ కర్నాటక", ది ఇండియన్ ఇకనామిక్ అండ్ సోషల్ హిస్టరీ రివ్యూ, వాల్యూం: 23, నం: 1, జనవరి-మార్చి, 1986, పే. 63-76.
6. భీమేశ్వర పురాణము, 5 ఆశ్వాసము ప. 84.

7. సౌత్ ఇండియన్ ఇన్స్క్రిప్షన్స్, వాల్యూం. 5, నం. 1188, టెంపుల్ ఇన్స్క్రిప్షన్స్ ఆఫ్ ఎ.పి., వాల్యూం 1, శ్రీకాకుళమ్ డిస్ట్రిక్టు, నం. 264.

8. కె. సూర్యనారాయణ, మైనర్ చాలుక్యన్ డైనాస్టీస్ ఆఫ్ ఆంధ్రదేశ (ఢిల్లీ 1986) పే. 264.

9. సౌ. ఇం. ఇ. వాల్యూం. 10, నం. 12, 59, 70, 80.

10. అదే, 59 మరియు 80.

11. డి. ఎన్. ఝా, "ప్రెసిడెన్షియల్ అడ్రెస్" సేక్షను 1, ఇండియన్ హిస్టరీ కాంగ్రెసు, 40వ సెషను, వాల్తేరు, 1979.

12. ఆర్. ఎన్. నంది, "ప్రెసిడెన్షియల్ అడ్రెస్, సెక్షను–1, ఇండియన్ హిస్టరీ కాంగ్రెసు, 45వ సెషను, అన్నామలై, 1984, పే. 65.

13. ఎమ్. జి. ఎస్. నారాయణన్ అండ్ కేశవన్ వెలూథట్, "భక్తి మూవ్‌మెంటు ఇన్ సౌత్ ఇండియా" ఇన్ ఎస్. సి. మాలిక్, ఎడిటెడ్, ఇండియన్ మూవ్‌మెంట్స్: సమ్ యాస్పెక్ట్స్ ఆఫ్ డిస్సెంట్, ప్రొటెస్టు అండ్ రిఫార్మ్ (సిమ్లా) 1978, పే.40.

14. అదే, పే. 40–41.

15. దేవాంగన దేశాయి, ఇరోటిక్ స్కల్ప్చర్ ఇన్ ఇండియ, (న్యూ ఢిల్లీ, 1975) పే. 155.

16. భీమేశ్వర పురాణము, ఆరవ ఆశ్వాసము, పే. 78.

17. విష్ణు ధర్మోత్తర పురాణము, 3; 34, 25–27, సువిర జయస్వాల్, ది ఆరిజిన్ అండ్ డెవలప్‌మెంటు ఆఫ్ వైష్ణవిజమ్, బి. సి. 200–500 ఎ.డి. (2వ ప్రచురణ) (ఢిల్లీ, 1981, పే. 162)

18. ఆర్. ఎన్. నంది, "ఆరిజిన్ అండ్ నేచర్ ఆఫ్ శైవైట్ మొనాస్టిజమ్– ది కేస్ ఆఫ్ ది కాలముఖస్" ఇన్ ఆర్. ఎస్. శర్మ అండ్ వి. ఎన్. ఝా (ఎడిటెడ్) ఇండియన్ సొసైటి: హిస్టారికల్ ప్రోబింగ్స్, 2వ ప్రచురణ, ఢిల్లీ 1977.

19. భీమేశ్వర పురాణము, ఆరవ ఆశ్వాసము, ప. 79.

20. సౌ. ఇం. ఇ. వాల్యూం. 4, నం. 1245, అదే, వాల్యూం. 5 నం. 157.

21. పి. వి. కానె, హిస్టరీ ఆఫ్ ధర్మశాస్త్రాస్, వాల్యూం. 5, పార్టు1, (పూనా, 1974) పే. 34–36.

22. నీరద్ సి. చౌధురి, హిందుయిజమ్ (న్యూఢిల్లి, 1979) పే. 90–91.

23. అజయమిత్ర శాస్త్రి, ఇండియ యాజ్ సీన్ ఇన్ ది కుట్టనీమాత ఆఫ్ దామోదర గుప్త (ఢిల్లీ, 1975) పే. 86.

24. భీమేశ్వర పురాణము, అయిదవ ఆశ్వాసము.

25. మారిస్ కాలిస్, మార్కో–పోలో (లండన్, 1959) పే. 164

26. ఎపిగ్రాఫియా ఇండికా, వాల్యూం. 5, పే. 142.

27. భీమేశ్వర పురాణము, ఆరవ ఆశ్వాసము, పే. 79.

28. సౌ. ఇం. ఇ. వాల్యూం. 4. నం. 989.

29. అదే, వాల్యూం. 5, నం. 162.

30. అదే, వాల్యూం. 5, నం. 1261.

31. అదే, నం. 1372.

32. అన్యువల్ రిపోర్టు ఆన్ సౌత్ ఇండియన్ ఎపిగ్రఫి, 1918, నం. 80, పే. 108, మరియు చూడుడు, కె. ఇస్మాయిల్, కర్నాటక టెంపుల్స్: దైర్ రోల్ ఇన్ సోషియో ఇకనామిక్ లైఫ్, (ఢిల్లీ, 1984) పే. 124.

33. అజయమిత్రశాస్త్రి, పైది, పే. 87.

34. ఎస్. ఎ. ఆల్టేకర్, పైది, పే. 183.

35. సౌ. ఇం. ఇ. వాల్యూం నం.160.

36 అదే, నం. 137.

37. అదే, నం. 227.

38. అదే, నం. 1245.

39. అదే, నం. 1372.

40. అదే, నం. 1130.

41: అదే, నం. 1300.

# జీవనం

## 'నరేన్'

పరదాలు తొలిగించాలన్న సరదా లేనంతవరకూ
కెరటాల తటిల్లతలు తొలగనంతవరకూ
యెందుకన్న ప్రశ్న ఉదయించనంతవరకూ
యెంతో హాయి!
పేరు మరచిన చిన్న చీమ
దారి తెలియని క్రూసో
బందిఖానాలో యెడ్మండ్సూ
మానవాళికి మంచి మిత్రులు.
అంతు తెలియని వింతలోకపు
అగడ్త పానుపు అనుభవైకవేద్యం.
ప్రమాదాల మలుపులో పులి పొంచివుంటుందని తెలిసినా
అసంకల్పితంగా, యదావిధిగా
సాగుతూనే వుంటుంది
సాదా సీదా జీవన ప్రయాణం.
జీవనమొక పదబంధ ప్రహేళిక
అర్థం పర్థంలేని మాటల కూడిక
జీవనమొక పరమ పదసోపానం
నిచ్చెనలు సైతం పాములైనవేళ
మొదటి గదిలోనే శాశ్వత నివాసం.
అహం మంటలో
ప్రేమయినా, ద్వేషమయినా వొక్కటే!
నిరంతర ఘర్షణలో
ప్రతి మనిషీ సారధి లేని పార్థుడే!
నొక్కినకొద్దీ లేచే పడగా
వేడినకొద్దీ యెగసే పంజా
ప్రేమించినకొద్దీ వేధించే కొరడా
క్షణం క్షణం చస్తున్నా బతకాలన్న కోరిక....
స్వప్న శకలాలు కొన్ని సాక్షాత్కరిస్తాయి నిజంగా
చీకటి కాంతులు కొన్ని కవ్విస్తాయి హమేషా....
జలకించిన ప్రవాహం అమాంతంగా యిగిరిపోతుంది
ఆకాశపు యింద్రధనస్సు ఆశగా కేలందిస్తుంది.
మృగతృష్ణలో సైతం దాహాలు తీరుతాయి
అనవరత మరణకేళిలో ఆశ మొగ్గ తొడుగుతుంది
జీవనం
నిరంతర నిర్వాణం
అనంత సల్లేఖనం

~~~~~~~~~~~~~~

# రాగం... జీవన యోగం

## వాక్పతి

భావ లతలు,
రాగసుమాలు రచిస్తేనే
జీవనవనం పరిమళించేది!
శాంతి రసామ్రమ శాఖపై
సౌఖ్య శ్రుతిలో
స్వగత కోకిల
అనుభూతి వసంతాలలో
సరసస్వర గీతి నాలపించేది—
ఆలాపనకు
ఆ మధురిమకు
పరవశించే; మనోవీధిలో
గంతులు వేసే ఊహాబాలురు
మరింత మధురంగా
ప్రతి రాగం తీసేది....
హృదయకుంజం తరించేలా!
—అందుకే రాగం
వనాన్ని, జీవనాన్ని
రమ్యంగా రసమయం చేస్తుంది!!
~~~~~~~~~~~~~~

# ఈ మాసం - మీ నక్షత్రఫలం

**జనవరి – 1989**

**మేషం** (అశ్విని, భరణి, కృత్తిక 1పా)

అశ్విని వారికి 7 తేదీ నుండి ఉష్ణాధిక్యము, మానసికంగా ఆందోళన, భార్యకు స్వల్పంగా నలత, ధనవ్యయము మొదలగునవి కలిగించును. శ్రమ హెచ్చుగా ఉండును. ఉద్యోగులకు, మంచి అభివృద్ధి, విద్యార్థులకు విజయం, కర్షక, కార్మికులకు, వర్తకులకు కూడ మంచి లాభము. వ్యాపారము చేయువారికి మంచి లాభము కలుగును. ఆరోగ్యం సరిగా నుండదు. విందులు, వినోదములు, సుఖానందములు కలుగును.

భరణి వారికి 13 తేదీనుండి శరీరంలో నలత, శ్రమ హెచ్చుగా నుండును. భాగ్య సంపాదనము జరుగును. వివాహాది శుభ కార్యములు నెరవేరును. కుటుంబ సంసార సౌఖ్యము కలుగును. ఉద్యోగులకు, విద్యార్థులకు, రాజకీయ నాయకులకు మంచి అభివృద్ధి, మాట పలుకుబడి, గౌరవము కలుగును. బంధుమిత్ర సమాగమము, ఉత్సాహము, ఆనందము, ఉల్లాసము కలుగుచుండును.

కృత్తిక 1పా. వారికి 6 తేదీ శ్రమ కలుగును. ధనవ్యయము హెచ్చుగా నుండును. భార్యకు నలతచేసి నిమ్మళించును. శుభకార్య ప్రయత్నములు నెరవేరును. అనుకొన్న పనులు సకాలంలో నెరవేరుచుండును. ఉద్యోగ వ్యవహారాలు సాఫీగా కొనసాగిపోవును. ధనాదాయం బాగుగా పెరిగినను, ఖర్చులు కూడ అధికంగా జరుగును. రాజకీయవేత్తలకు శ్రమ హెచ్చు. మొత్తంమీద ఈ నక్షత్రం గల వారందరికీ మేలు, శుభము, అభివృద్ధి కలిగించుచుండును.

**వృషభం** (కృత్తిక 2, 3, 4పా. రోహిణి, మృగశిర 1, 2 పా)

కృత్తిక 2, 3, 4పా. వారికి శని, గురుల బలం తక్కువ. పెద్దగా భోగించకపోయినను, సామాన్యంగానే గడచిపోవును. వ్యయ ప్రయాసలతో శుభకార్య ప్రయత్నాలు నెరవేరుచుండును. భార్యా వర్గం వారితో తగవులు, పేచీలు వచ్చును. భూమి, గృహం మొదలగు వానిలో కొంత ప్రతిష్టంభన ఏర్పడును. ఉద్యోగులకు, వర్తకులకు, కర్షకులకు శ్రమతో కూడిన ఫలితం కొనసాగును.

రోహిణి వారికి 13 తేదీ శని దోషం తొలగిపోయినను, నెలంతా కుజునివలన శరీరంలో ఉష్ణాధిక్యత కలుగును. భార్యకు అనారోగ్యం చేసి నిమ్మళించును. ఆర్థికంగా తొట్రుపాటు, ధనవ్యయము కలుగును. తాహతకు మించిన పనులను తలపెట్టి నెత్తిపై వేసికొని బాధపడుట జరుగును. వర్తకులకు పెద్దగా లాభం రాకపోయినను, నష్టము మాత్రముండదు. రాజకీయవేత్తలకు అతి శ్రమమీద, వ్యయ ప్రయాసలమీద విజయం కల్గును శుభాశుభ మిశ్రమంగా ఉండును.

మృగశిర 1, 2పా. వారికి మొదటి పది రోజులు కొంత యోగము బాగున్నా, 13 తేదీనుండి శారీరకంగా, మానసికంగా శ్రమ, నలత, కార్యవిఘ్నములు కలుగుచుండును. ఉద్యోగ వ్యవహారములలో చిక్కులు కలుగును. శుభకార్యాలకు ఆటంకము కలుగును. అనుకొన్న పనులు సకాలంలో నెరవేరక వాయిదా పడుచుండును. మనస్సు ఎల్లప్పుడూ పనికిమాలిన ఆలోచనలతో కాలము గడుపుట జరుగును. విద్యార్థులకు, వర్తకులకు సామాన్యంగా నుండును. సంతానమునకు నలతచేసి నిమ్మళించును. సుఖం తక్కువ. శ్రమ హెచ్చుగా నుండును.

**మిథునం** (మృగశిర 3, 4పా. ఆర్ద్ర, పునర్వసు 1,2,3పా)

మృగశిర 3, 4పా. వారికి 13 తేదీనుండి మానసికంగా అశాంతి, శ్రమ హెచ్చుగా నుండును. వ్యవహారములన్నీ వాయిదా పడును. బంధు విరోధము కలుగును. కుటుంబంలో కలత, నలతలు హెచ్చుగా ఉండును. ధనవ్యయం అధికంగా జరుగును. 16-24 తేదీలమధ్య భార్యకు అనారోగ్యముచేసి నిమ్మళించును. ఉద్యోగులకు, విద్యార్థులకు, వర్తకులకు సామాన్యస్థితి కలుగును. శుభాశుభ మిశ్రమంగా ఉండును.

ఆర్ద్ర వారికి 14 తేదీవరకు శ్రమ, వ్యాకులత్వం హెచ్చుగా నుండును. అనుకొన్న ప్రతి పనికీ ఏదోవిధంగా ఆటంకములు కలుగుచుండును, సోదరవర్గము వారితో మాటపట్టింపులు వచ్చును. ఉద్యోగులకు రాబడికిమించి ఖర్చు జరుగును. నెల చివరలో భార్యకు స్వల్పంగా నలతచేసి నిమ్మళించును. శుభకార్యాలకు, పుణ్య ధర్మకార్యములకై ధనవ్యయము జరుగును. లేని పోని దర్జాలకు పోయి, ధనవ్యయం చేసికొనుట జరుగును. శుభాశుభ మిశ్రమంగానే ఉండును.

పునర్వసు 1, 2, 3పా. వారికి 5-22 తేదీలమధ్య శరీర శ్రమ, అసంతృప్తి హెచ్చుగా నుండును. అనుకొన్న పనులు జరుగ

కుండుటయేకాక మానసికంగా వైకల్యాన్ని కూడ కలిగించును. ఉద్యోగ వ్యవహారాలలో అనుకూలత కలుగును. రాజకీయవాదులకు, వ్యవసాయదారులకు, వర్తకులకు ఎంతో అనుకూలంగా ఉండును. శుభకార్యములలో పాల్గొనుట జరుగును. తరచు ప్రయాణములు చేయుట, అందువలన ఇంతో, కొంతో లాభముకూడ కలుగుచుండును.

**కర్కాటకం** (పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష)

పునర్వసు 4పా. వారికి శారీరకంగా, మానసికంగా శ్రమ, అలసట, మనోవైకల్యం మొదలగునవి కలిగినను, ఉద్యోగంలో మంచి అభివృద్ధి కలిగించును. శుభకార్య ప్రయత్నాలు వాయిదా పడును. అయితే తలపెట్టిన ప్రతి పనిలోను విజయము కలుగుచుండును. వర్తకులకు, విద్యార్థులకు బాగుగానేయుండును. 22, 28 తేదీలలో భార్యకు స్వల్పంగా నలతచేసి నిమ్మళించును.

పుష్యమి వారికి నెలంతా బాగుగానే ఉండును. కుటుంబ సంసార సౌఖ్యం, నానావిధముల సుఖసంతోషములు, పుష్కలంగా ధనలాభము జరుగును. పుణ్య ధర్మకార్యములందు పాల్గొనుట, సాధు సజ్జన సహవాసము, సద్గోష్ఠి కలుగును. ఉద్యోగులకు ప్రమోషను, విద్యార్థులకు విజయము, వర్తకులకు లాభము, వ్యవసాయదారులకు ఉత్సాహము కలుగును.

ఆశ్లేష వారికి 6 తేదీవరకు శరీరంలో నలత, శ్రమ, వేడిమి కలుగును. ఆర్థికంగా కొంత కలసివచ్చును. తలపెట్టిన పనులు సకాలంలో జరుగక వాయిదా పడుచుండును. కావలసినవారితో విరోధం, మనస్సునకు అకారణమైన ఆందోళన, పనికిమాలిన ఆలోచనలు కలుగుచుండును. ఎంత ధనము వచ్చినను, కొన్ని పనికిమాలిన ఖర్చులగును. భార్యకు శరీరంలో నలతచేసి నిమ్మళించును. ఉద్యోగ వ్యవహారాలు సాఫీగా కొనసాగిపోవును. అయితే శ్రమ హెచ్చుగా నుండును.

**సింహం** (మఘ, పుబ్బ, ఉత్తర 1పా.)

మఘ నక్షత్రం వారికి 18 తేదీనుండి కుటుంబ సంసార విషయంలోను కొన్ని వ్యవహార విషయంలోను మంచి ప్రోత్సాహకరంగా నుండును. శుభకార్య ప్రయత్నములు నెరవేరును. సంతానమునకు అన్నివిధముల విద్యా, ఉద్యోగాదిరంగాలలో బాగుగా రాణించును, ధనము అనేక విధముల కలసివచ్చును. ఉద్యోగులకు, విద్యార్థులకు, రాజకీయ నాయకులకు, వర్తకులకు, మొత్తం అన్ని వర్గాలవారికి వారి వారి రంగాలలో లాభము, విజయం కలుగుచుండును.

పుబ్బవారికి శుభయోగం బాగుగానే ఉండును. తలకు మించిన పనులలో సతమతము కావలసివచ్చును. బంధుమిత్రాదుల నిమిత్తము ఖర్చు చేయవలసి వచ్చును. శుభకార్యములలో పాల్గొనుట, సాధు సజ్జన సహవాసం, దైవకార్యములలో పాల్గొనుట జరుగును. ఉద్యోగ వ్యవహారములన్నీ సానుకూలముగా నుండును. వస్తు వాహన సేకరణ, సువర్ణాదిరూపమైన భాగ్యము కలసివచ్చును.

ఉత్తర 1పా. వారికి 6 తేదీవరకు శ్రమ వేడిమి కలుగును. ఆ పిమ్మట కుటుంబ సంసారసౌఖ్యం కలుగును. ఉద్యోగ వ్యవహారములలో విజయం కలుగును, బంధుమిత్ర సమాగమము, నూతన వస్తులాభము కలుగును. సంతానమునకు అన్నివిధాల అభివృద్ధి కలుగును. ధనాదాయం బాగుగా కలసివచ్చును. వర్తకులకు, వ్యవసాయదారులకు కూడ మంచి లాభము కలుగును.

**కన్య** (ఉత్తర 2, 3. 4 పా. హస్త, చిత్ర 1, 2 పా.)

ఉత్తర 2, 3, 4పా. 6 తేదీవరకు శ్రమ, నలత, వేడిమి కలుగును. సోదరవర్గంతో మాట పట్టింపులు వచ్చును. పెద్ద పరుగులకు పోయి ధనము ఖర్చగుటచే బాధపడవలసి వచ్చును. అనుకోకుండా అప్పటికప్పుడు కొన్ని చిక్కులు ఏర్పడి ఒక విధముగా అనుకొన్న ధనము అనుకోకుండా మరియొక దానిక్రింద వ్యర్థముగా ఖర్చగుట జరుగును. మొదటి వారంలో భార్యకు నలతచేసి నిమ్మళించును. ఉద్యోగులకు, విద్యార్థులకు, వర్తకులకు అన్నివిధముల అనుకూలమైన కాలము.

హస్త వారికి ఇంతవరకు తెగని సమస్యలు, వ్యవహారములు ఈ నెలలో పరిష్కారమగును. కాని నెలంతా శరీరంలో అధిక వేడిమి కలుగుచుండును. ధనలాభము కలుగును. ఉద్యోగ వ్యవహారములన్నీ సానుకూలమగును. రాజకీయాలలో విజయం కల్గును. ప్రజలలో గౌరవము కలుగును. బంధుమిత్ర సమాగమము కలుగును. అయితే శరీరశ్రమ హెచ్చుగా నుండును. 18 తేదీవరకు సంతానమునకు నలతచేసి నిమ్మళించును.

చిత్ర 1, 2పా. వారికి 16-24 తేదీలమధ్య శ్రమ, నలత, ధనవ్యయము కలిగించును. భూగృహ వ్యవహారాదులలో అధిక వ్యయప్రయాసలను కలిగించును. ఉద్యోగ వ్యవహారములన్నీ సానుకూలముగా నుండును. సంతానమునకు అన్నివిధాల అభివృద్ధి కలుగును. తరచు భార్యతో వాగ్వాదములు జరుగును. మనస్సునకు చిరాకు, మూర్ఖత్వము కలుగుచుండును. 13 తేదీనుండి శరీరశ్రమ హెచ్చుగా నుండును.

**తుల** (చిత్ర 3, 4 పా. స్వాతి, విశాఖ 1, 2, 3 పా.)

చిత్ర 3, 4పా. వారికి 13 తేదీనుండి శరీరశ్రమ, నలత, కలిగించును. సంతానమునకు నలత చేయును. ఉద్యోగంలో అభివృద్ధి కలుగును. వ్యవహారములలో చిక్కులు కలుగును. శుభకార్య

ప్రయత్నముల కాటంకము కలుగుచుండును. అధికంగా ధనవ్యయము జరుగును. ఉద్యోగులకు, విద్యార్థులకు, వర్తక, కార్మికులకు అన్ని విధాల మేలు, కలుగును. 16-24 తేదీలమధ్య శ్రమ అధికంగా ఉండును.

స్వాతి వారికి గురు, రాహువుల బలం తక్కువ. అప్పుడప్పుడు ఆరోగ్యం భంగమగుచుండును. అధికశ్రమ, ధనవ్యయము హెచ్చుగా నుండును. ఉద్యోగంలో అధికారులతో మాట పట్టింపులు వచ్చును. చిరాకు, మూర్ఖత్వం హెచ్చుగా నుండును. మనస్సునకు సరియైన స్థిమితం ఉండదు. చివరివారంలో భార్యకు నలత చేయును. సోదర జ్ఞాతి దాయాద బంధువులతో విరోధము కలుగును. గురునకు జపశాంతులు చేయించుట మంచిది.

విశాఖ 1. 2, 3పా. వారికి 5-25 తేదీలమధ్య శ్రమ, ధన వ్యయము కలిగించును. వ్యవహారాల్లో విజయం కలుగును. ఉద్యోగంలో మంచి అభివృద్ధి కలుగును. శుభకార్య ప్రయత్నములు నెరవేరును. విద్యార్థులకు ఉన్నతశ్రేణి వచ్చును. బంధుమిత్ర సమాగమము కలుగును. రాజకీయ నాయకులకు మంచి లాభసాటిగా నుండును. పెద్దవారితో పరిచయము కలుగును.

## వృశ్చికం (విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ)

విశాఖ 4పా. వారికి నెలంతా శుభయోగంతో గడచును. సంతానమునకు అన్నివిధాల అభివృద్ధి కలుగును. ఉద్యోగులకు మంచి అభివృద్ధి కలుగును. కుటుంబంలో వివాహాది శుభకార్యములు జరుగును. కుటుంబ సంసార సౌఖ్యము బాగుగానే ఉండును. విద్యార్థులకు, వర్తకులకు విజయం, లాభము కలుగును. 5-25 తేదీలమధ్య శ్రమ హెచ్చుగా నుండును. స్థిర వస్తు సంపాదనము జరుగును. అధికారులతో పరిచయము, స్నేహము కలుగును. సంఘంలో మంచి పలుకుబడి, గౌరవము కలుగును.

అనూరాధ వారికి శుభాశుభ మిశ్రఫలం కలుగును. శరీరంలో శ్రమ హెచ్చుగా నుండును. ఆర్థిక వ్యవహారములలో అధిక ధన వ్యయ ప్రయాసలను కలిగించును. ఉద్యోగంలో మంచి అభివృద్ధి కలుగును. ధనవ్యయము హెచ్చుగా జరుగును. బంధుమిత్రాదుల రాకపోకలు, వత్తిడి హెచ్చుగా నుండును. మనస్సునకు స్థిమితం తక్కువవా నుండును. మనోవైకల్యం హెచ్చుగా నుండును.

జ్యేష్ఠ వారికి గ్రహబలం బాగుగా నున్నది. ఉద్యోగులకు ప్రమోషను కలుగును. కుటుంబంలో సుఖ సంతోషములు, బాగుగా నుండును. ధనాదాయం బాగుగా నుండును. కాని లేనిపోని దర్జాలకు, గొప్పలకు పోయి ధనము ఖర్చగుట, బాధపడుట జరుగును. శుభ కార్యాలు ఫలించును. ఉద్యోగులకు, విద్యార్థులకు, వ్యవసాయదారులకు అనుకూలమైన కాలము పుణ్య ధర్మ కార్యక్రమములలో పాల్గొనుట జరుగును.

## ధనుస్సు (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1పా.)

మూల వారికి సం॥రమునుండి ఎటూ తెగక పట్టి పీడిస్తున్న శారీరక, మానసిక, ఆర్థిక, కుటుంబ విషయక, వ్యవహార సంబంధములైన సమస్యలు, చిక్కులు విడిపోయి, 13 తేదీనుండి అన్నివిధముల ధనలాభము, కుటుంబ సంసార సౌఖ్యము, విద్యా-ఉద్యోగ-రాజకీయ-వ్యాపార సంబంధములన్నీ కలసివస్తాయి. అన్నింటిలోను విజయ పథంలో దారితీయును. కాని కొన్నాళ్ళపాటు ధనవ్యయం అత్యధికంగా జరుగుచుండును. శ్రమ హెచ్చుగా నుండును.

పూర్వాషాఢ వారికి 13 తేదీనుండి శారీరకంగా, మానసికంగా శ్రమ, ఖేదము, త్రిప్పట మొదలగునవి కలిగించును. ప్రతి పనిలోను చిన్న చిన్న ఆటంకములు కలుగుచుండును. బంధువులతో విరోధము కలుగును. భూ గృహ వ్యవహారాదులలో చిక్కులు, ధనవ్యయము జరుగును. సంతాననిమిత్తము ధనవ్యయం జరుగును. మానసికంగా ఆందోళనము, పనికిమాలిన ఆలోచనలు హెచ్చుగా నుండును. ఉద్యోగులకు, విద్యార్థులకు, వర్తకులకు సామాన్యస్థితి కలుగును.

ఉత్తరాషాఢ 1పా. వారికి 6 తేదీవరకు శరీరశ్రమ కలుగును. ధనాదాయమునకు లోపముండదు. కొన్ని స్థిర నిర్మాణములు చేయుట జరుగును. కుటుంబంలో సుఖ సంతోషములు కలుగును. సంతానమునకు విద్యా-ఉద్యోగాది రంగములలో బాగుగా రాణించును. ఉద్యోగులకు, విద్యార్థులకు, రాజకీయవాదులకు, వృత్తిపనివారలకు యోగము బాగుగా కలసివచ్చును. అయితే శ్రమ హెచ్చుగా నుండును.

## మకరం (ఉత్తరాషాఢ 2, 3, 4పా. శ్రవణం, ధనిష్ట 1. 2 పా)

ఉత్తరాషాఢ 2, 3, 4పా. వారికి 6 తేదీవరకు శ్రమ కలుగును. భార్యకు స్వల్పంగా నలత చేయును. సోదరవర్గముతో అభిప్రాయ భేదములు కలుగును. 25 తేదీనుండి మానసికంగా కూడ కలత చెందుట జరుగును. ధనవ్యయము అత్యధికంగా జరుగును. ఉద్యోగులకు, విద్యార్థులకు, వ్యవసాయదారులకు మాత్రము అన్ని విధాల అనుకూలంగా ఉండును. గృహ నిర్మాణాది విషయములలో జాగ్రత్త వహించుట మంచిది. అయినను కుటుంబంలో కలత నలతలలో హెచ్చుగా నుండును.

శ్రవణము వారికి 13 తేదీనుండి శుభయోగం కలసివచ్చును. తలచిన పనులన్నీ నిరాటంకముగా కొనసాగుటయేకాక, పుష్కలంగా ధనము కలసివచ్చును. కుటుంబంలో సర్వవిధముల సుఖ సంతోషములు కలుగును. అయితే 7 తేదీనుండి శరీరంలో అధిక

వేడిమి, శ్రమ, మనస్సునకు కొంత దిగులుపాటు కలిగించును. రాజకీయ వేత్తలకు, కర్షక, కార్మికులకు అన్ని రంగముల వారికి అనుకూలంగా ఉండును. సంతానమునకు అన్నివిధముల అభివృద్ధి కలుగును.

ధనిష్ట 1, 2పా. వారికి 13 తేదీనుండి చిక్కులు, శరీరశ్రమ ధనవ్యయం, ఆందోళన మొదలగునవి జరుగును. సంతానమునకు అన్నివిధముల అభివృద్ధి కలుగును. శుభకార్య ప్రయత్నములకు ఆటంకములు కలుగును. బంధుమిత్రాదుల రాకపోకల వలన వ్యయము జరుగును. భూ గృహ వ్యవహారాదులలో చిక్కులు తటస్థించును. మనస్సునకు పనికిమాలిన ఆలోచనలు, పిరికితనము హెచ్చుగా నుండును.

**కుంభం** (ధనిష్ట 3, 4 పా. శతభిషం, పూర్వాభాద్ర 1, 2, 3 పా)

ధనిష్ట 3, 4పా. వారికి 13 తేదీనుండి కుటుంబంలో కలతలు, నలతలు హెచ్చును. కార్యవిఘ్నములు జరుగును. ఉద్యోగ వ్యవహారములలో బాగుగా రాణించును. తలచిన పనులకు ఆటంకములు కలుగును. ధనవ్యయం జరిగినను, ఆర్థికంగా తొట్రుపాటు కలుగుచుండును. ధరలు తగ్గుటవలన వ్యవసాయదారులకు, వర్తకులకు సామాన్యలాభము కలుగును. శుభకార్య ప్రయత్నములకు ఆటంకములు కలిగి వాయిదా పడును.

శతభిషం వారికి నెలంతా శుభాశుభ మిశ్రఫలం కలుగును. అప్పుడప్పుడు ఆరోగ్యము భంగము కలుగుచుండును. శుభకార్యాల మూలకంగా ధనవ్యయం జరుగును. ధనాదాయమునకు లోపముండదు. శారీరకముగా శ్రమ హెచ్చుగా నుండును. సంతానమునకు నలత చేయును. దర్జాలకు, విలాసములకు నిమిత్తము అనుకొనని విధంగా ధనవ్యయం జరుగును. మనస్సునకు ఖేదమును కలిగించును.

పూర్వాభాద్ర 1, 2, 3పా. వారికి 5-25 తేదీలమధ్య శ్రమా, ఖేదమూ, త్రిప్పటా కలుగును. ధనవ్యయం అత్యధికంగా జరుగును. వ్యవహారములన్నీ విజయప్రదంగా నుండును. మాట పలుకుబడి, సంఘంలో గౌరవము కలుగును. విద్యార్థులకు ఉన్నత విద్యావకాశం కలుగును. ఉద్యోగులకు ప్రమోషను కలుగును. అన్ని రంగముల వారికి సుఖ సంతోషములు, ఉత్సాహము, ఆనందము, సంతృప్తి కలిగించును. సద్గోష్ఠి, సాధు సజ్జన సహవాసము, పెద్దవారితో పరిచయమేర్పడును.

**మీనం** (పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి)

పూర్వాభాద్ర 4పా. వారికి 5-25 తేదీలమధ్య శరీరశ్రమను కలిగించును. ధనము బాగుగా కలసివచ్చును. బంధుమిత్రాదులతో సుఖంగా గడచిపోవును. నెల చివరలో ఆర్థికంగా తొట్రుపాటు కలుగును. అయితే తలపెట్టిన పనులన్నింటియందును విజయం, లాభము, అభివృద్ధి కలిగించును. రాజకీయవాదులకు లాభసాటిగా నుండును. ఉద్యోగులకు, విద్యార్థులకు, వ్యవసాయదారులకు, శ్రమజీవులకు కూడ బాగుగా కలసివచ్చును.

ఉత్తరాభాద్ర వారికి నెలంతా బాగుగానే ఉండును. అనుకొన్న పనులన్నీ నెరవేరుచుండును. ఆరోగ్యం చక్కగా నుండును. కుటుంబ సంసార సౌఖ్యం బాగుగానే ఉండును. వివాహాది శుభకార్యక్రమములలో పాల్గొనుట, దైవపూజలు, వ్రతములు మొదలగు కార్యక్రమములలో పాల్గొనుట జరుగును. విద్యార్థులకు, రాజకీయ నాయకులకు, అన్ని రంగములవారికి వ్యవహారములన్నీ విజయపథంలో కొనసాగును. కాని ప్రతి చిన్న పనిని అతి పెద్ద శ్రమతో చేయవలసి వచ్చును. ధనాదాయం బాగుగా పెరుగును. ఈ నక్షత్రం గలవారందరికి శుభప్రదమైన కాలము.

రేవతి వారికి 6 తేదీవరకు శ్రమ, వేడిమి కలిగించును. ఆరోగ్యం సామాన్యముగా ఉండును. దర్జా, ఆడంబరము, డాబు దర్పములు మొదలగువానికై ధనవ్యయము జరుగును, అధిక స్థాయిలో ఖర్చు చేయుట జరుగును. మానసికంగా ప్రతి విషయంలోను ఆందోళన పొందవలసి వచ్చును. మొత్తంమీద ఈ నక్షత్రం గలవారందరికి సుఖము తక్కువ. శ్రమ హెచ్చుగా నుండును. సాధు సజ్జన సహవాసము, సద్గోష్ఠి మొదలగునవి కలుగును.

సిద్ధాంతి: **నిష్ఠల వేంకట సత్యసుబ్రహ్మణ్యం**



# "ఏమండీ. ఆ భరించలేని నొప్పి ఏమైంది!"

"పోయిందే!"




మేలుపరచబడిన అమృతాంజన్ వాడడంతో.

కోమలమైన అమృతాంజన్‌ను చాలా సులభంగా రాసుకోవచ్చు.

మృదువైన అమృతాంజన్‌తో చాలా సులభంగా 'మర్దనా' వేయవచ్చు.

తలనొప్పులను, వొళ్ళు నొప్పులను, కీళ్ళ నొప్పులను, కండరాల నొప్పులను మరియు బెణుకులను మేలుపరచబడిన అమృతాంజన్ మునపటికంటే అతి త్వరితంగా ఉపశమింపజేయగలదు !

## మేలుపరచబడిన
# అమృతాంజన్

మీ మోముపై చిరునగవులను శీఘ్రంగా తిరిగి వికసింపజేయగలదు!



Amrutanjan Limited

OBM 149 TG 9

# విశ్వచేతన

## రాయదుర్గం విజయలక్ష్మి

ఒంటరిగా నా గదిలో
ఊపిరాడని నిశ్శబ్ద తరంగాలు మోసితెచ్చే
మౌనరాగాలాపనకై
నిక్కించిన నా చెవుల్లో
మధుర గీతాల నూదిపోయే
ఓ కరుణ రసాధిదేవతా!
ఎవరు నువ్వు?

చుట్టూ క్రమ్మిన
చీకటి అలల్ని ఛేదించుకుంటూ
ప్రకృతి కుడ్యంపై
ఇంకా వ్రాయని చిత్రాన్ని
చూడాలని పరితపించే
నా కనుపాపల్లో
రమణీయంగా మెరిసిపోయే
ఓ కాంతిరేఖా! ఎవరు నువ్వు?

ఆనంద తరంగాలపై
అలవోకగా తేలివచ్చే
మానవతా సుగంధభరిత
భవిష్య జీవనాన్ని
ఊహల్లో పట్టుకోవాలని ప్రయత్నించే
నా మనస్సు పుటల్ని
చిత్రంగా అక్షరబద్ధంగాదించే
ఓ అదృశ్యలేఖినీ! ఎవరు నువ్వు?

అనురాగం కురిపించే
అక్షరాల అర్థాల్లోని
ఆనందాన్ని చవిచూశాను.
నీ అందెల రవళిలో
కంకణాల నిక్వణంలో
నీ మధుర నిశ్వాసంలో
కంటి కెలకుల దోబూచులాడే
రాగారుణచ్ఛాయలో
అధర మూలల నాక్రమించిన
మధురహాసపు స్నిగ్ధతలో
విశుద్ధబద్ధమైన నీ గళంలో ఉరకలేసే
సంగీతమయ నాదమేళనంలో
కన్నానొక సారూప్యాన్ని!
తెలుసుకున్నాను నీ రూపాన్ని!
గుర్తించగలిగాను నువ్వొక
విశ్వమానవ చైతన్యానివని!



కన్నడ మూలం :
శ్రీ అరవింద నాడకర్ణి

అనుసరణ :
శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

# జ్ఞానేతిహాస, తత్త్వ, మనస్తత్త్వ శాస్త్రములలో.... వామనుని త్రిపాదములు!

పురాణ పురుషుడైన వామనుని త్రిపాదముల మహిమ అందరికీ తెలిసినదే. కాని వామనుడు శాస్త్రరంగములో కూడా అడుగు పెట్టిన విషయం విస్మయం కల్గిస్తుంది. త్రిపాద మహిమను వివరించటమే యీ వ్యాస రచనోద్దేశం.

మానవుడు లోకజ్ఞానాన్ని మూడు దశలలో సంగ్రహించాడు.

## పురాణ యుగం :

ఈదశలో ప్రపంచ వ్యాపారాలన్నీ దైవ సంకల్పితాలు అన్న భావం ప్రబలంగా వుండేది. బిషప్ బోస్కోలాంటివారు ఇతిహాసాన్ని కూడా యిదేవిధంగా భావించారు. అంతర్‌దృష్టి, అవలోకనశక్తి మరియు అతీంద్రియ శక్తి మున్నగు విశిష్ట శక్తులద్వారా యోగులు, సిద్ధులు, ఋషులు తాము గ్రహించిన విషయాలను పురాణాల రూపంలో ప్రతీకాత్మక భాషలో నిరూపించారు. ప్రపంచమందలి ప్రప్రథమ సాహిత్యమంతా పురాణరూపంలో వుంది. ఆ సాహిత్య విస్తృతరూపమే రామాయణ, మహాభారతములవంటి కాల్పనిక మహాకావ్యాలు. ఈ కావ్యాలను వాచ్యార్థ ప్రధానంగా చూచిన ప్రమాదకరము. వాటిని ప్రతీకాత్మక స్థితిలోనే గ్రహించుట అవసరం. కేవలం చారిత్రాత్మక దృష్టితో చూడటం సముచితం కాదు. రామాయణ మహాభారతములలో చారిత్రాత్మక అంశము లున్నప్పటికీ అవి ఖచ్చితమైనవని నిర్ణయింపబడలేదు. కవి కల్పనమేరకు ఆంజనేయుడు ఆకాశంలో విహరించుట వాస్తవమేనా అని పరిశోధన ప్రారంభిస్తే, పరిశోధకుడు మర్కటంవలె చెట్టెక్కి కూర్చుంటాడు. ఈనాటి మానవశాస్త్రము పురాణప్రజ్ఞను విశ్లేషించి, కల్పనల నిజ స్వరూపాన్ని విశదం చేసింది. అసలు ఇదంతా పురాణయుగం. జ్ఞానమునకు ఆధారం అంతర్‌దృష్టి గల అవలోకనశక్తి మరియు అతీంద్రియశక్తి అని. ఇదు తార్కికశక్తిని అధిగమించినదని హెన్రీ బర్గ్‌సన్ అభిప్రాయం.

## తర్కయుగం :

రెండవ దశలో లోకజ్ఞానమును తార్కికదృష్టితో అవలోకించి సంగ్రహించుట జరిగింది. ప్రత్యక్షంగా గ్రహించినదానిని, సంగ్రహించి, విశ్లేషించి, విభజించి సూత్రబద్ధ మొనర్చి తెలుసుకోవటం. ఇచట మానవునికి అతని బుద్ధిశక్తి నిరీక్షణశక్తి ప్రధానమై తర్కశాస్త్రం రూపొందింది. తర్కమునకు నిలువకున్న దానిపట్ల సందేహం, తర్కబద్ధమైన దానిపట్ల నమ్మకం పెంచుకున్నాడు. ఇతిహాసయుగం నుండి మధ్యయుగం వరకు విస్తృతమైన యీ దశ తేజోవంతమైనది. పెక్కు శాస్త్రీలు తాత్త్విక సిద్ధాంతాలు యీ దశలో పెంపొందాయి. పాశ్చాత్యుల పురాణ, మధ్యయుగాల దశ క్రీ.శ. పదుకొండు, పదునైదవ శతాబ్దాల మధ్యకాలము. ఇది జ్ఞానయుగము, అందుకు ఆధారం తర్కశక్తి. ఈ యుగంలో మానవుడు దైవశక్తినుండి నైసర్గిక శక్తులపట్ల ఆకర్షితుడయ్యాడు.

## ఆధునిక విజ్ఞానయుగం

నిరంతర పరిశీలనమువల్ల కనుగొన్న విషయముల మూలకారణమును అన్వేషిస్తూ, దానిని సూత్రీకరించుటకు ప్రయోగాత్మక కృషి సాగించుటను తెలుసుకున్నాడు. ఆ సాధన విజ్ఞానశాస్త్ర

రూపంలో శాఖోపశాఖలుగ పెరిగింది. ప్రయోగబాహ్యమైనదేదీ సిద్ధాంతం కాలేదు. శాస్త్రవికాసంతో, ప్రయోగోపకరణాలు నవీకృత మైనాయి. సిద్ధాంతములో కొంత వదలివేయటం జరిగింది. -19వ శతాబ్దివరకు పాశ్చాత్యులలో శాస్త్రములో చెప్పబడినదే సత్యమన్న భావం ప్రబలంగా వుండేది. శాస్త్రీయ సత్యాల ఆధారంగా తత్వశాస్త్ర పందిరిని నిర్మించాలని ఫ్రెంచ్ తత్వవేత్త అగస్టెకామ్టే ఆందోళన ప్రారంభించాడు. ఆందోళన ఫ్రాన్స్‌లో ఉదయించినప్పటికీ విప్పారింది ఇంగ్లండులో. కాని యీనాడు శాస్త్రము సత్యసమీపమైనదేనని నిరూపింపబడినది. జైన తత్వవేత్తల స్యాద్‌వాదం స్ఫురణకు వస్తుంది. ఇది విజ్ఞానయుగం. ఆధారం, ప్రయోగం. ఈ విధంగా మూడు దశలలో వికసించిన మానవుని విజ్ఞాన ప్రపంచములో వామనుని త్రిపాదముల ముద్రలు స్పష్టముగా కానవస్తున్నాయి.

1) మొదటిదశ వస్తుకామాత్మకము మరియు బహు తాత్వీక సర్వచేతన వాదములకు సంబంధించినది. వస్తువు మరియు సస్య జీవులలో అగోచరశక్తి వాటికి తమవైన ఉద్దేశములున్నవని భావించిన కాలము. అప్పట్లో పర్వతపూజ, వృక్ష-పక్షిపూజ సామాన్యం.

2) రెండవదశలో అది మరింత సరళమై క్రమంగా కొన్ని నైసర్గిక శక్తులను మాత్రమే ఆరాధించే క్రమము. పర్జన్య, వాయువు, అగ్ని, సూర్య మున్నగువారల పూజ.

3) మూడవదశలో దైవీశక్తులన్నీ ఒకే పరమాత్మలో విలీనం. అతడే కర్త, లోకనియంత, లోకపాలకుడు పరమశక్తి,

ఈ వాదములను ప్రతిపాదించినవాడు ఫ్రెంచి తత్వవేత్త అగస్టేకామ్టే (1768-1857).

జ్ఞానోదయ క్షేత్రములో మరో విధమైన త్రిపాదములను జాన్‌లాక్ (1682-1704) అను తత్వవేత్త ప్రతిపాదించాడు. మన నైజ అస్తిత్వముయొక్క జ్ఞానమే మూడు విధాలుగ కానవస్తుందని అతని వాదము.

ఒకటి అంతర్‌దృష్టి యొక్క అవలోకన శక్తివల్ల వచ్చేది. దానిని ఇంట్యూటివ్ అంటాడు. మన అస్తిత్వానికి సంబంధించినది.

దేవునిపట్ల మన ఎరుక ప్రతిపాదకమైనది.

వస్తువుల గురించిన మన ఎరుక ఇంద్రియ గ్రాహ్యమైనది. దీనినే అతడు సెన్సిటివ్ అన్నాడు. ఈ విధంగా మూడు దశలలో విజ్ఞాన వికాసం కలుగుతుంది.

ఇమ్మాన్యుయల్ కెంట్ (1724-1804) అను జర్మన్ తత్వవేత్త తన క్రిటిక్ ఆఫ్ ప్యూర్ రీజన్‌లో సంవేదన లోకజ్ఞానముగ పరిణమించు మూడు దశలను గుర్తించాడు.

సంవేదనల అవ్యవస్థిత సమూహాల ఒత్తిడి మొదటిదశ.

రెండవదశలో యీ సంవేదనలకు ప్రవేశము వుండదు. గుర్తింపు వుండదు. వీక్షకుని ఉద్దేశం మేరకు కొన్ని నిర్దిష్ట సంవేదనలకు మాత్రమే ప్రవేశం వుంటుంది. మనస్సు స్థల, కాలపరిమితులలో యీ సంవేదనలను గ్రహిస్తుంది. అవ్యవస్థిత సంవేదనల ప్రత్యక్ష జ్ఞానం వుంటుంది. దీనిని ట్రాన్సెన్‌డెంటల్ ఈస్థెటిక్ అంటాడు కాంట్.

మూడవ దశలో యీ ప్రత్యక్ష జ్ఞానములు, వాటి కార్య కారణ సంబంధాలు ఐక్యత, పరస్పర సంబంధాల ఆవశ్యకత మున్నగు అంశాలన్నీ మరల సంయోజితమై వ్యవస్థితమైన కల్పిత భావముగ పరివర్తనం చెందుతాయి. ఈ దశనే ట్రాన్సెన్‌డెంటల్ లాజిక్ అంటారు. తర్వాత అవ్యవస్థిత సంవేదన క్రియాశీలమైన మనస్సు ద్వారా వ్యవస్థీకృతమైన కల్పితభావమై లోకజ్ఞానంగా మారుతుంది (వ్యవస్థితమైన లోకజ్ఞానమే విజ్ఞానము).

మానవుని సాంఘిక రాజకీయ చరిత్రలో కూడా వామనుడు అడుగు పెట్టాడు.

**సంస్కృతి :**

దీని చారిత్రక వికాసాన్ని గియోవిని వికో, మూడు దశలలో కనుగొన్నాడు.

అ) ఆదిమానవుని ఆలోచనలు హేతుబద్ధంగా వుండేవి కావు. భావనాబలమే ఆధారంగా క్రియాశీలుడు కావటం సంస్కృతియొక్క అవతరణకు పూర్వకాలము.

ఆ) రెండవ దశలో గతకాలంనాటి అనాగరకత్వం వున్నా దానితోపాటు ఆలోచనాదృష్టి వుండేది. సామాన్యులు అనాగరక దశలో వున్నప్పుడు హోమర్, డాంటే లాంటి మేధావులు జన్మించి హేతువాద నేపథ్యంలో సంస్కృతిని నెలకొల్పారు.

ఇ) మూడవ దశలో నాగరికతావిర్భావంతో కల్పిత భావ జ్ఞానము, మరియు ఆలోచనాసరళి తుదకు విజ్ఞానము న్యాయవిధానం, జాతీయత మున్నగు నాగరికతారూపాలను నిర్మించింది. పాశ్చాత్యులలో గ్రీక్, రోమన్ నాగరికతలు, ప్రాచ్యదేశీయులలో భారతీయ చైనా నాగరికతలు సంస్కరణ రహితములై శారీరక సంఖ్యా బలంతో పెరిగాయి.

**రాజకీయ శక్తి :**

రాజకీయ శక్తి కూడ మూడు దశలలో జరుగును. అనాగరకత నియంతను నిర్మిస్తుంది. వాడేమి చెప్పినా న్యాయమవుతుంది. శాసన మవుతుంది. ఇది శోషణకు మొదటి మెట్టు.

ఇందుకు ప్రతిక్రియగ విప్లవం మరియు ప్రజాప్రభుత్వం తల ఎత్తుతాయి. ప్రారంభకాలంలో యిది ప్రయోజనకరమే. కాని

క్రమంగా అసంఖ్యాకుల పోటీలమధ్య ఛిద్రమై వినాశకారి అవుతుంది. తుదకు అనాయకత్వం.

ఈ రీతిగ విలువల తరగిన ప్రజా ప్రభుత్వం మరలా ఆటవిక దశకు మళ్ళుతుంది, చివరకు అంతా అంధకారం. ఇది, గియోవిని వికో - సిద్ధాంతం.

ఫ్రెడ్రిక్ హెగెల్ అభిప్రాయం మేరకు మానవుని రాజకీయ ఇతిహాసం మూడు దశలలో పెరిగింది. అందుకు మూలకారణం స్వాతంత్ర్యాభిలాష.

మొదటిదశలో ప్రముఖ నాయకుడొక్కడే స్వతంత్రుడు. తక్కినవారు సేవకులు. ఇదే రాచరికము.

రెండవ దశలో కొందరే స్వతంత్రులు. అప్పుడు ఉన్నత వర్గాలకు చెందిన ధనవంతులు, ప్రతిభావంతులు స్వాతంత్ర్యాన్ని అనుభవిస్తారు. దీనిని ధనస్వామ్యం అంటారు.

మూడవ దశలో అందరూ స్వతంత్రులే. అదే ప్రజా ప్రభుత్వం. ఇదీ నేటి ప్రపంచస్థితి. దీనికి మూలమైన త్రిపాద సూత్ర మున్నది. దాని వివరణమిది.

కార్ల్‌మార్క్స్ (1818-1883) అభిప్రాయం మేరకు మానవుని చరిత్ర మూడు దశలలో వికసించింది. స్వాతంత్ర్యాపేక్ష లేకుండా, ఉత్పత్తి వినిమయములు, సంపదను పంచుకోవటం, ఉపయోగించుట, వర్గ వ్యత్యాసాలు మున్నగు ఆర్థిక స్థితులను అవలంబించినది అంటాడు. ఇదే నాగరికతకు మూలము. రాజకీయం, న్యాయం, కళలు మున్నగునవి. ఆ పునాదులపై లేచిన అంతస్తులు ఆ విధంగా మానవుని చరిత్ర మూడు యుగాలను దాటి వచ్చింది.

పురాతన యుగం :

ఈ దశలో మానవుడు ఆహారాన్వేషకుడు. కంటికి కనిపించిన మృగాల మాంసం, ఫలాలు మున్నగువాటి అన్వేషణలో మునిగిన వేటగాడు. అది ఆటవిక దశ.

కృషి యుగం :

రెండవ దశలో వ్యవసాయం ద్వారా వివిధములైన ఆహార పదార్థాలను ఉత్పత్తిచేసి జీవితమునకు క్రమమైన మార్గమును కనుగొన్నాడు. అప్పట్లో అతడు రైతు. నాగరకతపట్ల మొగ్గ చూపినవాడు.

యంత్ర యుగం :

యంత్రములద్వారా వస్తూత్పత్తిని సాధించి పారిశ్రామిక విప్లవ కారుడయ్యాడు ఆధునికుడు.

జ్ఞానరంగం, చరిత్రరంగం - రెండింటిలో వామనుని వికాసము విదితమయింది. తాత్విక రంగంలో యీ త్రిపాదములను చూడ వచ్చును.

హెగెల్ సూత్రం :

జర్మన్ తత్వవేత్త ఫ్రెడ్రిక్ హెగెల్ (1770-1831) మేరకు ఆయా కాలంలోని వస్తుస్థితిలో దానికి విరుద్ధమైన అంశములు వాటిలోనే జన్మించి సంఘర్షణవల్ల నూతన వస్తుస్థితికి కారణమవుతాయి. ఈ నూతన స్థితికి కూడా అదేవిధంగా సంఘర్షణ కలిగి మరో వినూత్నస్థితి ఏర్పడుతుంది. సంఘర్షణాత్మకమైన యిట్టి వికాసాన్ని థీసిస్, ఆంటీథీసిస్, సింథెసిస్ అన్న త్రిపాద సూత్రాలలో చెప్పినాడు. ఇక్కడ అంటీథీసిస్ అన్నది ప్రత్యేక వస్తుస్థితి కాక మూడవదైన సింథెసిస్‌కు దారి చూపుతుంది. ఉదాహరణంగా పెట్టుబడిదారీ విధానంతో, సామ్యవాదశక్తి ఢీకొని, జాతీయ సామ్యవాదం (స్టేట్ సోషలిజమ్)గా మారగలదే కాని సామ్యవాదం కానేరదు.

ప్రజ్ఞా క్రాంతి :

జర్మన్ తత్వవేత్త షోపన్ హోవర్ (1788-1860) తన జగత్ సంకల్పశక్తి మేరకు జీవసృష్టిలోనే ప్రజ్ఞయొక్క మూడు దశలను కనుగొన్నాడు.

సస్యజాతిలో జాగృతప్రజ్ఞ కనిష్ఠ స్థాయిలో వుంటుంది. మొక్క నేలలోని నీటిని, క్షారమును పీల్చుకుని పూవులు ఫలాలుగా మార్చివేస్తుంది. వేళ్ళు, కాండము, కొమ్మలుగా వ్యాపిస్తుంది. ఈ దశలో ప్రజ్ఞ క్రియాశీలంగా వుంటుంది. మాంసాహారులైన వృక్షములు కూడా వున్నాయి అనుటను గుర్తించాలి. ఈ స్థితిలో చలన వలనము లుండవు.

పశుస్థితిలో ప్రజ్ఞసుప్తావస్థనుండి మేల్కొని చలన, వలనములను నియంత్రించు శక్తిని కలిగి వుంటుంది.

మానవునిలో ప్రజ్ఞసుప్తావస్థనుండి బాగా ఎదిగింది. ధీశక్తి పెరుగుతుంది. జీవసంకల్పశక్తి గుప్తంగానైనా శక్తివంతమై క్రియాశీలంగా వుంటుంది. మనస్తత్వశాస్త్రం దీనిని స్పష్టం చేస్తుంది.

పాశ్చాత్య తత్వశాస్త్రము మూడు దశలలో వికసించిందని విశ్వవిఖ్యాత తత్వవేత్త బెర్‌ట్రండ్ రసెల్ అభిప్రాయం.

అ) అధ్యాత్మ శాస్త్రానికి భిన్నంగా వున్న తత్త్వశాస్త్రం క్రీ.పూ. 6వ శతాబ్దిలోనే గ్రీస్‌లో అవతరించింది. ఈ దశలో గ్రీకుల ఆలోచన నగర రాష్ట్ర నిష్ఠము, వ్యక్తి స్వాతంత్ర్యము మున్నగువాటి ననుసరించింది. అరిస్టాటిల్ కాలంపరకు గ్రీక్ ప్రజలకు రాష్ట్ర నిష్ఠయే ధార్మిక ప్రజ్ఞగా వుండినది. నైతిక విచారాలు అందు కను

గుణంగా వుండేవి. వ్యక్తి స్వాతంత్ర్యం కుంచింపబడింది. అలెగ్జాండర్ కాలంలో రాష్ట్ర నిష్ఠరాజుల బలం ఆధారంగా ఏర్పడింది. హేతువాదంపై కాదు. సాంఘిక సంబంధాలు దుర్బలమై నైతికత-జీవుడు దేవుడు-వీరిపట్ల మళ్ళింది. ఇదే క్రైస్తవ ధర్మావిర్భావానికి మూలమైంది. ఈ యుగం రోమ్ సామ్రాజ్య పతనం వరకు సాగింది.

రెండవ యుగం 11వ శతాబ్దినుండి 14వ శతాబ్దం వరకు. అప్పట్లో కేథలిక్ లేదా పోప్‌గారి తత్వ వివేచనమే ప్రముఖంగా వుండినది. దీనిని పాండిత్యయుగం అన్నారు. ఆ కాలం ధోరణులు యిలా సాగాయి. 1) సంప్రదాయ బద్ధత 2) అరిస్టాటిల్ సిద్ధాంతాల పట్ల గౌరవం ప్లేటో నిరసన 3) తర్కములో నమ్మకము 4) విశ్వవ్యాప్తమైన అంశాల మన్నన. సెంట్‌థామస్, ఎక్వినాస్‌గార్లు ప్రఖ్యాతి గాంచారు. 17వ శతాబ్దంనుండి నేటివరకు వైజ్ఞానిక సత్యాలనే అవలంబించారు. డెకార్టి ఆధునిక తత్వయుగ పితామహుడనిపించుకొన్నాడు. కోపర్నికస్, గెలీలియో, కెప్లర్, న్యూటన్ విజ్ఞానయుగ జనకులనిపించుకొన్నారు. ఆ తర్వాత, స్పినోజా, లాక్, బర్క్లే, హ్యూమ్, కాంట్, హెగెల్ షోపన్‌హేర్, నీట్జే, బర్గ్‌సన్, డ్యూమి, రసెల్ మున్నగువారు ఆధునిక తాత్త్విక విచారాలను విస్తృతంగా ప్రచారం చేశారు. చర్చికంటె - సెక్యులర్ - జాతీయ దృష్టికి ఎక్కువ ప్రాధాన్యం లభించింది.

భారతీయ తత్వశాస్త్రంలో కూడా ఈ త్రిపాద మహిమ కానవస్తుంది.

మొదటి దశ :

వేదోపనిషత్తులు పురాణాలు, మహాకావ్యాల కాలము క్రీ.పూ. 1500 నుండి క్రీ.శ. 200 వరకు ఈ యుగములో తాత్విక చింతన బీజరూపంలో వేదాలలోను, సంవాద రూపంలో ఉపనిషత్తులలోను, ప్రతీకాత్మక రూపంలో పురాణాలలోను, మహాకావ్యాలలోను ప్రకటితమయింది. ఈ దశలో అతీంద్రియశక్తి అంతర్‌దృష్టి. అవలోకనాశక్తి మున్నగునవి ప్రముఖ జ్ఞానోపకరణము లయినవి. మహాకావ్యాలలో కల్పనాశక్తి విస్తృతమయింది. బహుదేవతారాధనతో ప్రారంభమైన యీ ఆదియుగము ఏకదేవతోపాసనకు దారితీసింది. ధర్మశాస్త్రాలు, బౌద్ధ, జైన చార్వాక మతాలు వెలిశాయి. వైదిక తత్వాల పుట్టుక, ప్రచారము వివిధరీతులలో సాగిందీ కాలంలోనే. దీనిని ఆదియుగం అనవచ్చు.

రెండవ దశ :

దీనిని సూత్రకాల మనవచ్చు. దర్శనముల కాలము. ఈ దశలో జిజ్ఞాస, ప్రత్యక్ష తార్కిక దశలలో పెరిగింది. షడ్దర్శనములు ప్రకటింపబడినాయి. ఒక్కొక్క దర్శనానికి తనదే అయిన తాత్విక పదార్థాలున్నాయి. సమీక్షక, విశ్లేషణదృష్టి - క్రియాశీలకత్వం పెరిగింది. సాంఖ్య, వైశేషిక, మీమాంసకములలో దైవత్వమునకు ప్రాధాన్యత లేదు. అయినప్పటికి వేదముల ప్రామాణికత్వమును కించపరపకున్నందున వీటిని ఆస్తిక దర్శనము లన్నారు. గౌతమ కణాద, కపిల, పతంజలి, జైమిని, బాదరాయణులు సంస్థాపకులైనారు. తాత్విక ప్రవచనకారులైనారు. పాశ్చాత్యుల దృక్పథములో.

మూడవదశ :

క్రీ॥శ॥ 700 నుండి 1300 వరకు వేదోపనిషత్తులు, దర్శనములు. బ్రహ్మసూత్రములు మున్నగువాటిపై భాష్యాలు వ్రాశారు. క్రొత్త మార్గాలన్వేషించారు. వారే శంకర రామానుజ, మధ్వాచార్యులు. ఇక్కడ కూడా త్రిపాదములను చూడవచ్చును. ఈ త్రిమతాచార్యుల ఆధ్యాత్మిక సాధన, అసామాన్య తార్కికశక్తి, అతీంద్రియ ద్రష్టారశక్తి, యీ మార్గాల యశస్సుకు మూలకందాలు. అద్వైత విశిష్టాద్వైత ద్వైతములు మూడింటికి ప్రమాణము లొక్కటే. కుమారిల, శ్రీధర, వాచస్పతి, భాస్కర, ఉదయన, మున్నగు భావుకులీ కాలంలోనే ఉదయించారు.

భారతీయ తత్వశాస్త్రములోని ప్రమాణాలు త్రిపాదము ననుసరించాయి.

ప్రత్యక్ష :

ఇంద్రియానుభూతితో ప్రారంభమైనా క్రమంగా అతీంద్రియ గ్రహణానికి కూడా అన్వయింపబడింది. యోగదృష్టియందు మిళితమయింది.

అనుమాన :

ఇది అనుమానిక లేదా పీఠికా ప్రధానమైన తర్క విధానానికి సంబంధించినది.

శబ్ద :

పై రెండూ నిష్ప్రయోజకములైనపుడు యిది అన్వయింపబడును. ఇది అధికారవాణి. శ్రుతిప్రమాణము. దైవత్వ విషయము ప్రత్యక్ష తర్కమునకు అతీతము.

జైన సిద్ధాంతాలలో కూడా వామనుడు కనిపిస్తాడు. త్రిరత్న సిద్ధాంతము అందుకు ఉదాహరణం. కర్మ సంబంధిత పదార్థములచే కళంకితమైన ఆత్మయొక్క నిర్వాణమునకు మూడు మార్గము లున్నాయి. 1) ఉచితనిష్ఠ 2) ఉచిత వర్తనము 3) ఉచిత జ్ఞానము. జైన ఆస్తిత్వములో నమ్మకము. జైనస్థితిని గురించి సందేహం లేని జ్ఞానము, పంచశీల పాలనము, సముచిత వర్తనము.

సాంఖ్య సిద్ధాంతములో కూడా వామనుని త్రిపాదాలను గుర్తింపవచ్చును. ప్రకృతి పురుష తత్వముల సంయోగమువల్ల నైసర్గిక ఉత్క్రాంతి. దానిలోని క్రియాశీలకమైన మూడు తత్వములే సత్వరజస్, తమోగుణములు. వీటిద్వారా సృష్టి స్థితి, లయములు ఏర్పడినాయి. ఈ మూడింటికీ బ్రహ్మ, విష్ణు మహేశ్వరులను మూడు దైవీశక్తుల కల్పన వున్నది. మూల ప్రకృతి వివిధ రూపాలలో అవతరించి, కొంతకాలం కొన్ని రూపాలలో వుండి, క్రమంగా లయమై మూల ప్రకృతికే మరలును. ఇతిహాసము - జ్ఞానశాస్త్రము, తర్క-శాస్త్రములలో వున్నట్లు మన స్తత్వ శాస్త్రములో కూడా త్రిపాదలీల కానవస్తుంది.

ఫ్రాయిడ్ వాదం మేరకు[1]: జాగృతప్రజ్ఞ ఈ స్థాయిలో వర్తమానమును గురించిన ఎరుక ముఖ్యము. 2) జాగృతపూర్వప్రజ్ఞ: ఇది అజాగృతము యొక్క భాగమైనప్పటికి సులభంగా మేల్కొలుప వచ్చును. 3) సుప్తప్రజ్ఞ, భావనలను బలవంతంగా అణచిపెట్టి, తలచుకొనుట అసాధ్యము.

కార్ల్‌యంగ్ అభిప్రాయం ప్రకారం సుప్తప్రజ్ఞకు కూడా మూడు దశలున్నవి. 1) వైయక్తిక సుప్తప్రజ్ఞ నొక్కివేయబడిన లేదా అణచివేయబడిన వ్యక్తిగతానుభవాల సముదాయం.

2) సామూహిక సుప్తప్రజ్ఞ: ఒక జాతికి సంబంధించిన విశ్వాసాలు, పురాణాల సంగ్రహము.

3) విశ్వజనీనమైన సుప్తప్రజ్ఞ మానవజాతి కంతటికీ సంబంధించిన అనుభవాల సంగ్రహము. అంతకుముందు దశలోని పాశవిక దశలోని అనుభవాల శకలాలు వుంటాయి. ఇవన్నీ అపుడపుడు శక్తివంతమై క్రియాశీలము లగునని యంగ్ వాదము ఈనాటి సామూహిక జీవనము మరింత సంఘటితమగుటలో యీ సామూహిక సుప్తప్రజ్ఞ ఏ విధంగా క్రియాత్మక మగుచున్నదో మనం గమనింప వచ్చు. ఒక్కొక్కరే చేయజాలని పనులను సామూహికంగా చేయుటను చూస్తున్నాము. అల్లరులు తత్పరిణామంగా జరిగే హింసాత్మక చర్యలు యిందుకు ఉదాహరణములు.

ఈ విధముగా జ్ఞానేతిహాస, తాత్విక, మనస్తత్వ శాస్త్ర రంగాలలో వామనుని లీలలను గమనించాము.

'వేదాత్మనాయ విద్మహే, హిరణ్యగర్భాయ ధీమహి - తన్నో బ్రహ్మ ప్రచోదయాత్' — తైత్తరీయ ఆరణ్యకము.

# తను వేణువు

## శ్రీ జి. వి. సుబ్బారావు

ఈ తనువు
నీ మృదు మధుర వేణువు!
ఈ మనసు
నీ నీలి క్రొంబెదవి సొగసు!!
ఈ ప్రాణం
నీ ముగ్ధ మనోహర మురళీరవం!!!
పిల్లనగ్రోవి బెజ్జంలా
ఉల్లంలో, గళస్థానంలో
మెల్ల మెల్లగా, మంద్రస్థాయిలో
ఊదుతావు నీవు!
స్తబ్దమై పలకదు ఈ క్రోవి!
నిశ్శబ్దమై వినిపింపదు నీ మురళి సరళి!

ప్రాక్తనజన్మ పుణ్య పరిపాకం పండి
ఈ పంచేంద్రియాలల్లో
ధ్వనించే ఆత్మనాదం-
నీ మురళీ మనోజ్ఞ నినాదం!
నీరవమైన, బాధానతమైన
విషయ పరంపరాగతమైన
ఈ శరీర వంశీనాళంలో-
శ్రీరమణీ రమణీయ గానం,
ముక్తిమాధుర్య నిత్య సంగీతం,
వి-ని-పి-స్తా-వా?
ఈ తనువే
నీ వేణువైతే?!-

# మోక్షం!

## డా॥ గుమ్మనూరు రమేష్‌బాబు

తన నగం ప్రాణాన్ని
తన ప్రతిరూపాన్ని
ఎలా వదలిపెట్టి
వెళ్ళగలిగాడో గౌతముడు!
అడవిలో
అమావాస్యలో సయితం
వెన్నెల్లు పూయించిన ధరణి జాతను
ఎలా వెళ్ళగొట్టగలిగాడో రామచంద్రుడు!
కాలు నేలమీద మోపని
అసూర్యంపశ్య
అర్ధాంగి చంద్రమతిని
ఎలా అమ్మగలిగాడో హరిశ్చంద్రుడు!
ఆత్మనొదలి
దేహం ఉంటుందా?
ఉన్నా అది దగ్ధం కాకుంటుందా?
గాలి లేక
దీపం వెలుగుతుందా?
వెలిగినా చీకటేతప్ప వెలుతురు పండుతుందా?
భార్యను విడచి
ఒక్క క్షణంకూడ ఉండని
మమతానురాగం శాక్యునిది!
సీత కాలిలో
ముల్లు గ్రుచ్చుకొంటే
రక్తం కార్చే గుండె రామునిది!
ఇల్లాలి కంటతడి
రవ్వంతైనా చూడలేని జాలి మనసు
ఆ మహా చక్రవర్తిది!
అది మోహబంధం కాదు
పవిత్రమైన అనుబంధం!
అది ఆలుమగల సంబంధం మాత్రమే కాదు
ఆత్మ పరమాత్మ సంబంధం!
అయినా కాదనుకొన్నా రే!
అగ్ని నిండుకొన్నా నిగ్రహించుకొన్నా రే!
సుడిగాలులు
ఎదలో రేగుతున్నా
గడప దాటాడు
శుద్ధోధనుని పుత్రుడు!
పిడుగురాలు
గుండెను చీల్చుతున్నా
లక్ష్మణుని ఆజ్ఞాపించినాడు
అయోధ్యా పురాధీశుడు!
పిడిబాకులు
పదే పదే గ్రుచ్చుతున్నా
ఆలిని విక్రయించాడు
సత్యలక్ష్మీ ప్రియుడు!
వారి బాధ అనంతం....
వారి మనోవ్యథ అందనంత దూరం!
ఆ గుండెకోత ఎవరికి తెలుసు....
ఆ రాచపుండు ఎలా తొలుస్తోందో ఎవరు చూచారు?
అయినప్పటికీ
ఆత్మ క్షోభ నణగద్రొక్కి
మానవజాతి కోసం
మనిషి జన్మ సాఫల్యం కోసం
త్యాగం చేసారొకరు!
సాంఘిక నియమం కోసం
ప్రజాదర్శ రాజధర్మం కోసం
త్యాగం చేసారొకరు!
ఆడి తప్పని మాట కోసం
నమ్ముకొన్న సత్యం కోసం
త్యాగం చేసారొకరు!
సర్వసుఖాలు త్యజించిన
వారికా త్యాగమే మోక్షమైంది!
ఆ మోక్షంలోనే
పోగొట్టుకొన్నవన్నీ వారిని దర్శించాయి!

శ్రీ ఆపంచ సత్యనారాయణ

# [1] నవయోగామనస్క సంహిత

చతుర్విధ పురుషార్థాలలోనూ మొదటిదైన ధర్మం ఆచరిస్తూ, అర్థకామాల లబ్ధి పొందుతూ; మోక్షానికి కృషి చేయాలనేది భారతీయ సంస్కృతి చేసే నిర్దేశం. మోక్షసాధనకు అనేక మార్గాలున్నా భక్తి జ్ఞానాలకే పరమోత్కృష్ట స్థానం యివ్వబడింది. జ్ఞానప్రాముఖ్యాన్ని తెలిపే అద్వైత తత్త్వాన్ని గురించి ఎన్నో గ్రంథాలు తెలుగులో వెలువడ్డాయి.[2] ఈ గ్రంథాలన్నింటినీ ముప్పైరకాలుగా వర్గీకరించి, పరిశీలించవచ్చునని విజ్ఞుల భావన. క్రీ॥శ॥ 16వ శతాబ్దం ఉత్తరార్థంలోనూ, 17, 18 శతాబ్దులలోనూ తెలుగులో వేదాంత వాఙ్మయం విస్తారంగా వెలువడింది. ఆ కాలపు సాంఘిక చరిత్రను పరిశీలిస్తే, తెలుగు దేశంలో వచ్చిన రాజకీయ, ఆర్థిక, సాంఘిక, మత పరిణామాలే ఇలాంటి సారస్వత వికాసానికి కారణభూతమైనాయనటంలో సందేహం లేదు.

తెలుగులో వెలువడిన అద్వైత వేదాంత వాఙ్మయశాఖ వేదాంత వాఙ్మయంలో విస్తారమైంది. ఉపనిషద్వాఙ్మయం, ఆధ్యాత్మ రామాయణాలు, యోగవాసిష్ఠము, భగవద్గీతలు, శ్రీరామగీతలు, శివ గీతలు, ఆత్మ రామాయణాలు, సీతారామాంజనేయ రామాయణాలు మొదలైనవి యీ శాఖలోకే చేరుతాయి. ఈ గ్రంథాలలో వివరింపబడిన యోగ విషయాలలో ఆమనస్కయోగం ఒకటి. తెలుగు వేదాంత వాఙ్మయ గ్రంథాలలో సీతారామాంజనేయ సంవాదము, శ్రీరామ స్తవరాజం మొదలైన గ్రంథాలలో ఆమనస్క యోగం వివరింపబడి ఉన్నా; ఈ యోగాన్ని గురించి ప్రత్యేకంగా వివరించే గ్రంథాలు ఉన్నట్లు యిటీవలివఱకు ఆధారాలు లేవు.

షుమారు పదిహేను సంవత్సరాల క్రిందట నేనొక తాళపత్ర గ్రంథాన్ని సేకరించాను. ఆ తాళపత్ర గ్రంథ సంచయంలో— తఱిగొండ వెంగమ్మ "రాజయోగసారం", బండ్లపాటి కొండయ్య "కవిదత్త యోగీంద్ర శతకం", "సిద్ధరామ శతకం" (కవి పేరు కానరాదు, అసంపూర్ణము). మహాసాంఖ్య ప్రకరణం అనే గ్రంథం కూడ కలిసి ఉన్నది. ఈ 'మహాసాంఖ్య ప్రకరణం' అనే గ్రంథాన్ని గురించిన వివరాలను జిజ్ఞాసువులయిన పాఠకుల ఉపయోగం కోసం తెలియజేస్తున్నాను.

ప్రతి వివరాలు

ఈ మహాసాంఖ్య ప్రకరణానికి, సిద్ధ రామ శతకానికి ప్రతులను వ్రాసి ఉంచాను. ఆ ప్రతి ఆధారంగా మహాసాంఖ్య ప్రకరణాన్ని గురించిన వివరాలు యిక్కడ ఇస్తున్నాను. తాళపత్ర ప్రతి పొడవు 40.5 సెం॥మీ; వెడల్పు 3 సెం॥మీ. ఉన్నది. ప్రతి ఆకుకూ రెండువైపులా ఆరేసి పంక్తులలో ఈ గ్రంథం వ్రాయబడి ఉన్నది. మొట్టమొదటి ఆకుకు రెండవవైపున ఎడమప్రక్కగా, "శ్రీ-శుభమస్తు-శ్రీగణాధిపతయే నమః" అని వ్రాసిఉండి, తరువాత "శ్రీమద్దివ్య మునీంద్ర చిత్త......"అనే శ్లోకం, శ్రీ అహోబల గిరీశాయ నిత్యాయ నిగమాత్మనే" అనే శ్లోకాలు—

"శ్రీ ( ) నవీల ప్రాణుల సృజింప్పదలంచ్చి విధాత తానయై
చాలినవారి ప్రోంచునెడ శ్రీవిభుడై యది సంహ్వారింప్ప ( )
( ) తదాల్చి ముప్వురకు నవ్వల నొక్కడయై వెలంగ్గు
సంశ్లోకు 'బురాణ పుంఖ్యు పురుష పరమాత్ముని భక్తి గొల్చెదన్"

అనే పద్యం.

[3]"శ్రీ యన విష్ణుపేరురము చెంన్ను వహింప్ప నలంక్కరించ్చి దా
క్షాయణిం నాగ శంభుమయి సామున నెక్కొని వాణినాన నా
తోయజగర్భు నెంమ్మొగము దూకొని యెడు నాదిశక్తి సు
శ్రీయు జిరాయువున్ సరసశిద్ధ కవిత్వము మాకు నీవుతన్.
।క। గారణ ముఖుమ్మృదు మోదక...............

అనే పద్యాలు వ్రాయబడి ఉన్నాయి. దీనికి కొనసాగింపు ఎక్కడ ఉన్నదో కనిపించలేదు.

ఈ గ్రంథం ఉన్న తాళపత్ర ప్రతి చాలా శిథిలం అయింది. అనేకచోట్ల ప్రతి ఆకు క్రిమిదష్టమైంది. మొత్తం ఇందులో 40 ఆకులు ఉన్నాయి. 15 ఆకులలో ప్రథమాశ్వాసం; 28 ఆకు వరకు ద్వితీయాశ్వాసం వ్రాయబడ్డాయి. తొమ్మిదవ ఆకుమధ్యకు విఱిగింది. విఱిగిన సగభాగం లభ్యం కావటంలేదు. వ్రాయసగాని వ్రాత బాగానే ఉన్నది. కాని, 'వా', 'నా' మొదలైన అక్షరాల తేడా అంతగా తెలియటంలేదు. ప్రాచీన వ్రాత విధానాలైన పూర్ణబిందువు తరువాతి

అక్షరం ద్విత్వంగా వ్రాయటం, "గభ్క", "దభ్క" వంటి వలపల గిలక, 'నుంన్న' వంటి ప్రాచీన వ్రాతవిధానం పాటించబడి ఉన్నది.

**కృతి విశేషాలు**

గ్రంథ నామం; ఆశ్వాసాంత గద్యలలో

"శ్రీరామమూర్తియౌ శ్రీహరి గురుని
సారసత్కృపతోడ సత్యమౌ ప్రజ్ఞ
చందంబునను మహాసాంఖ్య ప్రకరణ
మందమై విరచించె నందు లోపలను
నవహిత యోగామనస్కంబున నంగ
నవిరళంబగు ప్రథమాశ్వాస మిదియు"

అని చెప్పటచే ఈ గ్రంథము పేరు 'మహాసాంఖ్య ప్రకరణ' మనియు; ఇందు మొదటి ఆశ్వాసము 'నవహిత యోగమనస్క' మనియు; ద్వితీయాశ్వాసము 'నవమతి సాంఖ్యామనస్కంబు'; తృతీయాశ్వాసము 'తారకామనస్కంబు' అని తెలియుచున్నది. 'సర్వము తృతీయాశ్వాస మిదియు' అనుటచే, ఇది మూడాశ్వాసముల గ్రంథమని తెలియుచున్నది.

| | | |
|---|---|---|
| యోగామనస్కము | : 526 + 19 ద్విపదలు | (19 ఆశ్వాసాంతము) |
| సాంఖ్యామనస్కము | : 436 + 20 ద్విపదలు | ( ,, ,, ) |
| తారకా మనస్కము | : 414 + 19 ద్విపదలు | ( ,, ,, ) |

మొత్తం 1376 + 58 ద్విపదల పరిమాణము గల గ్రంథమిది.

"శ్రీరమ్యమగుగున్న సేనాని కన్న
వారణ ముఖమున్న వరముద్దులన్న
ధీరత బుధులెన్న దీవించుచున్న
గౌరీవిభుడు గన్న ఘనులలో మిన్న"

అను గణేశ స్తుతితో ప్రారంభమై విష్ణుస్తుతి, అందులో భాగముగా అహోబల నారసింహుని స్తుతి చేయబడింది. అహోబల నారసింహుని స్తుతి చేయుచూ, నా పాలి యిలవేల్పు నతజన కల్పు' అని చెప్పబడుటచే కవి అహోబల నారసింహస్వామి ప్రియభక్తుడని తెలియుచున్నది. తరువాత లక్ష్మి, శివ, పార్వతీ, బ్రహ్మ-సరస్వతులు 53 ద్విపదలలో స్తుతింపబడ్డారు. తరువాత గురుస్తుతి, గురు మాహాత్మ్య వర్ణనము చేయబడింది. అటు తరువాత—

"సరసమౌ శ్రీగురు సాంప్రదాయకము
కరమర్థి వినుపింతు కల్యాణకరము"

అని గురు సాంప్రదాయ వర్ణన 45 ద్విపదలలో చేయబడింది.

కవిగురు సాంప్రదాయం యిది :

విశ్వేశ్వరుడు
|
బ్రహ్మ
|
నారదుడు
|
కౌండిన్యుడు

(విశ్వేశ్వరుడు నుండి కౌండిన్యుడు వరకు: దివ్యగురు క్రమము)

|
(ఇచ్చట చాలా తరములు గడిచియుండవలెను. కవి ఆ సంగతి చెప్పలేదు)
|
పట్టిన కేశవ పరమ సద్గురుడు
|
చాలమంది శిష్యులు — బుచ్చన్న అయ్యగారన్న
|
బాలన్న
(యోగవిద్యలను సాధించి, కుండలిని శోధించి, యితడే భగవంతుడని ఖ్యాతి బొందినవాడు.)
|
అయ్యగురుడు
(ఇతడు తుంగభద్ర కోవెల పుణ్యసరసి సిద్ధాశ్రమమునందు తత్త్వ ప్రసంగ గతి చెందు లకళంక బోధాత్ముడు)
|
శ్రీహరి గురుడు
(అయ్యగురుని అనూజాతుడు. తద్దయ శిష్య వర్యుడు. కవికి గురువు.)

అయ్యగురుడు పెసరవాయి పురవాసుడు. కౌండిన్య గోత్రుడు. ఆపస్తంబ సూత్రుడు. పులివల్లం కొండ్రాజువంశ శీతకరుడు. కవికి శ్రీహరి గురుడే యోగగురువు. అందుచేతనే గురుపరంపరలో ఒకమారు తిరిగి గురుస్తుతిలో ఒకమారు—

"శ్రీమన్మహాకారు శ్రితజనాధారు
కామలోభ విదారు కనకాద్రిధీరు"

అని పన్నెండు ద్విపదలలో (1-123-135) గురుస్తుతి చేసెను. ప్రతిలో తరువాత కొంత శిథిలమగుటచే...........వర్ణనము. అని శీర్షిక కనిపించుచున్నది. ఈ వర్ణనలో దేహమునే పట్టణముగా వర్ణించిన వర్ణన చక్కగా గలదు. ఇది యోగమున సాధారణమైన విషయమే. ఇందే —

'అమలమౌ (నా) త్మకరా రామపురి వెలయు' అని చెప్పబడుటచే ఈ వర్ణన 'ఆత్మకర-ఆ రామపురి'ని గురించి అని చెప్ప

వచ్చును. ఇది 'ఆత్మకూరు' కావచ్చును. ఈ పట్టణము పినాకిని ఒడ్డున కలదని తెలిపెను. పైగా

"యొనరికె తోడ సర్వోత్కృష్టకేశి
దక్షిణ కాశియై దగన ప్రమేయ"

అని చెప్పబడుటచే పినాకిని ఒడ్డున 'దక్షిణకాశి' అని పేరు పొందిన 'ఆత్మకూరు' అను గ్రామమేదో వెదుకవలెను. అచట కవికి శ్రీహరి గురుడు, "ప్రన్నన సోమోపరాగ సమయమున - నన్ను దోడ్కొనిపోయిన య కృపాస్ఫూర్తి.........పన్నుగా విజ్ఞాన పథమును జూపి'నాడు. అనగా యోగవిద్య నుపదేశము చేసెను. తరువాత అయ్యగురుని శిష్యులలో ఒకడైన పోకల భాస్కరుడు తన నాదేశించుటచేత సాంఖ్యమును రచింపుమని శ్రీహరి గురుడు ఆజ్ఞ నిడుటచేత తానీ గ్రంథాన్ని రచించినట్లు కవి తెలుపుకొన్నాడు (1-190-205). ఆటు తరువాత దాదాపు మూడు వందలకు పైగా ద్విపదలలో (1-220-526) రాజయోగాన్ని గురించిన విషయాలను విస్తారంగా వర్ణించాడు.

**కవి వివరములు :**

సన్నుత పూర్వవాసనల నార్వేల
వంశా ( )జ్జుడై వల నొప్పదేవ
తాంశ గౌతమ సగోత్రజుడునై నెగడి
గురుతర ( ) ర్తచే కొమరొప్పుచున్న
విరివగు నూగూరు వెంకట రమణు
గరుడ మంత్రీశ్వరు (కా)ంత్త సుకాంత్త
భూకాంత్త శ్రీకాంత్త పురహ(రు)కాంత్త
ప్రాకట గుణముల పద్ధతి మించు
నట్టి కీర్తి విశాల ధృతి ( ) ల
పట్టగు శుభలీల పరగు సుశీల
నైనట్టి నారాయణాంబ సత్పుత్రు
నైన వెంకట నర్సనార్య సోదరుడు
నైన వేదాచలామాత్యున కనుజు
డైన - టంప్ప(య)ను రామాఖ్య చెన్నలరి
ప్రా(కృత)పౌ జన్మ భారంబు తనదు
యాకృతి (ద)ర్శన (మందు)న గాంచి
యవిరళ మం ( ) పిండంబుగా జేసి
(వ్యా)న యత్రి వి(ధంబు) సాంద్ర మార్గమున
నతి విశదంబుగా నష్టాంగయోగ
గతు(డ)ను మహిత — మారదెల్పి"

అని చెప్పబడిన విషయమునుబట్టి కవి పేరు నూగూరు రామకవి. ఇతనికి వెంకటప్ప అని పేరు కూడా కలదు. ఆర్వేల నియోగి బ్రాహ్మణుడనియు తెలియుచున్నది. బహుశః రామప్ప లేక వెంకటప్ప అనునది ఇతని ఉపనామము. ఈతని తాత నూగూరు వేంకట రమణుడు. తండ్రి గరుడ మంత్రి. తల్లి నారాయణాంబ. ఈతనిది గౌతమ సగోత్రము. ఈ కవికి వేంకట నర్సయ్య, వేదాచలమయ్య అనే యిద్దరు అన్నలు ఉన్నారు. ఇతనికి యోగదీక్షా గురువు శ్రీహరి గురువు. ఈతని నివాసము పినాకినీ తీరమునందలి ఆత్మకూరు గ్రామము. ఇది ప్రస్తుతము నెల్లూరి మండలము నందలి ఆత్మకూరు అయిఉండవచ్చునని ఊహించబడుచున్నది. ఇంకను లోతైన పరిశీలన అవసరము. ఇట్టి పరిశీలనకు గ్రంథము కొంత శిథిలమగుటచే అవకాశం కలగటంలేదు. కవి కాలాన్ని గురించి తెలుసుకోడానికి ఎలాంటి ఆధారాలు దొరకటంలేదు. తాళపత్ర ప్రతిస్థితినిబట్టి బహుశ! ఇది 17, 18 శతాబ్దాలకు చెందిఉండవచ్చని ఊహించే అవకాశం ఉంది.

**గ్రంథస్థ విషయం :**

ప్రథమాశ్వాసంలో ఇష్టదేవతా స్తుతి, గురు మహిమ గురు సాంప్రదాయ వర్ణన, యోగగురువైన శ్రీహరి గురుని స్తుతి, ఆత్మకూరు పట్టణ వర్ణన, యోగోపదేశం, కవి వంశవర్ణన, గ్రంథరచనా ప్రారంభం-కథాసూత్ర వివరణ, రాజయోగ పద్ధతి, మంత్రయోగ విధానము అనగా జపము నభ్యసించు విధానము, లయ యోగ బోధన, హఠ యోగ సాధన, జీవాత్మైకవిధి అనబడే సమాధిస్థితిని సాధించుట, స్థూలంగ అష్టయోగాలను సాధించినవానికి కలుగు సిద్ధుల వర్ణన, ఆశ్వాసాంతము, ఫలశ్రుతి అనే విషయాలు వివరింపబడ్డాయి." అని మంత్రలయ హఠలను యోగములను — వినుపింప వినిన వివేక సంపదుడు" అని ద్వితీయాశ్వాసము మొదట్లో చెప్పినదానిబట్టి ప్రథమాశ్వాసంలో ముఖ్యంగా మంత్రలయ హఠయోగాలు వివరింపబడ్డాయని చెప్పవచ్చు. ఇక

ద్వితీయాశ్వాసంలో శిష్యుడు గురుని యోగముల ప్రాచుర్యమును తెలుపుమని అడగటం; గురుడు రాజయోగ ప్రాముఖ్యము, తారకా మనస్కాలనే ఉభయ లక్షణాలు గల రాజయోగ విపుల వివరణ 105 ద్విపదలలో చేయబడింది. తరువాత తారక, అమనస్కయోగ విధానాలు సంపూర్తిగా వివరించబడ్డాయి. అందుకే ఈ ఆశ్వాసానికి 'సాంఖ్యా మనస్కం' అని పేరు యివ్వబడింది.

తృతీయాశ్వాస పేరు తారకామనస్కం. దీనిలో అష్టాంగ యోగ విధానాలు ఆశ్వాసం మొదట వివరించబడ్డాయి. కవి ఆశ్వాసం మొదట్లోనే.

"శ్రీరాజయోగంబు సిద్ధిజేయుటకు
కారణమగు తారకామనస్కంబు
సార లక్ష్యలక్ష్య సంగతి మీర
వినుపింతు విను........" అని చెప్పెను.

ఇందులోనే—

"సత్కర్మమెల్లను సరస వృక్షంబు
నుత్కట తారకం బొగి పుష్పమరయ
ఆమనస్కమను ఫలం బగు నటుమీర"

అని ఆమనస్కయోగ ప్రాముఖ్యత తెల్పబడింది. ఈ ఆశ్వాసము లోనే మహావాక్య లక్షణాలు విపులంగా వివరించబడ్డాయి. చివరలో ఫలశ్రుతి ఆ తరువాత ఆశ్వాసాంత గద్యతో గ్రంథం పూర్తయ్యింది.

ఏది ఎలా ఉన్నా వేదాంతాన్ని చాలా సులభమైన శైలిలో విపులంగా విషయ వివరణ చేసిన గ్రంథంగా దీనికి ప్రముఖ స్థానం యివ్వవలసి వస్తుంది. ఇందులో నిర్దేశితమైన విషయాలను వేదాంత విదులు పరిశీలించవలసిన ఆవశ్యకత చాల ఉన్నది. ఈ గ్రంథం త్వరలో వెలుగు చూసే అవకాశం కలగాలని కోరుకొంటున్నాను.

**అధోజ్ఞాపికలు :**

1. ఈ గ్రంథం పేరు మహాసాంఖ్య ప్రకరణమని రూఢిగా తెలుస్తున్నా, తాళపత్ర ప్రతిపైన "నవయోగా మనస్క సంహిత" అని ఉండటంవలన నేను అదే శీర్షికగా ఉంచాను.
2. తెలుగులో అద్వైత తత్త్వ కావ్యాలు:- శ్రీ సన్నిధానం పరబ్రహ్మశాస్త్రిగారు.
3. దీనిలో పేర్కొన్న ద్విపదలు మొదలైనవి ఎలాంటి సంస్కారం లేకుండా యథాతథంగా ఉదాహరించబడ్డాయి.
4. ఈ గ్రంథంగానీ, కవిగానీ, యింతవఱకూ ద్విపద వాఙ్మయ చరిత్రలలోగానీ, కవుల చరిత్రలలోగానీ చేరలేదు.

# నిర్వచన అలలు

## శ్రీ యస్. యస్. రెడ్డి

తెలిసీ తెలియక
వ్రాసేది కవిత
తెలిసి వ్రాసేది
వ్యాసం
ఉన్న సమయంలో
ఉర్రూతలూగించేది ప్రసంగం
చిన్న సంఘటనను
మన్నికగా చెప్పేది కథానిక
సమగ్ర సథా స్వరూపం

కళ్లకు కట్టినట్లు వర్ణించేది నవల
చరిత్రకు వన్నె తెచ్చే
మనిషి చరిత్ర బయోగ్రఫీ
తన్మయత నిచ్చేది
సంగీతం
అమృత బాండంనుండి
జాలువారేది కళ
సార్థకత చేకూర్చేది
సమాజసేవ

## వేదులవారి వేదనా మాధుర్యము

తెలుగు సాహిత్యంలో వేదనకి ఒక విశిష్టమైన స్థానాన్నిచ్చి అపూర్వమైన కావ్య ఖండికలను సృష్టించిన తెలుగు కవులలో వేదుల వారికొక ప్రత్యేకమైన స్థానం వుంది. రొమాంటిక్ యుగంతో సరి తూగగల కవితలను ఈ శతాబ్దం మొదట్లో మన భావకవులు సృష్టించారు. ఈ సాంప్రదాయానికి చెందిన కవులే శ్రీ వేదుల, శ్రీ దేవులపల్లి, శ్రీ నాయని తదితరులు. దేశభక్తి అయితేనేమి, సౌందర్యారాధనైతేనేమి, ఏ భావాన్ని కవి గానం చేసినా వేదులవారి కవితా స్రవంతిలో వేదన అంతర్లీనంగా ప్రవహించే గౌతమి అనిపించక మానదు.

నిజ జీవితంలో వేదనని దుఃఖాన్ని మానవుడు భరించలేడు. అలమటిస్తాడు, ఆక్రోశిస్తాడు. ఈ బాధకంటే చావే నయమను కుంటాడు. అయితే ఇదే వేదనని కవిత్వంలో ప్రకటిస్తే శోకం శ్లోక మవుతుంది. మామూలు మనిషి మహాకవి అవుతాడు. తనలో రగిలిన చిరు వేదన అక్షర రూపం పొందిన మరుక్షణం కవితకి విశ్వజనీనత వస్తుంది. అది చదివినవాళ్ళ గుండెల్ని మెలిపెడుతుంది. మనిషిలో తాను పొందిన ఏ వేదనో జాగృతమై కవి మాటలతో, కవిత్వంలోని రసానుభూతితో మమేకంగా కలిసిపోతాయి. ఆ విశ్వజనీనతని కవిత్వం ద్వారా సాధించిన కవి గౌరీశంకర శిఖరాన్నధిరోహించి కవిత్వం ద్వారా శాశ్వతత్వాన్ని పొందుతాడు. ఈ బాధకంటే చావే నయమని ఏ మృత్యువుని తాను కోరుకున్నాడో, ఆ మృత్యువుమీద పరోక్షంగా విజయాల్ని సాధించి కవిత్వంలో చిరంజీవి అవుతాడు.

వేదులవారి జీవితంలో వారు ఎదుర్కొన్న ఒడిదుడుకులైతే నేమి, సంఘంవారిపట్ల చూపిన నిరాదరణ అయితేనేమి, తననూ తన కవితలను ప్రపంచం సరిగా గుర్తించలేదన్న నిరాశా, నిస్పృహ అవ్యక్తమైన ఆవేదన బహుముఖ స్రవంతిగా మారి వారి కవిత్వ మంతటా అంతర్లీనమై ప్రవహిస్తూ చదివినవారి అంతరాంతరాలలో కూడ వేదనని రగిలిస్తుంది. అటువంటి సంఘంపట్ల కవి చూపిన తిరస్కారము, తన వేదనకి కవి కనుగొన్న పరిష్కారము, కవి చివరకు సాధించిన అమరత్వము వివరంగా చూద్దాము.

“దీపావళినాడు” అనే కవిత వీరి కావ్యఖండికలలో సుప్రసిద్ధ మైనది. ఇందులో ప్రపంచమంతటా దీపావళి సంరంభం చెలరేగు తుంటే కవి వొక్కడే క్రమ్ముకొంటున్న అమావస చీకటుల నడుమ మరణ వాయిద్యము లట్లు గుండియల్ కొట్టుకొనగ దుఃఖిస్తూ వుంటాడు. అయితే మొక్కినకొలంది కాలితో త్రొక్కు కఠినలోకాన్ని కవి ఎల్లా బహిష్కరిస్తాడో చూడండి.

“నన్ను నిరసించువారి ఆనందమునందు
నాకు భాగమ్ము వలదొక్కనాటికైన
మ్రొక్కిన కొలంది కాలితో త్రొక్కుచున్న
ఈ కఠిన లోకమ్మెల్ల బహిష్కృతమ్ము”

అని “రాత్రివేళ నావలెనె పాడుకొను చిమ్మెటలార! మీరె నాకు సఖులు”, అని చిమ్మెటలని ఆహ్వానిస్తాడు.

అల్లాగే “ఎపుడో” అనే మరో కావ్యఖండికలో “కష్టభూయిష్ఠ దుఃఖాంత కథలతోడ విసిగిపోతిని పుటలు త్రిప్పినకొలంది: కునుకు దీపమారదు, పోడి కనుల నిదుర రాదు. బరువైన యెద మనో రథము పోదు” అని ఆక్రోశిస్తారు.

అయితే ఇంత దుఃఖంలో కవిలో మానసిక స్థైర్యము, సంఘం పట్ల తిరస్కారము కనిపిస్తాయి.

“ప్రేమ దాహాన యెడద తపించుకొలది
అమృత మొలికింతు స్మిత నయనాంచలముల
నన్నుగని ఈ ప్రపంచమ్ము నవ్వుకొలది
తనియ చేర్తు గొంతెత్తి గీతముల పాడి”

అంటూ గానం చేయాలనే తన తీరని తపనని గూర్చి ప్రస్తావిస్తారు. “అశాంతి” అనే కవితలో మోడైన తన యెదలోని బరువుతీర, తన బ్రతుకూపిరి తేరుకొనగ, ఒక్క కనికరపు చూపు, ఒక్క చిరునవ్వు తునుకయైన కటిక కరవయ్యె పాడులోకాన నాకు” అని ఆవేదన చెందుతూ మళ్ళీ వెంటనే

“కారుమబ్బులె కాదు, చీకటులె కాదు
క్రమ్ముకొననిమ్ము, కరడులు కట్టనిమ్ము
....... ............. ......................
.........................................
హృదయ మున్నంతవరకు, నా ప్రేమకాంక్ష
బ్రతికియున్నంతవర కేడ్చి బ్రతుకుచుందు.”

"ఏ వెలుగు నన్ను తనదరి కిడ్చుకొనునో, ఏ తలపు దారి సూపునో" అనే ఆశాభావంతో ఇంత దుఃఖభరితమైన ఖండిక అంత మవుతుంది. గౌతమీ కోకిలగా వన్నెకెక్కిన ఈ కవి "ఆ వ్రతము" అనే మరో ఖండికలో "గౌతమీనదీ పవిత్ర గర్భంలో మ్రోతవెట్టు చున్న యుగయుగాంతర విశ్వమహోగ్ర దుఃఖ జీవగీతాల కావృత్తి చెప్పుకొనగ నేనే మిగిలితి" అని చెప్పి తన వేదనకొక విశ్వజనీనతని సాధించగలిగారు.

అయితే ఈ వేదననుంచి కవికి ఉపశాంతి లేదా? వీరి పాటలూ, పద్యాలూ అన్నీ వేదనామయమేనా అంటే ఒక ఉత్కృష్టమైన విషయం స్పష్టమవుతుంది. భగవద్భక్తి, సౌందర్యారాధన కవికి ఊరటనీ ఆసరాని కల్పిస్తాయి. వారికి మానసిక శాంతి లభ్యమవుతుంది.

విరిసె కాబోలు! జగదీశ్వరు శిఖావ
తంస కుసుమమ్ము! దిగ్దిగంతమ్ములందు
సౌరభోచ్ఛ్వాసములు వెదజల్లుచున్న
దానుకూల్యముతో శారదానిలమ్ము అంటారు.

నరక లోకపు చీకటి తెరలవంటి
వెన్నినిశలేగె నొక స్వప్నమేని లేక
ఇంత సౌందర్య మింత ప్రశాంతి సౌఖ్య
మింత మాధుర్యమేల దాగె నింతవరకు"

అని నిరంతరం దుఃఖలో వేసారిపోయిన హృదయానికి ఉపశాంతి కలిగించుతుంటారు.

"నీ గీతి విశ్వమంతా గొంతెత్తి పాడు!
నీతోడ ప్రాణలీలా తాండవమ్మాడు!
ఓ దివ్యగాయకా!
ఓ ప్రాణ నాయకా!"

అని భగవంతుణ్ణి ఈశ్వర రూపంలో స్మరిస్తూ ఒకచోటా

"రవి కరోద్దీప్త హిమశీకరము వోలె.
రమ్య పింఛమ్ము చిత్రవర్ణము లొలుక
శిరము నూపుచు మోవిపై మురళి నూని
ఏదీ మరొకమారు వాయింపుమోయి"

అని గోపికాభావంతో శ్రీకృష్ణునిగా ఒకచోట కీర్తిస్తారు. గోపాలుని వేణుగానము మంజు కుసుమామృతమ్ములోని మధురిమమ్ము, మధుర చంద్రాతపమ్ములోని మార్దవమ్ము కలవట. భక్తిభావంలో కవికి దొరికిన ఆసరా ఈ తన్మయ భావమే! ఈ రసానుభూతియే!

"ఆరాధన" అనే మరో ఖండికలో కవి సౌందర్యారాధన పరాకాష్ఠ నందుకుంటుంది. కవియొక్క ఊహాసుందరి వారి అంతరంగ శాంతి దేవత! ఆశాపథాంతరాళ పారిజాతమ్ము! త్రైశికీజీవన తపః కల్పవల్లి అట! ఆమెని వర్ణిస్తూ,

ఆమె జగదీశ మకుటాగ్ర సీమనుండి
యుర్విపై జారిన సుధామయూఖ రేఖ!
ఆమె మూడు లోకాల కల్యాణమునకు
అవతరించిన ఒక పవిత్రానుభావ!

ఆమె పద సన్నిధాన దివ్యస్థలాన
నాకకల్లోలినీ పదన్యాసమునకు
దరవినతమైన హరజటాభరము వోలె
నతుడనయ్యు మహా మహోన్నతి వహింతు"

వేదనని జయించటమే కాదు, కవి తన ఊహా బలంతో పరమాత్మ సన్నిధానానికి చేరుకున్న కవి కిపుడు పూర్తి శాంతి! కదిలించే కవితలనే కాదు, రసస్ఫూర్తినీ, ఉపశాంతినీ కూడ కలిగించే ఖండికలను గూడ రచించారు వేదులవారు.

వేదన, భగవద్భక్తి, సౌందర్యారాధన కలగలిసిపోయిన మరో కావ్యఖండిక "ఆశాగానము", వీరి పద్యాలన్నీ ఒక ఎత్తూ! ఇది ఒకటీ ఒక ఎత్తూ! వీరి కవితలకిది కలికితురాయి! నిరాశ, నిస్పృహ కవిని ఉన్మత్తుణ్ణి చేశాయేగాని, నీరసుణ్ణి చేయలేదు. శిథిలమైన వీణని పాడు కొమ్మని కవికి పరమాత్మ ఓసాడట! ఆ శిథిల వీణమీద మధుర రాగాల నాలపించలేని అశక్తత కవిది — "తీగ తెగునో, శ్రుతి తప్పునో, పలుకదో!" - అంటారు. ఆ భారాన్ని భగవంతుడిమీదే పెట్టారు కవి, అయితే భగవంతుడు భక్తుడే పాడాలని నిర్దేశిస్తాడు. జీవితవీణను సవరించి, పలికించి, పాడుకోవల్సిన బాధ్యత మానవుడిదే కదా! అందుకే కవి ధైర్యంచేసి, వీణని పలికించటానికి ఉద్యుక్తుడవు తాడు. అయితే ఒక చిన్న సవరణ వుంది.

"ప్రేమమై సివె రచియించి కరుణించినవి ప్రణయార్ద్ర గీతికల్ కావున నా విశుష్కీకృత గళమ్మున నీ కరుణ రసాంకిత శ్రీవిభవముల్ నింపి మధురింపుము, నే శ్రుతి కల్పి పాడెదన్" అని ప్రార్థిస్తారు పరమేశ్వరుణ్ణి. పరమాత్మతో కలిపి జీవుడు పాడే జీవనగీతాలు మధురగానాన్ని సృష్టిస్తాయేగాని అపశ్రుతులని పలుకవు కదా!

సున్నితమైన హృదయము, సునిశితమైన భావనాబలము, సుమధురమైన భాష మేళవించిపోయిన గౌతమి స్రవంతి వేదులవారి కవిత్వం! వీరి వేదన,వేదనామాధుర్యము గోదావరీ నదీమతల్లి ప్రవహించినంతకాలం, అంత చల్లగా, అంత తియ్యగా రసికుల మనస్సులను రంజింపచేస్తూ వుంటాయి.

—డా॥ కలూరి శ్యామల

## జాదు! మ్యాజిక్

జాదు - ఇంద్రజాలం - మ్యాజిక్ శబ్దాలు యిటీవల బాగా వ్యాప్తిలోకి వచ్చాయి. జాదు శబ్దం పారశీక భాషనుండి వచ్చింది. వాక్ చాతుర్యం, హస్తలాఘవంతో ప్రేక్షకులను మైమరపింపచేసే విద్యలివి. ఒకప్పుడు వెనుకబడిన తరగతులవారు, ముఖ్యంగా దొమ్మర్లు యీ విద్యల్లో అందె వేసిన చేయి. కాని ఇటీవల విద్యాధికులు, యీ విద్యలను సాధనచేసి ప్రదర్శిస్తున్నారు.

ప్రాచీన భారతదేశంలో 'జాదూ' అన్న పదం భయాన్ని సూచించే సంకేతంగా వుండేది. ప్రాచీన పారశీక భాషకు సోదరిగా భావింపబడిన వైదికభాషలో 'జాదూ' 'యాతు' అని పిలువబడేది. క్షుద్రదేవతలు, భూత, ప్రేత, పిశాచాలు, చేతబడి, మోడి, బాణామతి మున్నగువాటిని కరగతం చేసుకోవటాన్ని 'యాతు' అనేవారు. అధర్వణవేదం, బ్రాహ్మణాలు, సూత్ర సాహిత్యం మున్నగువాటిలో యాతువులు కానవస్తారు. 'యాతుధాన' అంటే ఒక పిశాచము. 'యాతుజూ' అంటే 'యాతువులచే ప్రేరేపింపబడిన పిడుగు. 'యాతుకృత్' అంటే చేతబడి చేసేవాడు.

అలౌకికములైన యాతువులంటే ఎంతో భయం. వాటి పరిహార, నాశన, ప్రతీకారములకు ఉపయోగపడు మంత్ర తంత్రములను ఋక్, అధర్వణ వేదములలో చూడవచ్చును. యాతు, చాతన, యాతుభంజన, యాతుక్షయణ మున్నగునవి ప్రతీకార సూచకములు. వశిష్ఠ మహర్షి మరియు అతని వంశీయులు యాతుచాతన (భూతోచ్చాటన) క్రియలో ప్రసిద్ధులు. "ప్రతిచక్ష్వ విచక్ష్వేంద్రశ్చ సోమోజాగృతం" మున్నగు మంత్రములను నిత్యమూ, సంధ్యా వందనములో పఠించి యాతులను పిడుగులచే నాశనము చేయవలసినదిగ, ఇంద్రసోములను ప్రార్థిస్తారు. ఇట్టిదే మరో వశిష్ఠ మంత్రమును రాత్రి నిద్ర పోయేముందు పఠిస్తారు.

ఈ మంత్రపఠనంవల్ల, గుడ్లగూబ, కుక్క, గ్రద్ద మున్నగు వాటి రూపములలో యాతువులు రాత్రి వేళల్లో సంచరించునని అర్థమవుతుంది. ప్రాచీన భారతీయ భాష మరియు ఇరాన్‌లోని ప్రాచీన భాష రెండింటిలోను ఒకే పదం అరిష్టశక్తి సంకేతంగా కానరావటం గమనింపదగిన విషయం.

వైదిక యుగానంతరం 'యాతు' శబ్దం మాయమై అందుకు ప్రతీకలుగా, రాక్షస, భూత, ప్రేత, పిశాచాలను సూచిస్తున్నాయి. వీటిని వశీకరణ మొనర్చుకుని అద్భుత శక్తులను, ప్రదర్శించడాన్నే 'అభిచారం' అన్నారు. 'అభిచార కల్పమ్' అన్న ప్రత్యేక గ్రంథమే వుంది.

'జాదూ' వలె 'మ్యాజిక్' అన్న ఆంగ్లపదం యీనాడు అత్యంత జనప్రియంగా వుంది. ఇదొక వినోద విద్య. ఇది కూడా మన అభిచారంవలె అలౌకిక శక్తిచే సాధించే క్రియ. ఈ తంత్రములను దురుద్దేశములతో సాధించటాన్ని 'బ్లాక్ మేజిక్' అని సదుద్దేశంలో సాధించటాన్ని 'వైట్ మేజిక్' అని పేర్కొంటారు.

మ్యాజిక్ శబ్దం కూడా 'మగస్' అను పారశీక భాషాజన్యమే. గ్రీక్, ల్యాటిన్ భాషలద్వారా 14వ శతాబ్దంలో ఆంగ్ల భాషను చొచ్చిందా పదం. ప్రాచీన 'ఇరాన్'లో (మనవారు పశ్చిమ ఇరాన్‌ను 'శకద్వీప'మని పిలిచేవారు.) 'మగ' అను పురోహిత వర్గము వుండేది. సూర్యారాధకులైన వీరు మంత్రవిద్యలోను, భవిష్య విద్యలోను ప్రవీణులు. ఈ 'మగ' పురోహితులే తమ దివ్యదృష్టిచేత 'క్రీస్తు పుట్టుకను' గురించి భవిష్యద్వాణి వినిపించినట్లు బైబిల్‌లోని 'క్రొత్త ఒడంబడిక' పేర్కొన్నది. వారిని 'తూర్పుదేశ జ్ఞానులు' అనేవారు. మగర విద్యనే మ్యాజిక్ అన్నారు. ఈ మేజిక్‌లో జ్యోతిషం మాయమై 'అభిచారం' మిగిలింది.

ఈ 'మగ' బ్రాహ్మణులు భారతదేశానికి కూడా వచ్చారు. క్రీ.శ. 6వ శతాబ్దికి చెందిన వరాహ మిహిరాచార్యుడు వీరిని గురించి

ప్రస్తావించాడు. భవిష్య పురాణములో కూడా వీరి ప్రస్తావన వస్తుంది. వీరిద్వారానే బేబిలోనియన్ - గ్రీక్ ఖగోళశాస్త్రము జ్యోతిషము మన దేశానికి వచ్చాయని సునీతి కుమార ఛటర్జీ అన్నారు. వరాహ మిహిరాచార్యుడు 'మగ' బ్రాహ్మణుడు కావచ్చు. మిహిర—జరత్రుష్ట అను పారశీక దేవత మన వైదిక దేవత మిత్ర—సూర్యుడు ఒకరే కావచ్చు. వరాహ మిహిరుడు సూర్యారాధకుడు. భారతదేశంలో సూర్యారాధన అతి ప్రాచీనమైనది. సూర్యార్చన జనప్రియమగుటకు 'మగ' బ్రాహ్మణులే కారకులు కాబోలు. సూర్యునికి సంబంధించిన ఆరాధనలో వారే ప్రముఖులు. క్రీస్తుశకారంభ కాలములో, ఉత్తర భారతదేశమున కానవచ్చు సూర్యమూర్తులలో ఇతర భారతీయ దేవతామూర్తులలో కానరాని ప్రత్యేకత ఒకటి కానవస్తుంది. మన దేవతలందరూ పాదుకలు లేనివారే! విదేశమునుండి వచ్చిన సూర్యుడు. పాదరక్షలు ధరించినవాడు!

కాలక్రమంలో యీ 'మగ' బ్రాహ్మణులు దేశీయ బ్రాహ్మణులలో కలిసిపోయారు. బ్రాహ్మణ కులానికి చెందిన 'మిశ్రా' అనువారలు యీ 'మగ' కులానికి చెందినవారు కావచ్చు. కృష్ణహాస మిశ్ర అనునతడు మగ 'బ్రాహ్మణుల' చరిత్రను రచించాడు.

—జానమద్ది హనుమచ్ఛాస్త్రి

# ఆర్ష ధర్మాల్లో అభ్యుదయ భావన

నిరంతర పరిణామశీలమైన ఈ సృష్టిలో అభ్యుదయ భావన అనాదిగా ఉంది. మొదటినుండి మానవుడు తానున్న స్థితినుండి ఉన్నతస్థితిని పొందడానికి అభ్యుదయాన్ని అందుకోవడానికి తీరని ఆరాటంతో ఆరని పోరాటం చేస్తూనే ఉన్నాడు. ఆ అభ్యుదయ భావ కుసుమాల వికాసానికి అడ్డు తగిలే ప్రతిప శక్తుల ప్రతాపాన్ని యథాశక్తిగా ఎదిరిస్తూనే ఉన్నాడు.

ఋషుల పంథాలో, రోమన్ గ్రంథాల్లో ప్రాచ్యుల భావనా లోకంలో, పాశ్చాత్యుల పరిశోధనా లోకంలో పక్షపాతం లేకుండా పరిశీలించగల్గితే ఈ అభ్యుదయ భావన నిరంతర స్రవంతిగా ప్రవహిస్తూనే ఉందని తెలుస్తుంది. ఆదిఋషుల సుభాషితాల్లో అభ్యుదయ భావాలను ఒకింత పరిశీలిద్దాం.

ఆదిదైవంగా భావింపబడే శ్రీరాముడు ఆదికావ్యంలో. మానవ ప్రయత్నాన్ని కిచ్చిన ప్రాధాన్యాన్ని చూడండి.

దైవం పురుష కారేణ
యస్సమర్థః ప్రబాధితుం।
న దైవేన విపన్నార్థః
పురుష స్సోఽవ సీదతి॥

దృఢతరమైన ప్రయత్నంచేత ఎవరు అదృష్టాన్ని దెబ్బతీయగల్గుతారో వారు ఎన్నడూ విపన్నులు కారని తెలిపే ఈ శ్లోకం ఆర్ష ధర్మంలో పురుష ప్రయత్నానికుండే ప్రాధాన్యాన్ని అద్దంపట్టి చూపిస్తోంది.

కులాల సంకుల సమరంతో పాపపంకిలమైపోయిన సమాజానికి కులాల నిష్ప్రయోజకత్వాన్ని ఆర్షధర్మం ఎంత సూటిగా తెలియజేస్తోందో చూడండి.

కిం కులేన విశాలేన
శీల మేవాత్ర కారణం।
కృమయః కిం నజాయంతే
కుసుమేషు సుగంధిషు॥

సుగంధ బంధురాలైన సుమ సముదాయంనుండి దుర్గంధ కారకాలైన పురుగులు పుట్టడం లేదా? కులం ప్రధానమా? గుణం ప్రధానం కాని, అని ఈ శ్లోకం ఎలుగెత్తి చాటుతుంటే ప్రాచీన సంస్కృతి అంతా కులమతాలతో పాచిపట్టిందేనని మనం గొంతు చించుకోవడం ఎందుకు?

కోట్లకు కోట్లు సంపాదించి ప్రజాహిత కార్యక్రమాలకు వెచ్చించకుండా దాచి, దోచే దోపిడీదారులకు నేటి సమాజం విధించే శిక్షలు చాలా తక్కువ. ఆర్షధర్మం ఈ దోపిడీగాళ్లని ఏం చేయమని ఆజ్ఞాపించిందో చూడండి.

ద్వావంభసి నివేష్టవ్యౌ
గళేబద్ధ్వా శిలాం దృఢాం।
ధనవంత మదాతా రం
దరిద్రం చా తపస్వినం॥

ధనవంతుడైయుండి తన సొమ్మును బహుజన హితం కోసం, బహుజన సుఖంకోసం ఖర్చు పెట్టనివాణ్ని వెంటనే లోతైన బావిలోకి తోసైమన్నారు. మామూలుగా కాదు. మెడకి ఒక పెద్ద బండరాయి కట్టి మరీ తోసైమన్నారు. ఎందుకు? మళ్ళీ తేలివచ్చి జనాన్ని ముంచకుండాను. దరిద్రుడైయుండి సంపాదించడానికి కష్టపడనివాడికి కూడా ఇదే శిక్ష. ఎంత తీవ్రవాదం? ఎంత ఆవేశం? దాని వెనుక ఎంత ఆవేదన? ఎంత సామాజిక స్పృహ? ఇటువంటి శ్లోకాలు చదువుతుంటే అసలీ ఋషులకంటె అభ్యుదయవాదులు, విప్లవకారులు వేరే ఉన్నారా? అనిపిస్తుంది.

# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్ఠమైన ఆముదము




శుద్ధి చేసినది, వాసన లేనిది.

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004

**Amrutanjan Limited**



"సమాజానికి నువ్వు ఇవ్వగలిగినంత ఇయ్యి. నీకు అవసర మైంది తీసుకో" అన్నాడు సామ్యవాద ప్రవక్త మార్క్స్. ఇది ఒక్కటి మనమంతా ఆచరిస్తే సమసమాజం రేపిపాటికి ఏర్పడి పోతుందనడంలో సందేహం లేదు. కాని మనం మార్క్స్ చెప్పింది చెయ్యం. మహర్షులు చెప్పింది చెయ్యం. కొందరు మార్క్స్‌ని మరి కొందరు మహర్షులని తిట్టుకుంటూ, పరస్పరం కొట్టుకుంటూ కాలక్షేపం చేసేసి కర్తవ్యాన్ని భావి తరాలవారికి బోధిస్తూ ఉంటాం. మార్క్స్ భావనలను మహర్షులు ఎంతోకాలం ముందుగానే ఎంత ఖచ్చితంగా ప్రకటించారో చూడండి.

యావద్భ్రియేత జఠరం
తావత్ స్వత్వంహి దేహినాం।
అధికం యోఽభిమన్యేత
స స్తేనో దండమర్హతి॥

కడుపు ఎంతవరకు పడుతుందో అంతవరకే సొంతం. ఆ అవసరాలమేరకే దాచుకోవాలి. అంతకంటె నయాపైసా అధికంగా దాచినా వాడు దొంగే అవుతాడు. వాణ్ని దండించి తీరవలసిందే! "నీకవసరమైనంతవరకే తీసుకో" అన్న మార్క్స్ భావనకి దీనికి తేడా ఏమిటి? దీన్ని లోతుగా విచారించి (ఆలోచించి), ఆచరించి, ప్రచారం చేస్తే సమసమాజం కోసం రక్తపుటేరులు ప్రవహింపజేయ వలసిన అవసరంలేదు. ఆ చిత్తశుద్ధి, నిజాయితీ, ఆదర్శం లేనినాడు దాడులు, ఎదురుదాడులు, వర్గ సంఘర్షణలు తప్పవు మరి.

అభ్యుదయ భావన అనాదిగా అనంతంగా పెనవేసుకొని వస్తూనే ఉంది ఆచరించేవాళ్ళకోసం అప్పటినుండి ఇప్పటివరకు ఆశగా ఎదురు చూస్తూనే ఉంది. ఆ ఆశలు నెరవేర్చడానికి మహర్షులూ రారు. మార్క్స్ రాడు. నెరవేర్చినా పరిమార్చినా మనమే.

—గరికిపాటి నరసింహారావు



# నారాయణ శతకకర్త ఎవరు?

నారాయణ శతకము పోతన కర్తృకమని లోకమున నొక నమ్మకమున్నది. పోతన నారాయణ శతకమున వ్రాయలేదని కొందరు పండితులు పల్కియున్నారు.

పిఠాపురం ఆంధ్ర పరిశోధకమండలి నిర్వాహకులు వంగూరి సుబ్బారావుగారు సిద్ధాది సుబ్బరాయ కవివర్యులచే పరిశోధింపబడిన నారాయణ శతకమును 5-4-1919న తేదీన ప్రకటించియున్నారు. అందు ఈ శతకము భాగవతమును రచించిన బమ్మెర పోతనామాత్య విరచితముగా పేర్కొనబడినది. ఇందు గల గద్యవలన నిది పోతనా మాత్య కృతమనియు, గ్రంధశైలియందును, కొన్ని వ్యాకరణ దోషములయందును ఇది భాగవతమునకు సంపూర్ణమగు పోలికతో నున్నదనియు సుబ్బారావుగారు పీఠికయందు పేర్కొనియున్నారు.

ఈ నారాయణ శతకము ద్వితీయ ముద్రణము కూడ 6-4-1919 తేదీననే జరిగినది. ఈ శతకమునకు మరుసటిరోజే రెండవ ముద్రణ మవసరమైనదనియు ఇంత త్వరలో రెండవ ముద్రణమందిన తెలుగు గ్రంథ మిదివరకింకొక్కటి లేదనియు సుబ్బారావుగారు ఈ శతకముయొక్క రెండవ కూర్పునకు వ్రాసిన పీఠికలో తెల్పియున్నారు.

ఈ శతకములో నూరు పద్యములున్నవి. చివర 'ఇది పరమేశ్వర కరుణా కలిత కవితా విచిత్ర కేసనమంత్రి పుత్ర సహజ పాండిత్య పోతనామాత్య ప్రణీతంబైన నారాయణ శతకంబున సర్వంబును 'సంపూర్ణము' - అని గద్య కలదు. ఇది భాగవత గద్యను ముమ్మూర్తులా పోలియున్నది.

ఈ శతకములో 'అపరాధమ్ములు నిన్ను నమ్మి' అనే 97వ పద్యం 'కృపకున్ బాత్రుడనయ్యె ధర్మపురి లక్ష్మీనాథ నారాయణా' అని పూర్తి అవుతుంది

దీనినిబట్టి చాగంటి శేషయ్యగారు ఈ శతకం పోతన వ్రాయ లేదని ధర్మపురిలోనున్న లక్ష్మీనారాయణ స్వామివారిమీద మరో కవి ఎవరో వ్రాశాడని తెల్పియున్నారు. ఇదే విషయాన్నే అకాడమీవారి భాగవత సంపాదకులు కూడ తెల్పియున్నారు. ఏ పద్యాన్ని ఉదాహ రించి శేషయ్యగారు ప్రభృతులు పోతన రచన కాదని చెప్పారో అదే పద్యాన్ని ఉదాహరించి డా॥ కేతవరపు రామకోటిశాస్త్రిగారు 'ధర్మపురి ఓరుగల్లుకు దగ్గర గనుక గోదావరీ తీరం గనుక పోతన బమ్మెర నుండి గంగా స్నానానికి ధర్మపురి ఎన్నిసార్లయినా పోయి వుండ వచ్చు. అక్కడ లక్ష్మీనారాయణ స్వామివారిని ఇష్టదైవంగా ననుకొని శతకం వ్రాసియుండవచ్చునని ఊహించడానికి వీలుంది' అని చెప్పి నారు. (పోతన్నగారి వైచిత్రి-పుట 26)

ఇదే పద్యాన్ని ఉదాహరిస్తూ 1919వ సంవత్సరంలోనే ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఈ శతకకర్త పోతన్నయేనని తెల్పియున్నారు.

ఆరుద్రగారు చాగంటి శేషయ్యగారి మాటనే బలపరుస్తూ ఇదేకాక ఇంకో పద్యంవల్ల కూడా ఈ శతకం పోతన రచన కాదని చెప్పవచ్చునని చెప్పారు. ఈ శతక కవి ఒక పద్యంలో 'కృపన్ చేయవే శ్రీమించన్ బహు జన్మజన్మములకున్' — అని వ్రాసి యున్నందున ఇది పోతన మనస్తత్వమునకు విరుద్ధమనీ 'నాజన సంబుల్ సఫలంబు జేసెద బునర్జన్మంబు లేకుండగన్' అని కాంక్షించిన పోతన బహు జన్మజన్మలు చెప్పే ఈ నారాయణ శతకాన్ని వ్రాసి యుండడని ఆరుద్రగారి అభిప్రాయం (సమగ్రాంధ్ర సాహిత్యం 5వ సంపుటం పుట 240) 1968లో ఆంధ్రప్రదేశ్ అకాడమీవారు ప్రచురించిన శతక సంపుటం ద్వితీయ భాగంలో ఈ నారాయణ శతకం పోతన రచనగానే చేర్చబడింది. దీనికి పీఠిక వ్రాసిన స్వామి శివ శంకరస్వామిగారు కూడా నారాయణ శతకము పోతన భాగవత రచనకు పూర్వము జరిగినట్లుగనే ఊహించవచ్చునని తేల్చియున్నారు.

నిడుదవోలు వెంకటరావుగారు అధికముగా సర్వేశ్వర శతకముతోడి సాదృశ్యమును చూపుచు నీ కారణములవలన గూడ నిది పోతన రచన యని జెప్పవచ్చునని పల్కిరి. కానీ అవి పోతన కర్తృత్వమును స్థాపించుటకు సరిపడవు. ధూళిపాళ శ్రీరామమూర్తిగారు తమ భాగవతానుశీలన యను గ్రంథమునందు (పుట 581లో) పోతనగారి కత్యంత ప్రియమైన అనుప్రాసాలంకారములుగానీ, రచనా సౌందర్యముక్తిగానీ, భావనాపటిమగానీ, భక్తి పారవశ్యముగానీ ఈ శతకమునందు కన్పించవు కావున ఇది పోతన రచన కాదను అభిప్రాయమును వెల్లడించియున్నారు.

1919వ సంవత్సరమున ఈ నారాయణ శతక కర్తృత్వమును గురించిన చర్చ విస్తారముగా జరిగినట్లు తెలియుచున్నది.

వంగూరి సుబ్బారావుగారు 5-4-1919వ తేదీన నారాయణ శతక ప్రథమ ముద్రణమును ప్రకటించినారు. మరుసటిరోజే అనగా 6-4-1919 తేదీననే తిరిగి రెండవ ముద్రణమును వెలువరించారు. 5-4-1919 నాటి ముద్రణములో 'వివరణమగు పీఠికయు, గ్రంథ విమర్శనమును, పాఠభేదములును రెండవ ముద్రణమున జేర్ప బ్రయత్నించెదనని' తెల్పిన సుబ్బారావుగారు అంత తొందరపడి మరుసటిరోజే రెండవ ముద్రణము నేల చేపట్టవలసి వచ్చెను? పైగా రెండవ కూర్పు పీఠిక ఎత్తుగడలోనే 'నిన్ననే ముద్రించిన ఈ శతకమునకు నేడే రెండవ ముద్రణ మవసరమైనది' అని పేర్కొని యున్నారు. రెండవ ముద్రణమును మరుసటిరోజే ముద్రింపవలసి వచ్చిన ఆత్రమునుబట్టి చూచినచో సుబ్బారావుగారు ఎంత త్వరగా నైతే అంత త్వరగా ఈ శతకమును పోతన కర్తృత్వముగా లోకమునందు చలామణీ చేయించవలెను' అనెడి ఆత్రుతతో నున్నట్లు తోచుచున్నది.

ఇది ఊహించియే కాబోలు 8-7-1919వ తేదీన నెల్లూరులో జరిగిన కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్ వార్షిక విద్వత్సభలో జనమంచి వెంకట సుబ్రహ్మణ్య శర్మగారు 'నారాయణ శతకం పోతన రచన కాదనీ, శతకం చివర వున్న గద్య భాగవతగద్యకు నకలుగా ఎక్కించిన కూటసృష్టి మాత్రమేనని' పెద్ద వ్యాసం వ్రాసి చదివారు. ఇది నిజమేనేమో ననిపించును. ఎందుకనగా 'ఈ శతకాంతమునందు గన్పట్టుచున్న గద్యము వ్రాతప్రతులలోను, తాళపత్ర గ్రంథము లందును లేదనియు, రెండు కాగితపు ప్రతులలో మాత్రమీ గద్యము కన్పించుచున్నదనియు పైగా గ్రంథమంతయు వ్రాసిన సిరా వేరుగను గద్య వ్రాసిన సిరా వేరుగను గన్పించుచున్నదనియు దీనినిబట్టి ఎవరో ఈ గద్యమును చేర్చినారని ఊహింపవచ్చుననియు నాగేశ్వరరావు పంతులుగారు తెల్పియుండుట ఇచ్చట గమనార్హము.

సుబ్రహ్మణ్య శర్మగారు 8-7-1919వ తేదీన వ్యాసం చదవడానికి వంగూరి సుబ్బారావుగారు రెండు రోజుల్లో రెండు ముద్రణలు వెలయించటమూ వీరేశలింగం పంతులు మొదలగువారు ఆ రోజుల్లోనే సుబ్బారావుగారి వాదాన్నే సమర్థిస్తూ వ్యాసాలు వ్రాయడమూ కారణం కావచ్చును.

మొత్తంమీద నారాయణ శతకం పోతన రచన కాదన్న పెద్దలు జయంతి రామయ్య పంతులు, చిలుకూరి వీరభద్రరావు, పెద్దిభట్ల వీరయ్యపంతులు, చాగంటి శేషయ్యగారు, దివాకర్ల వెంకటావధానిగారు, పింగళి లక్ష్మీకాంతంగారు, ధూళిపాళ శ్రీరామమూర్తిగారు, ఆరుద్రగారు మొదలగువారు.

ఇది పోతన కర్తృత్వమే అని చెప్పినవారిలో ముఖ్యులు వంగూరి సుబ్బారావుగారే.

మొత్తముమీద ఇప్పటికైనను ఈ కర్తృత్వ విషయక నిర్ధారణము జరిగినదా?

విజ్ఞులు తెలియజేసెదరు గాక!

—అమళ్ళదిన్నె వేంకటరమణ ప్రసాద్

# తులసీ జలంధర ప్రతీక

భారతి (నవంబరు 1988)లో "సర్వసంపత్ప్రదాయిని-తులసి" అనే వ్యాసం చదివి ఇది వ్రాస్తున్నాను.

తులసి మొక్కను గురించిన కొన్ని విశేషాలు తెలుపుతాను.

● తులసి యాకు తింటే పురుషులలో శుక్ర వీర్యకణాలు తగ్గుతాయనీ, స్త్రీలకు గర్భస్రావం కల్గుతుందనీ న్యూఢిల్లీలోని అఖిల భారత వైద్యశాస్త్ర సంస్థ 1981లో కనిపెట్టింది. అంటే, తులసి, పుంస్త్వ క్షయానికి, వంధ్యత్వానికి దోహదకారి అని అర్థం.

● తులసిపై ఒక పురాణగాథ వుంది. అది తులసీ జలంధర కథ. ఇది ప్రతీకాత్మకం.

"తులసి" ఒక పతివ్రత. లైంగికంగా అభంగశీల, స్త్రీ శీల భద్రత రెండు రకాలుగా ఉంటుంది. పురుష సంపర్కమే లేకుండుట. అటువంటిది "కన్య". పరపురుష సంపర్కం లేకుండుట. ఇటువంటిది "పతివ్రత". తులసి భర్త జలంధరుడు. "జలంధరు"డంటే భాషా శాస్త్రరీత్యా నపుంసకుడనే అర్థం వస్తుంది. వీర్యకణ వినాశిని అయిన తులసికీ (ఈమె "కన్య", పతివ్రత, వంధ్యకూడ), నపుంసకుడైన జలంధరునికీ భార్యాభర్తల సంబంధం కల్పించబడింది. తులసి పాతివ్రత్యం చెడనంతవరకు జలంధరునికి అంతం లేదని కట్టడి వుంది. జలంధరుడు నిర్వీర్యుడు కనుక తులసి కన్యాత్వం చెడదు. లైంగిక భంగం చెందే ప్రమాదం లేదు. అందుకే వీర్యవానుడైన విష్ణువు తులసిని లైంగికంగా చెఱచి జలంధరుని చావుకు కారకుడైనాడు.

● మధ్యధరా సముద్ర తీరప్రాంతాలలో(ఇటలీ)కూడ తులసిని పవిత్ర సస్యంగా గౌరవిస్తారు. తులసిని "హోలీబేసిల్" (పవిత్ర తులసి) అంటారు. హృదయాకారంగా వుండే తులసి యాకును ప్రేమ చిహ్నంగా, దాంపత్య జీవనభద్రాత రక్షరేకుగా భావించి "స్వీట్ బేసిల్" (మధుర తులసి) అంటారు. వివిధప్రాంతాల ఆదిమ వాసుల "ఫర్టిలీకల్ట్" (అవంధ్యాత్వ వ్రతం)లో తులసిమొక్క ప్రముఖ స్థానం కలిగిఉంది. 'హైందవ స్త్రీల తులసిపూజ ఈ "ఫర్టిలిటీకల్టే". గర్భస్రావకారిణి ఐన తులసిమొక్కను, అది కానీయకుమని మ్రొక్కుటే ఇది. తట్టు, మశూచికం, ప్లేగు కలరాల వంటి ఉపద్రవాలు తెప్పించకండని ఆయా రోగకారిణులని విశ్వసింపబడే అటలమ్మ, పెద్దమ్మ, మారెమ్మ మున్నగు దేవతలను కొల్చుతున్నాం. ప్రాచీన గ్రీకులుకూడ మహారోగాలను దేవతలుగా భావించినారు. అథర్వవేదంలో రోగాలపైన, ఓషధులపైన మంత్రాలు, ఉచ్చాటనలు, స్తోత్రాలు వున్నాయి.

● ఇంగ్లీషు కవి కీట్సు "ఇసబెల్లా" అనే కావ్యం వ్రాసినాడు. ఇసబెల్లా ఒక యువతి. ఒకని ప్రేమించింది. ఆమె సోదరులు, ప్రియుని చంపి, తల నరికివేస్తారు. తన ప్రియుని తలను ఒక కుండలో పెట్టి, మన్ను కప్పి, దానిమీద "మధుర తులసి" (చూ. ఇంతకుముందు)ని నాటి దానిని తన కన్నీటితో తడపుచు పెంచుతుంది. ఇసబెల్లా విషాద ప్రేమగాథను కీట్సు ఇటాలియన్ రచయిత బొకాషియో (14వ శతాబ్దం) వ్రాసిన "డెకామెరాన్" (పది కథలు) నుండి గ్రహించినాడు బొకాషియో తన కొన్ని కథలను భారతీయాది సంప్రదాయలనుండి సేకరించి కొన్నాడు. తలనో, దేహాన్నో పాతిపెట్టి, పైన తులసిమొక్క నాటుట భారతీయుల ప్రాచీనాచారం. జలంధరుని తల కూడా పాతిపెట్టబడి, పైన తులసిమొక్కలు కలిగి వుండవచ్చును. తులసికి "బృంద" అని కూడా పేరుంది. మనిషి దేహావశేషాలను నిక్షిప్తంచేసి, పైన తులసిమొక్కలు నాటి చుట్టు గోడలు కట్టిన కట్టడానికి "బృందావనం" అంటారు. కీట్సు, కావ్యం "ఇసబెల్లా"కు "తులసికోట" (పాట్ ఆఫ్ బేసిల్) అనే ఉపశీర్షిక కూడా పెట్టినాడు. మాధ్వస్వాముల దేహాలను పాతి, మన్ను కప్పి, తులసి మొక్కలు పెంచి, కట్టిన కోటకు బృందావనం అని పేరు మంత్రాలయంలో రాఘవేంద్రస్వాముల జీవసమాధిపై వెలసిన తులసి కోటకు రాఘవేంద్ర బృందావనం అని పేరు. ఇండ్లలోని తులసి కోటలలో అడుగున మనిషి దేహావశేషాలుండవుకానీ, తులసీ జలంధర ప్రతీక (తులసి మొక్కకు కల కొన్ని రాసాయనిక గుణాలు) మనుష్యుల ఆచారాలను, విశ్వాసాలను ఎంత ప్రభావితం చేసిందో అని ఆశ్చర్యం కలుగక మానదు.

"త్రి"



# గ్రంథ విమర్శలు

## ఇంద్రాణీ సప్తశతీ

[కృతికర్త: కావ్యకంఠ శ్రీ వాసిష్ఠ గణపతిముని, ప్రచురణ: శ్రీ రమణ సత్సంగం, 14/96 కమలానగరం-అనంతపురం 515 001 వెల: రు. 20/-]

ఈ కృతి రచనకి ఒక కారణం తిరువణ్ణామలైలో నేను చాలా కాలం క్రితం విన్నది! ఆ చుట్టుప్రక్కల సుమారు పదిమైళ్ళ మేర వాన కురియక జలాశయాలు ఇగిరిపోయాయట! జనం వచ్చి భగవాన్ రమణ మహర్షి వద్ద మొరపెట్టగా 'అక్కడ కూర్చున్నారు నాయన. వారితో చెప్పండి!' అని భగవాన్ అనగా ఆ వచ్చినవారు వెళ్ళి నాయనతో చెప్పారట! వెంటనే నాయన లేచి మహర్షితో చెప్పి ప్రతిజ్ఞగా ఒకమాట అన్నారట!

'మీ ఆజ్ఞపై వాన కురియడానికి అమ్మని ప్రార్థిస్తాను. రేపటి నుంచి ఏడు రోజులు దీక్షగా రోజుకి నూరు శ్లోకాలు. నూరూ పూర్తికాగానే ఆ సాయంకాలం పడమటను మెరుపులు మెరవాలి. ఏడోనాటి రాత్రి వాన కురవాలి. ఏనాడు మెరుపు మెరవకపోతే ఆనాటితో నా ప్రార్థనతోపాటు వ్రాసిన శ్లోకాలు కూడా రూపులేకుండా మాసిపోతాయి —'

ఇదే నాయన ప్రతిజ్ఞ. భగవాన్ చిరునవ్వుతో చూసి మీ మాటకి తిరుగు ఉంటుందా! అమ్మ వినదా? కానీయండి' - అన్నారట. ఆ మర్నాడు ప్రభాతకాలాన స్నానాదికం అయాక నాయన కొండపై ఉన్న ఆశ్రమానికి వెళ్ళి శ్లోకరచన ఆరంభించారట. రోజుకి నూరు శ్లోకాలు. నూరవ శ్లోకం పూర్తికాగానే సాయంకాలం పడమటన చిన్న మబ్బు - దానిలోంచి మెరుపు - దానిని చూసి నాయన సంతోషంగా కొండ దిగి వచ్చేవారట! అలా ఏడు రోజులూ కాగా ఏడవనాటి రాత్రి మింటికి మంటికీ ఏకధారగా తెల్లారేవరకూ జడివాన కురిసి ఏళ్లూ చెరువులూ ఏకమయాయట! జనం పరమానందం పొందినమాట వేరే వ్రాయనక్కరలేదు. అదే యీ యింద్రాణీ సప్తశతి:

జ్యోతిస్స్వరూపుడు ఇంద్రుడు. ఆ యింద్రుని జ్యోతి ఇంద్రాణి.

ప్రాణశ్చ ప్రణవో జ్యోతిశ్చాంబరగం
వస్త్వేకం త్రిగుణం నోవస్తుత్రితయమ్'

ప్రాణం, ప్రణవం, జ్యోతి — అనే గుణత్రయమూర్తి ఒక్కటే. మూడు వస్తువులని వేరే లేవు.

ఇది సద్రూపం, చిద్రూపం అని భావిస్తే రెండవుతుంది. ఉపాసకుల సంకల్పజన్యం అది - ఆ యీశ్వరతత్త్వం యీ ఇంద్రాణీ స్తుతిలో అజ్ఞులకూ ప్రాజ్ఞులకూ దర్శనమిస్తుంది. నిదానంగా చదివి అర్థం చేసుకోవాలి.

విశేషించి చెప్పవలసేది ద్వితీయ శతకంలో 'మధుమతీ స్తబకం శ్రద్ధాభక్తులతో నిత్యమూ పారాయణ చెయ్యదగినది నా అభిప్రాయం. 'మమ శచీశరణం' అనే మకుటం ఆ దేవి దివ్యప్రభా మకుటం

దీనియందు నాయన ఆ కాలంలో వైదేశిక పరిపాలనలో భారతభూమి దుర్దశను చెప్పుచూ విచారించడం, ఆ దుర్దశను పోగొట్టడానికి తగిన సాధనశక్తిని ప్రసాదించవలసిందిగా ఇంద్రాణిని ప్రార్థించడం చివరి శతకంలో ద్వితీయ స్తబకంలో

'తవాంబ! చరణం వ్రజామి శరణం' అనే మకుటాలతో వ్రాసిన శ్లోకాలు ఆయన దేశభక్తి తత్పరతకి శ్లోకరూపాలు.

నాయన ఖద్దరు వస్త్రాలే ధరించేవారు. తమిళనాడు కాంగ్రెస్ సంస్థతో అతి సన్నిహిత సంబంధం కలవారు.

ఈ కృతి ఇంతకుముందు ఆయన చివరిదశలో శిష్యులు ప్రస్తుతం కీర్తిశేషులు శ్రీ గుంటూరు లక్ష్మీకాంతంగారు ముద్రించారు. ఇప్పుడవి లభ్యములు కాకపోవడం, యీ రమణ సత్సంగం ముద్రించడం జరిగింది. మాననీయమైన పని చేసిందని మరి మరి చెప్పవచ్చు.

ఈ ముద్రణకి ఆర్థిక సాహాయ్యం చేసిన తిరుపతి దేవస్థానం యాజమాన్యం ధన్యమయింది.

నాయన గ్రంథాలు ఇంకా చాలా ఉన్నాయి ముద్రించవలసేవి. ఆంధ్రులకు ఆయన దూరమైపోవడం దురదృష్టం.

## శ్రీ శివసహస్ర నామావళి వివరణ

[రచయిత్రి: శ్రీమతి రోహిణి వేంకట సుందరవరద రాజేశ్వరి బాబా భవన్. 1వలైను, భారత్‌పేట, గుంటూరు, వెల తెలుపలేదు]

ఇంతకుముందు విష్ణు సహస్ర నామావళి, కృష్ణ సహస్ర నామావళి, వాటికి వివరణలు వ్రాసిన శ్రీమతి రాజేశ్వరి యీ రచన చేసి లోకప్రకాశం కలిగించి ధన్యజీవులలో మూర్ధన్యురాలయింది.

అద్వైత భావనలో శివకేశవు లొక్కటే. ఉపాసకుల మనస్తత్వానికి సన్నిహితంగా అపర నారాయణుని సంకల్పం ద్వైధీ భావం రూపొందించింది.

'నాయన' చెప్పినట్టు ప్రాణం, ప్రణవం, గగనభాసియైన జ్యోతి-ఒక్కటే. యోగమాయ ఒక్కటే. ఆమె అవతారాలు అనే లీలావతారాలు పన్నెండు - వాటికి పేర్లూ వేర్వేరుగానే ఉంటాయి.

ప్రకృతి పురుషుల సమైక్య స్వరూపం శివరూపం కాగా సదాశివుడుగా నిర్వాచ్యుడౌతున్నాడు. ఆ శివుని నామాలకు క్రమ పద్ధతిని వివరణ యీ కృతి ఆకృతి. ఆకృతిని నెరవేర్చి శ్రీమతి రాజేశ్వరి సుకృతి అయింది.

ఇందు శివుని నామములకు తెలుగులో వివరణ — ఆ నామములలో కొన్నింటికి సంబంధించిన కథలు — అలాగే శివుని నూటెనిమిది నామములు - వాటిలో కొన్నిటికి సంబంధించిన పురాణ కథలు సప్రమాణముగా సమకూర్చిన శ్రీమతి రాజేశ్వరి యీనాడు అంతో ఇంతో ఆస్తిక బుద్ధికల స్త్రీ పురుషులకు 'వరద రాజేశ్వరి-' అయింది.

శ్రీ అమ్మలయ్య చెప్పినట్టు భక్తి ప్రపత్తులతో తెలుగు ఇల్లాండ్రకు, ఆధ్యాత్మిక చింతన అలవరచుకొనే పిల్లవాండ్రకు ఈ వివరణ గ్రంథం ఎంతో ఉపయోగపడుతుందనడంలో సందేహం లేదు.

ప్రతి యింటా, ప్రతి గ్రంథాలయంలో ఉండవలసే గ్రంథం.

భారత ఉపరాష్ట్రపతివంటి మాన్య శ్రీయుతులు. పుష్పగిరి పీఠాధిపతివంటి జగద్గురువులు ప్రశంసించిన యీ కృతిని గురించి విశేషించి ఏమి వ్రాయాలి?

## శ్రీరామ సహస్ర నామస్తోత్రమ్ శ్రీ త్యాగరాజ సహస్ర నామస్తోత్రమ్ నామావళీ చ-

[సంకలయిత: శ్రీ పుల్లెల శ్రీరామచంద్రః, ప్రాప్తిస్థానం: శ్రీ పి. శ్రీరామచంద్రుడు, 7-1-32/4-పి-2, బేగంపేట హైదరాబాదు 400 016. కావలసినవారు ప్రతి 1కి 75పైసలు పోస్టేజికి పంపితే వస్తుంది - (అమూల్య మన్నమాట]

పోతనామాత్య రామదాసుల కోవకు చెందిన పరమభక్త శిఖామణి త్యాగరాజు. ఆయన కీర్తనలనుంచి ఎంచి సంకలనంచేసి శ్రీరామ సహస్ర నామావళి — రామాయణంనుంచి ఎంచి సంతరించిన శ్రీరామ-అష్టోత్తర శతనామావళి.

త్యాగరాజ జీవిత చరిత్రమును, కీర్తనలనూ ఆధారముగా చేసుకుని త్యాగరాజ సహస్ర నామావళి - సహస్ర నామాలకు టీక-ఈ కృతికి పుస్తకాకృతి.

స్తోత్రం-ఎక్కువగా అనుష్టుప్ వృత్తం, చివర ఆర్యావృత్తం శ్లోకాలకు ఉపయుక్తం.

శ్రీరామ సహస్ర నామస్తోత్రంలో కౌసల్యా నందవర్ధన-వంటివి వాల్మీకములు. గానలోల, కోదండరామ-వంటివి త్యాగరాజీయములు-అలాగే త్యాగరాజ సహస్ర నామస్తోత్రములో

'సద్యో యవనికాదిత
సంహృత ప్రతిసీరకః' — అనేది. 'తెరతీయగ రాదా! తిరుపతి వెంకటరమణ' — అనే కీర్తనను గుర్తుకి తెస్తోంది.

అటు వాల్మీకముతోనూ ఇటు త్యాగరాజ కీర్తనలతోనూ బాగా పరిచయం ఉన్నవారికి యీ సహస్రనామ స్తోత్రద్వయం సమకూర్చడంలో పుల్లెలవారు చేసిన కృషి, పడిన శ్రమా తెలిసి జోహారు లర్పించవలసి ఉంది.

శ్లోకాల నడకలో కూడా కొన్ని కొన్నిచోట్ల శ్రవణసుఖంగా కవితారీతి కన్పిస్తుంది.

'పాదవిజిత ముని శాపః' 'పాదవిజిత మునితరుణీశాప్య' అనే నామాలు శ్రీరామ సహస్రనామ స్తోత్రంలో సవరించాలనుకుంటాను.

ఏమైనా అసాధారణమైన ఘనకార్యంచేసి శ్రీరామచంద్రుడు సకలజన సంస్తవనీయుడయినట్టు విశిష్టరీతిని నా పలికేమాట!

—యామిజాల పద్మనాభస్వామి

## హేమంతగాలి

[శిఖామణి; వెల: రు. 6లు.; ప్రతులకు: 1) బుక్ సెంటర్, మెయిన్‌రోడ్, వైజాగ్. 2) అరుణా పబ్లిషింగ్ హౌస్, కార్ల్‌మార్క్స్ రోడ్, విజయవాడ]

శిఖామణిగారు ఇంతకుముందు మువ్వల చేతికర్ర వచన కవితా సంపుటిని ప్రచురించారు. ఇది వారి రెండవ కవితాసంపుటి. ఇందులో ఉన్న ఖండికలన్నీ మినీ కవితా ఖండికలు. మినీ కవిత్వాన్ని గురించి గతంలోనూ ఇప్పుడు కూడా కావలసినంత చర్చ జరుగుతోంది. చాలామంది మెరుపే వెన్నెలనుకుంటున్నారు. అది వారి దృష్టిదోషం.

విశ్వవిద్యాలయంలో పరిశోధనలు మినీ కవిత్వంమీద జరుగుతున్నై. కనుక ఇక దీనిగురించి ఎవరికీ ఎట్టి ఆక్షేపణా వుండదనుకోవడం ఆత్మవంచన. మినీ కవిత్వంలో కవిత్వానికి సంబంధించిన చమత్కారాన్నే కవిత్వ సర్వస్వంగా భావించేవారిని నిజంగానే మినీ కవులనాలనిపిస్తుంది.

హోరుగాలిలో ఉన్న మినీ కవితల్ని పరిశీలిస్తే ఆ చమత్కారం అక్కడక్కడా కనబడుతుంది.

ఇన్నాళ్ళు
కుక్కను చూచి
విశ్వాసాన్ని
గాడిదను చూసి
సహనాన్ని
అలవర్చుకున్న నీవు
ఇక నేర్చుకోవల్సింది
సింహంనుండే

దీంటో కొంత చమత్కారం ఉన్నమాట నిజమే. ఈ పాదాలన్నిటినీ కలిపి రాస్తే శుద్ధవచనంగా కనబడడమే కాక, అదే చమత్కారం వచనంలోనూ సాధ్యపడుతుందని తెలుస్తుంది. బెడ్‌కాఫీ అనే ఖండికను చూస్తే—

నిదుర లేచీ లేవగానే
ఉన్న ఒక్క పెదవినీ
నా కందిస్తుంది
ఆరోగ్య సూత్రాలకు
అతీతమైనది
దాని ప్రేమ

ఇట్లాంటి ఖండికల్ని ఏమనాలో పాఠకులే నిర్ణయించుకోగలరు

ఈ వ్యవస్థ
ఒక కొలిమి
జనం
ముడి ఇనుము
విప్లవం_
ఆరని రాక్షసిబొగ్గు
నిప్పు రాజేసే కమ్మరీ
నీ రాక ఎప్పుడయ్యా
నా దేశంనిండా
తగలేస్తేనే
బ్రతికే జనం ఉన్నారు.

ఇట్లా తగలేస్తేనే బ్రతికే జనంతోబాటు విప్లవాన్ని ఫ్యాషన్‌గా భావించే కవులు కూడా ఉన్నారని ఈయన ఇంకో ఖండిక రాస్తే బాగుణ్ణు.

## ఊళ్ళు ఉరుకుతున్నాయి

[బి. రాములు; వెల: పది రూపాయలు; ప్రతులకు: యువ రచయితల సమితి, నల్గొండ]

ఇది కవితా సంపుటి. ఎట్లాంటి భేషజాలు లేకుండా నడక చెడకుండా, తాను చెప్పదలుచుకున్నది సూటిగా, స్పష్టంగా చెప్పారు కవిగారు. ఈ కవితాసంపుటిలో అన్ని ఖండికలూ సమాజానికి సంబంధించినవే. ఉదాహరణకు

మెతుకును దాచినవాడు
మెతుకును దోచినవాడు
మెతుకును బంగారంగా
మార్చుకుంటున్నాడు
మెతుకు బంగారమయింది
బ్రతుకు అంగారమయింది.

ఈ పాదాలు రాములుగారి కవిత్వ సామర్థ్యానికి తార్కాణాలు. ఈ దేశంలో సామాన్యుడి జీవితం చేదు నిజంగా మారింది. ప్రతి మనిషి ప్రాణం ఎక్కడుందో ఈ కవి చాలా సులభంగా చెప్పారు.

బ్యాలెట్‌లో...
బ్యాంకు నోటులో...
బాయ్‌నెట్‌లో...
నా ప్రాణం
గిజగిజా తన్నుకుంటూంది
కాపాడమని వేడుకుంటూంది

ఇట్లా వీరి కవిత్వం వర్తమాన కాలానికి ప్రాతినిధ్యం వహిస్తూనే భవిష్యత్‌లో మంచిని ఆశిస్తోంది.

## వెలుగు పువ్వులు

[కొల్లూ రంగారావు; వెల: పది రూపాయలు; ప్రతులకు: కొల్లూరమ, 6-6-86, వివేకానంద కాలనీ, కామారెడ్డి-503 111

ఇది కూడా వచన కవితాసంపుటే. దీంట్లో కూడా సామాజిక బాధే ఇతివృత్తం. దీన్నిండా మినీకవితలు, మాక్సీకవితలు ఉన్నై. కవిత్వంకంటే వచనస్ఫూర్తే దీంట్లో ఎక్కువగా కనబడుతుంది.

ఎదటివారికి చెప్పుచూసేవారేకాని
ఎదుటివారు ఏమి చెబుతారన్న
ఆలోచన ఉంటేనా!
అసాధ్యమని తెలిసినా
అందరినీ ఆనందపరచాలన్న
ఆశయం ఉన్నవాణ్ణి.
లేశమంత రోషాలు
ఎవరి జీవితాల్లోనైనా
క్షమార్హాలే
లేశమంత సైతం
సుగుణాలు లేని ఎవరినైనా
ఎలా క్షమించగలం

ఇదీ వీరి కవిత్వ పద్ధతి. ఇలా ఉదహరించుకుంటూ పోతే చాలా ఉదహరించాల్సి ఉంటుంది. మొత్తంమీద ఆయన చెప్పదలుచుకున్నవన్నీ పైన ఉదహరించినరీతిలో చెప్పారు.

—శైలజ



Printed & Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 61247